శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల
హిందూపురము.

పుష్పము ౨౭

శ్రీ

# శ్రీ రామకర్ణామృతము

(ఆంధ్రీకరణము)

గ్రంథమాల - స్వర్ణోత్సవకానుక

(1931-1981)

గ్రంథకర్త
కవిభూషణ, కవితిలక

శ్రీ కల్లూరు అహోబలరావు

* Ist Edition
Copies 1100
1980 September.

* **Sree Rama Karnamrutamu**

* Kavibhusbana, Kavi Thilaka KALLUR AHOBALA
Author,



Book Publishers & Distributors
Sree Krishna Devaraya Grandha Mala
H-I-N-D-U-P-U R - 515 201.

* Cover Design :-
Kallur Rao, Hindupur. A. P.

* "Paper used for the Printing of this book has been made available by the Government of India at Concessional rate."

* **Price** N: **Rs. 12-00**

ప్రథమ ముద్రణము
సెప్టెంబరు 1980
ప్రతులు: ఒకవేయి నూరు

ఇది

శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాలవారి
'స్వర్ణోత్సవ' కానుక

ముఖచిత్రాలంకరణ:— కల్లూరురావు, హిందూపురం.

ముఖచిత్రము: . అనంతపురంలోని శ్రీ గీతామందిర మందలి
శ్రీ సీతారామచంద్రుల పాలరాతి విగ్రహాలు.

గీ॥ "తెలుఁగ దేల యన్న — దేశంబు తెలుఁ గేను
తెలుఁగు వల్లభుండ — దెలుఁగొకండ
యెల్ల నృపులు గొలువ — నెఱుగవే బాసాడి
దేశభాషలందు — దెలుఁగు లెస్స"

(శ్రీకృష్ణదేవరాయలు)



కృ త జ్ఞ త.

ఈ పుస్తక ముద్రిణమునకు భగవత్ప్రేరణచే శ్రీ తిరుమల, తిరుపతి దేవస్థానమువారు, హృదయ పూర్వకముగా రూ॥ 1030 ధనసహాయము చేసినారు. వారికి మా ధన్యవాదములు.

ఇట్లు
మేనేజింగ్ ఎడిటర్,
శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల.

"మాతృదేవోభవ"

కీ॥ శే॥ గూడూరు అశ్వత్థమ్మగారు

నా మాతృమూర్తి

పాద పద్మముల యందు



ఈ "శ్రీరామకర్ణామృత కృతి"

భక్తితో సమర్పణము

శ్రీ

# శారదావిద్యానిలయము — హిందూపురము.

**17-11-1956**

శ్రీ కల్లూరు అహోబలరావుగారికి సమర్పించిన 'కవిభూషణ' బిరుదు పత్రము.

ఆర్యా! తమ భాషాభిమాన మసమాన్యము. శ్రీరాయలసీమ కళాపరిషత్ 1-1-43 లో భాషా సేవకై ఈ గ్రామమున స్థాపింపబడగా, సూర్యోదయమును సూచించు భరత పక్షివలె, భాషాభిమానులరై - ముఖ్యముగ ఆంధ్రభాషాసేవకై 1931 లోనే భాషోద్ధారకుడును నృపకేసరియు నగు శ్రీ కృష్ణదేవరాయల పేరిట గ్రంథమాల నొకదానిని స్థాపించి, నిరంతరము పోషించుచు, ఇప్పటికి దాదాపు ద్వాదశ గ్రంథరాజముల

ప్రకటించితిరి. అందులో రెండవ పుష్పమగు "భావ తరంగములు" పదునొకండవ పుష్పమగు "పూఁదోట" తమ కవితా నేర్పును చెప్పకఁ జెప్పుచున్నవి. అముద్రిత గ్రంథములు తమవి యనేకములు; వానిలో కొన్ని

భక్త మందారము, సాయిబాబా గీతావళి, పుష్పబాణ విలాసము, గృహలక్ష్మి పద్యరత్నములు, మొదలగునవి. మాన్య వత్సరములను తమరు తమ "ఉగాది" పద్యమాలికలచే 1921—22 నుండి ఆహ్వానించు చున్నారు. ఇప్పుడు తమ "శ్రీరామ కర్ణామృతము" గృహలక్ష్మి ముఖమున పాఠకుల కాహ్లాద మొసఁగుచున్నది. తమ కవిత మృదుమధురము. కరుంగడు బాల్యముననే తమరు కుమార శతకము - భరత మాతృ శతకములచే "తెలుగు తల్లి"ని పూజించితిరి. నిరంతర నిరుపమాన కవితాధార తమది. ఈనాటి కవితా ప్రదర్శనమునే సదవకాశముగఁ గైకొని ఈ శారదా పీఠమువారు మిమ్ములను "కవిభూషణ" యను బిరుదముతో సత్కరించు చున్నారు.

స్వీకరించి మామ్మాశీర్వదింపఁ బ్రార్థన.

స భా ధ్య క్షు లు

లలితకవి
శ్రీ
టి. గురుమూర్తి,
ప్రధానోపాధ్యాయుఁడు.

రెడ్డి భీమరావు, మహాకవి, కర్ణాటకాంధ్ర కవికేసరులు
పంచరత్నం శేషప్ప, దుర్భాక కృష్ణయ్య,
కా ర్య ద ర్శు లు

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ మత్పరమహంస పరివ్రాజకేత్యాది బిరుదాంకితులగు శ్రీ కూడలి శృంగేరి జగద్గురు

# శ్రీ శ్రీ సచ్చిదానంద శ్రీ శంకర భారతీ

గురువర్యుల 12వ వర్ధంతి మహోత్సవ సమయమున (12-9-1959)

## సమర్పింపబడిన దండక దండప్రణామము.

శ్రీ సచ్చిదానంద! శ్రీ శంకరా! భారతీస్వామి! శృంగేరి కూడ్లీ మఠాధ్యక్ష! సంపూర్ణ చంద్రాస్య! యత్యంత సంతోష స్వాంతంబుతో, మీరలేతెంచి, యజ్ఞాన పాపాంధకారంబులోనున్న మావంటి మూఢాత్ములన్, జ్ఞానతేజమ్మునన్‌నింపి చీకట్లఁదోకార్చి దివ్యప్రబోధంబు నానొప్ప, సువృష్టిచే నాకసంబెంతయున్ మేఘసంక్రాంతమై యుండినన్‌గూడ, యాదుర్దినంబుల్ సదా మంచివైతోచె, నాశ్చర్య మేపార వాక్చాతురీ వైభవంబుల్ వినన్, శ్రోతలత్యంత సంతోషవార్ధిన్ గడున్ దేలిరో దేశికోత్తంస! యుద్దండమౌ, సంస్కృత శ్లోకముల్ జెప్పుచుండంగ. మేముందు మేముందటంచున్ వడిన్‌వచ్చు మీజిహ్వపై తాండవింపంగ; మీ పూర్వ పుణ్య ప్రభావంబొ! మానోములో, చెప్పగానేరమో స్వామి! యవ్వాని కర్ణాట కాంధ్రంబు లందద్వితీయంబుగా యుక్తి యుక్తంబుగా నెన్నియేనిన్ కథల్‌జెప్పి, గుహ్యంబులౌ వేదవేదాంత సూక్ష్మార్థ తత్త్వంబులన్‌విప్పి, సాధించి బోధించి [illegible]

బొందుచున్, (దవ్వి గైకొన్నవారల్ సుధాభాండ మద్దిపికై, పక్షపాతంబుగలెన్; సుధాబింబువుల్ దేవతల్
(తావి రా రాక్షసుల్ చింతలోమున్ని, రా పక్షపాతంబు లేదిందు ఓస్వామి! మీవాక్సుధావృష్టి తాఁబుట్టి తాలభ్య
మాయెన్; సదా తృప్తిగలైన్ పర్జిజాపీక మేపక్షపాతంబు లేకుండగాఁబంచుకొన్నార; లీక్రుళ్య్రమాళ్చర్య మాశ్చ
రంబో నచిందానంద! మీనామధేయంబు శ్రీ శంకరాలిఁజో సేవవింపంగ. సత్ చిత్తుతో గూడుచున్ సచ్చిదా

నంద మాయెన్; రసోపేతమై, పూర్ణమై గావునన్గా మా మనోభాండముల్ గూడ, దివ్యామృతంబుగా ముదం
బారగా నిప్పు డిండించె; మీ నామధేయంబు సార్థంబు శ్రీ సచ్చిదానంద! శ్రీకృష్ణసందేశ గీతార్థగానంబు
లాచార్య వ్యాఖ్యానమేతంబు రామాయణంబున్ రహిన్ భారతామ్నాయ మా భక్తపోతన్న గ్రంథంబు
లందున్న గుట్టుల్ ఋషిప్రోక్తమైనట్టి వేదాంత శ్రీ సూత్ర భాష్యంబు శాకుంతలంబున్ రహిన్ జెప్పి భాషిం
చితౌ సద్గురూ! మిన్ను మన్నేకమై, వాక్సుధావృష్టి పర్వెన్ విహంగంబు లారాజహంసల్, సదావృష్టిపై
పైబడన్. మానసంబందు, వాసంబుజేయంగ రాకున్కి వర్షర్తు నందెందొ యూడేగెడిన్ యిద్ది నైజంబుగా!
మీరు శ్రీహంసలై యుండియున్ గూడ, మీ మానసంబున్ ప్రియంబారగా వీడకే సచ్చిదానందమున్ గూర్చు
చున్నారు; శ్రోతల్ కడున్ ధన్యులై నారలో శ్రీజగత్స్వామి! మీవాక్కు లానందమున్ గూర్చుచేకాక,
దుఃఖంబు బోగొట్టి సౌఖ్యంబుఁజేకూర్చు పూర్వంబు శ్రీశంకరాచార్యు లత్యంత యుత్సాహమువొప్పంగ.నాసేతు
శీతాద్రి పర్యంతమున్ శిష్యతండంబుతో వెళ్ళుచుగా నాస్తికత్వంబు నిర్మూలమున్ జేయుచున్ అస్తికత్వంబు
స్థాపించుచున్ వేద విజ్ఞాన తత్త్వంబు బోధించుచున్ భారతంబున్నత శ్రేణికిన్ దెచ్చి రాలీల యోభారతీ! శంకర
స్వామి! దేశాటనంబున్ వెసన్ జేసి, ధ్వంసంబుగా నున్న బ్రాహ్మణ్యముగా దక్కు త్రైవర్ణ్య ధర్మంబులుగా,
శక్తి దీపింప స్థాపించుచుగా పాలితుల్ పాలకుల్ భ్రష్టులైపోక, శ్రీ ధీహితంబుల్ దగా దెల్పుచుగా ధర్మ
సంస్థాపనంబుల్ వెసన్ జేయుడీ శ్రీ భారతీ శంకరస్వామి! బ్రహ్మాండ భాండంబులన్ నిండి కొండాడగా వెల్గు
కోదండరాముండు ఈ దండకంబొండు పూదండగా మీకు వే దండముల్ సల్పి యర్పింప బ్రోత్సాహమిచ్చెన్ గా
కడుగా భక్తినర్పింతుఁ గైకొండు శ్రీ పండితోత్తంస! యాశీస్సులందింపు మార్యా! నమస్తే నమస్తే
నమస్తే నమః.

భ వి చ్ఛి ష్య ప ర మా ణు వు.

హిందూపురం )

"శ్రీ విద్యాశంకరో విజయతే"

శ్రీ మత్పరమహంసేత్యాద్యనేక బిరుదాంకిత శ్రీ కూడ్లీ శృంగేరి శ్రీ మజ్జగద్గురు

# శ్రీ సచ్చిదానంద శ్రీ శంకర భారతీస్వామిభిః

అస్మదత్యంత ప్రియశిష్య కల్లూరు గ్రామాభిజన. శ్రీ అహోబలరాయ శ్రీయోభివృద్ధై

కాలత్రయ విరచితాశీః పరంపరా పురస్సర నారాయణ స్మృతయస్సముల్లసంతుతరాం

ఇషమః వికారి సంవత్సరీయ ఆశ్వయుజ శుద్ధ విజయదశమీ భానువాసర పర్యంతం హిందూపుర గ్రామే పూర్వాచార్య గ్రథిత భాష్యాద్యవలోకన జనిత నిజానందామనుభూత్వా నివసామః

ఆసేతు సీతాచల విఖ్యాత శ్రీ మచ్ఛంకర భగవత్పూజ్య పాదాచార్యా విచ్ఛిన్న పరంపరాగత దక్షిణామ్నాయ పీఠవిషయిణీ భక్తిః నిరవధిక శ్రేయోవిధానంఖలు

సంప్రతి

అస్మిన్ దినేఽత్ర హిందూపురగ్రామేస సమారంభం నిర్వర్తిత మహోత్సవావసరే విజయదశమ్యాంగ చైత్రయాత్రానంతరం సమావిష్టే విబుధసదసి సంతుష్టాంత రంగావయం యుష్మభ్యం "కవితిలకం" ఇత్యుపాధిం పారితోషిక పరికరైస్సాకం సప్రమోదం వితరామః అస్యార్థస్య సంసూచకమేతత్పద్యం.

శ్రీ మత్కాశ్యపమౌని వంశజనితః కల్లూరు వాసీబుధా
శ్రీః కాంతౌకృదహోబలాభిద బుధః కృష్ణాత్మజ భక్తిమాన్
విద్యత్సేవక కృష్ణరాట్టభువరాంధ్ర గ్రంథమాలారతః
సోఽస్మాభి "స్తిలకం కవిష్వి" తిముదా సమ్మానితోస్త్వద్యవై ॥

భగవతోః శ్రీ శారదా చంద్రమౌళ్యోరకంపానుకంపయా పుత్రపౌత్రాభివృద్ధి మాయురారోగ్యాది భాగ్యవాన్ సుకవితా రచనరూప సాహిత్యసేవా మనుతిష్ఠన్నేధతాం సుచిరమితివయ మాశాస్మహే.

ఇతి నారాయణ స్మృతయః
(12—9—1959)



ఉ॥ మూషకవాహనుఁ బహుళ మోదక ఖాదకు, నేకదంతునిఁ
భూషణ సర్పరాజకుని - భూరి, మహోదరు, నీకు పుత్రునిఁ
తోషణ వేషు. విఘ్నములఁద్రోసి, శుభంబులఁ గూర్చు దేవునిఁ
పోషిత భక్తులఁ గలుగు-ప్రోడ, వినాయకు, భక్తిఁగొల్చెదఁ 1

గీ॥ చేటచెవుల వేల్పు - చిన్నారి పిల్లారి
చిన్ని కనులవాఁడు - చిలిపికాఁడు
ముదము తోడ దినము - ముక్కంటి పండుల
మెక్కువాఁడు నాకు మేలుసేయు. 2



గీ॥ శ్రీ నృసింహమూర్తి; చెలువారగా, నహో
బలమునందు, వెలసి - భక్తజనుల
కోరికలను దీర్చు - కోమల మూర్తి, మా
యింటివేల్పు. నభినుతింతు సతము. 3

చం॥ చెలువముతోడ, భక్తజనసేవకుఁదోచు, ముదంబుతో, నహో
బలమున, చెంచులక్ష్మి - పరివారముతో, నినుసేవనల్ప, ము
ద్దొలుకు, నృసింహదేవ! పరితోషము, తాండవమాడ నెత్తిపై
జిలుకుము, దీవనామృతపుజిన్కులు, కావ్యముమోద మందగఁ 4



ఉ॥ ఏణులు నాలకింప, జివురింపగ, వృక్షములన్ జివుళ్లు, గీ
ర్వాణి, ప్రశంససేయగను - రాల్గరుగంగను, భక్తిగీతముల్
వీణను మీటి పాడుచును-వీనుల విందులు సేయునట్టి శ్రీ
వాణి, నుతింతు సద్విమల పద్యకవిత్వము, నాకు నబ్బగన్. 5

చం॥ జిలిబిలి పల్కులన్ తెలుగు జిన్నెలు వన్నెలు జిందులాడ, కో
కిల, కల నాదముల్ వెలయఁ గిన్నెరసానులు నటువాడగఁ
గలకల తెల్గు కబ్బములు - కమ్మగ నేరచియింప, జిహ్వపై
గులుకుచు నాట్య మాడగను గోరి, స్తుతించెద వాణి భక్తితోన్. 6

కం॥ జిలిబిలి ముద్దుల పలుకులఁ
గిలుకుచు, నాతెలుగువాణి, గీర్వాణపదం
బులతోఁగలసియు మెలసియు
వెలయించును. నాదుకృతి; వివేకులు మెచ్చన్. 7

కం॥ శారద! శ్రీ సారస్వతి!
భారతి నేనిన్నుఁగొలుతు - పద్మజురాణీ!
శ్రీరాముని కర్ణామృత
సారము నాచే దెలుంగు సల్పుము వాణీ! 8



ఉ॥ రామకథా సుధా రసము-ద్రావి జనంబులు, మోక్షమొంద, క
రామృత మెల్లవారు, దెలియన్ రచియించి తెలుంగుబాస, శ్రీ
రామః మృదూక్తులన్ సులభరమ్య పదంబుల నేర్చి కూర్చితిన్
స్వామి! ప్రియంబొ-అప్రియమొ-స్వాదువొ-చేదొయొయుంగ నెద్దియున్ 9

## ఆ ది శం క రు ల క భి వా ద ము లు

గీ॥ ఆది శంకరాచార్యుల - నభి నుతించి
సంస్కృత శ్లోకములకు, నంజలి ఘటించి
పెక్కు గీర్వాణ కవులకు మ్రొక్కులిడుచు
రామ కర్ణామృతంబును వ్రాసినాడ
తెలుగు పద్యంబులఁ దేట తెల్లముగను. 10

## తెలుగు కవులకు మ్రొక్కులు

ఉ॥ నన్నయగాదు నేబలుక నాణ్యముగా, కవిఁ వ్రాయనేను, తి
క్కన్ననుగాను; పెద్దనను గాను - రసోచితభంగి వ్రాయ, పో
తన్ననుగాను; భక్తిభరితంబుగ వారికి మ్రొక్కులిచ్చి నే
దిన్నగ వ్రాసినాడను; సుధీమణు లార్యులు - ఆదరింపుడీ ।

గీ॥ భాస్కరుని, రంగనాథుని ప్రణుతి జేసి
ఆంధ్ర వాల్మీకి కవులకు నంజలించి
విశ్వనాథుని, ఘనమంచి - వినుతి జేసి
అష్టదిగ్గజ కవులను - యభినుతించి, 12

గీ॥ ఆంధ్రదేశంబు నందున్న - యఖిల కవుల
సంస్మరించి, శ్రీనాథుని స్మరణజేసి
మొల్లమాంబను వినుతించి, ముదముతో, ని
టీవల గతించిన, కవుల కీవిగాగ
తలతు నీరీతి వారి యాత్మలు సుఖింప.

## ఇరువదియవ శతాబ్దములో కీర్తిశేషులైన కవి పండితుల స్మృతి

సీ॥ రావాడ శాస్త్రులు - రాళ్ళపల్లి అనంత
కృష్ణశర్మయు, దివికేగినారు;
దుర్భాకవారు, మద్దులపల్లిశర్మయు
మలుగూరు గురుమూర్తి - మాన్యకవులు
భాస్కరాచార్యుండు - వావిలికొలను, సు
బ్బారావును, మరూరివారు జనిరి;
కప్పగల్లు కవియు - గార్లదిన్నె కవియు
కిరికెర కవిగారు - సురపురంబు

గీ॥ జేరి రెమ్మనూరువారు, సుబ్రహ్మణ్య
కవులు, దేవదాన కవులు స్వర్గ
లోక వాసులైరి; లోకమే - చీకటి;
అట్టి కవులనెల్ల - నభినుతింతు.

సీ॥ చిలుకూరు కవియేగె - శేషప్ప ఆంజనే
యుడుదార కవిలేడు, పుడమినేడు;
కలుగోడు అశ్వత్థ కవిపుంగవుడు, స్వర్గ
పురిఁజేరె; కొండూరి బుధుఁడులేడు;
కూరతాళ్వారు - వైకుంఠంబు జేరిరి
కట్టమంచియు నేడు గానరాడు;
పిళ్లారిశెట్టి కవీంద్రుఁడు - పూతల
పట్టు శ్రీరాములు దిట్టకవులు

గీ॥ ఏగినారు, స్వర్లోకంబు; మూగవోయె
కవుల సామ్రాజ్య విభవంబు కలల భంగి;
వారి యాత్మలు సుఖియింప - భావమందు
దలచి కన్నీటి చినుకుల జిలకరింతు.

సీ॥ జనమంచి శేషాద్రి - శర్మయు దివికేగె
కల్లూరి యజమాన కవియు లేడు
రూపన గుడివారు - రూఢిగాలేరైరి
సోంపల్లె కవిగారు - సొంపు జెడిరి
ధర్మవరము కవుల్ - ధరణిలోలేరు; కో
లాచలము కవులు - రారు మఱల
వేదము వేంకట విబుధులు లేరైరి
నాగనార్య కవియు నేగె దివికి

గీ॥ వీరరాఘవశాస్త్రిలేరైరి; స్వర్గ
మేగి రుప్పల కవులెల్ల; నింకమీద
కవితకెట్టి దుర్దశకల్గగలదొ? కాక
వులు, విజృంభింప కవితతెన్నులు - కృశించు.

ఆ॥ ఓ। కవీంద్రులార। నాకలోక నివాసు
లార! మిమ్ముదలచి - లాలితముగ
కవితవ్రాయనెంతు - కమ్మని కవనంబు
నాకు గలుగ, దీవనములనిండు

## షష్ఠ్యంత మంగళాష్టకము

కం॥ శ్రీరామచంద్రమూర్తికి
ధారణి పుత్రీవిభునకు - దాశరథునకుఁ
ధీరోదారున కవ్యయ
పూరుషునకు - మంగళములు బొనరింతుఁదమిఁ ౧

కం॥ మంగళము - విష్ణుమూర్తికి
మంగళమగుగాత। సతము - మధుసూదునకుఁ
మంగళము - సౌమ్యమూర్తికి
మంగళమగు; మాధవునకు - మహనీయునకుఁ ౨

కం॥ మంగళము శ్యామ మూర్తికి
మంగళమగు — వేదవేద్య — మానితునకు, శ్రీ
మంగళము — జానకమ్మకు
మంగళమగుం బుణ్యచరిత భరితున కెపుడున్ ౩

కం॥ రంగారు మంగళంబులు
సింగారపు, రామునకును - శ్రీహరికెపుడున్
మంగళభవ్యంబులు, శ్రీ
రంగనికిన్ ముక్తిచరణ - రాజీవునకున్ ౪

కం॥ సింగారంబుగ, మంగళ
భంగిమములుగల్గు — రామభద్రునకెపుడున్
మంగళము శేషశాయికి
మంగళమగు, గరుడిరవుతు మహిమాత్మునకున్ ౫

కం॥ మాధవునకు, మంగళమగు
సాధకునకు, జ్ఞానతత్త్వ - సంపూర్ణునకున్
బోధకునకు, మంగళమగు
రాధానాథునకుంగల్గు పవిత్రమంగళముల్ ౬

కం॥ గరుడధ్వజునకు, మంగళ
మరుదారన్ధాత్రిసుతకు - మంగళమగు; బం
గరు లక్ష్మణునకు, శుభములు
భరతునకున్ మంగళములు - భద్రాత్మునకున్ ౭

కం॥ అభవున కంజన సుతునకు
శుభములు; శత్రుఘ్ననకు - సుశోభన జయముల్
త్రిభువన పతికిన్ హరికిన్
విభవపు జయ మంగళములు విభునకు సతమున్ ౮

ఓం తత్సత్

# మనవి మాటలు

శ్రీ పరమేశ్వరుని లీల లత్యద్భుతములు. అతని సంకల్పములు, సత్యముగా నెరవేరును. మానవుడు నిమిత్తమాత్రుడనుట తథ్యము.

శ్రీ శివతుల్యుండగు ఆదిశంకరులు ఈ శ్రీరామకర్ణామృతమును, సంస్కృత భాషలో 4 ఆశ్వాసములుగా రచించిరి. శ్రీ సిద్ధకవిగారు దీనిని మొట్టమొదట ఆంధ్రీకరించిరి. ఏబది ఏండ్లుగా, ఈ శ్రీరామకర్ణామృతము నాకు నిత్య పాఠమైనది. శ్రీ సిద్ధకవిగారి ఆంధ్రానువాద పద్యములను కూడ, నేను చదివితిని. ఈ పద్యములు, మూల శ్లోకములకంటె క్లిష్టతరముగా వున్నవని నా అభిప్రాయము. సామాన్యమానవులకు సులభతరముగా అర్థముకావు.

'ఎవ్వరెన్ని గతుల - నింపారఁబాడిన, రాము కథలు మిగుల-రాణకెక్కు' అను సామెత ప్రకారము, నా యోపిన కొలది ఈ శ్లోకములను, సరళముగా తెలుగు పద్యములలో వ్రాసి, 1957 వ సంవత్సరములో ప్రతి నెల కొన్నిపద్యములను 'గృహలక్ష్మి' మాసపత్రికకు పంపగా, అప్పుడా పత్రికాధిపతులైన డాక్టరు శ్రీ కేసరిగారు (మద్రాసు) దయతో, ఆ పద్యములను ప్రతినెల తప్పక ప్రకటించుచు, నన్ను ప్రోత్సహించిరి.

ఇట్లు, 4 ఆశ్వాస పద్యములు 'గృహలక్ష్మి' మాసపత్రికలలో, ప్రకటింపబడెను. ఇప్పుడా 'గృహలక్ష్మి' మాసపత్రిక లేదు. దాని అధిపతులైన, శ్రీకేసరిగారు కూడా గతించిరి. వారు బ్రతికియున్న కాలములో, ప్రతి సంవత్సరము, కవిత్వములో వాసికెక్కిన విదుషీమణులకు, స్వర్ణ కంకణముల దొడిగి కీర్తి సంపాదించిరి. ఇప్పటి వృద్ధులకీ విషయము లన్నియు, కరతలామలకములు. ఆ కాలములో కవిపండితులను సన్మానిం

చినవారిలో ఒకరు శ్రీ దేశోద్ధారక, కాశీనాథుని నాగేశ్వరరావుగారు రెండవ వారు శ్రీ కేసరిగారు. వారు నిత్యము స్మరణీయులు.

ఆ పద్యములను భద్రముగా నేను కాపాడితిని. వాటిని శ్రీ మద్దుల పల్లి వేంకట సుబ్రహ్మణ్యశర్మగారికి (నంద్యాల) పరిశీలనార్థము పంపు కొంటిని. వారచ్చటచ్చట, నా పద్యములను సవరించి మెఱుగు బెట్టిరి. వారికి నే కృతజ్ఞుడను. వారు, కాలగర్భములో కలసి పోయిరి. వారి ఆత్మకు శాంతి కల్గుగాక!

ఈ శ్రీరామకర్ణామృతము రామాయణ కథవలె, వరుసగా లేదు. ఇది యొక పారాయణ గ్రంథము. శ్రీరామస్తోత్రమే, ప్రధానమైన విష యము కాన, బాలకాండములో, యుద్ధకాండ ప్రశంసన, యుద్ధకాండములో, కిష్కింధాకాండ ప్రశంస కిష్కింధాకాండములో, బాలరాముని ప్రశంస, ఈరీతిగా, కర్ణామృతముగా శ్రీ ఆది శంకరులు శ్లోకరూపమున శ్రీ సీతా రాములను వర్ణించి, స్తోత్రమొనరించి ధన్యులైరి. నేను నా ఆంధ్రీకరణ మందు, మూలము యొక్క భావమును విడువక, అచ్చటచ్చట భక్తిపార వశ్యమున కొంత స్వేచ్ఛ తీసుకొని, సకల మానవులకు సులభముగా అర్థము కావలయునను దృష్టితో, సీస, గీత, ద్విపద, మంజరీ, కంద పద్యములలో వ్రాసితిని. మొత్తము 431 శ్లోకములకు తెలుగులో 464 పద్యములైనవి. అనగా పద్యములు 33 మాత్రమెక్కువైనవి.

ఈ నా కావ్యము అచ్చుకాలేదను చింత నాయందుండెను.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు, మతసంబంధమైన అము ద్రిత గ్రంథములను ప్రకటించెదరను వార్త విని, ఈ శ్రీరామకర్ణామృతము వ్రాత ప్రతిని వారికి 1970 జూలై నెలలో పంపుకొంటిని. వారు జాగ్రత్తగా పరిశీలించి, 1970 డిశంబరు మాసమున ఈ పుస్తక ముద్రణమునకు

రూ॥ 1030 మాత్రము శాంక్షను చేసిరి అందుపై కొంత ధైర్యము రాగా ముద్రణ మొదలుపెట్టి, ఈ నాటికి శ్రీ పరమేశ్వరుని దయతో ముగించితిని. కావలసిన తెల్లకాగితములు, ముందుగనే గవర్నమెంటు వారినుండి కన్సెషను రేటుకు తెప్పించుకొని యుంటిమి గాన, ఈ శ్రీరామకర్ణామృతము ప్రింటింగు త్వరలో ముద్రింప గల్గితిమి. పేపరు కాక, బైండింగు మొదలగు ముద్రణమునకు 4 వేలు రూపాయలకు మించినవి. కొందరు దాతలుగా చేరి రూ॥ 116 విరాళములిచ్చి మమ్ములను ప్రోత్సహించిరి. వారి చిత్రపటము లిందు ముద్రించినాము. వారిని శ్రీరామచంద్రుడు, సంరక్షించుగాత!

అనంతపురము, శ్రీ గీతామందిరములోని, శ్రీ సీతారామలక్ష్మణుల ఫోటో నొసగి దాని బ్లాకు ఖరీదుల నిప్పటయేకాక, గ్రంథములకు రూ॥ 116 విరాళ మొసంగి మమ్ము ప్రోత్సహించిన శ్రీరామభక్తులైన శ్రీ పరుచూరు హనుమంతయ్యగారు శ్రేష్ఠిగారికి, వారి కుటుంబము వారి కందరికి శ్రీ సీతారామ భద్రుడు, భద్రమైన ఆయురారోగ్య సౌభాగ్యములొసంగి, సదా రక్షించుగాత యని, ఆ పరాత్పరుని ప్రార్థించు చున్నాను.

ఈపుస్తక ముద్రణమునకు విరాళములొసంగిన దాత మహాశయుల కందరికి కృతజ్ఞతల నర్పించుచు, స్వల్పకాలములోనే. సర్వాంగ సుంద రముగ ముద్రించి యిచ్చిన భారత్ ప్రెస్సువారికి మా కృతజ్ఞతల నర్పించు చున్నాము.

కోరినదే తడవుగ శ్రీ జోస్యము జనార్దనశాస్త్రిగారు తమ పీఠికను పరిచయము అనుపేరున వ్రాసి పంపిరి. అట్లే మధురకవి బెళ్ళూరి శ్రీనివాస మూర్తిగారు తమ అభిప్రాయము వ్రాసి పంపిరి. వారికి నిందు జోహారులు. శ్రీగొల్లాపిన్నిగారు, మఱికొందరు తమ అభిప్రాయముల నందజేసిరి. వారికి నాప్రణామము లర్పించు చున్నాను.

ఈ శ్రీరామకర్ణామృత కావ్యము నిత్యపారాయణమున కనుకూలముగా నున్నది. శ్రీరామభక్తులు పారాయణ గ్రంథముగా, దీనిని వాడుకొనవచ్చును. భక్తుల కోరికలను, సత్యముగా శ్రీరామచంద్రుడు తీర్చి, వారిని తరింపజేయగల్గుననుటలో సందేహము లేదు.

ఇట్లే శ్రీలీలాశుకులు రచించిన, శ్రీకృష్ణకర్ణామృతమును కూడా ఆంధ్రీకరించినాను. దాని ముద్రణ భాగ్యమెప్పు డబ్బునో వేచి చూతము.

ఇట్లు విన్నవించు,
సుధీజన విధేయుడు,
కవిభూషణ, కవితిలక
కల్లూరు అహోబలరావు

# పరిచయము

వాఙ్మయము మానవులకు భగవద్దత్తమైన వరము. సృష్టిలో మిగత జంతుకోటికంటె విశిష్ట ఆధిక్యము, దీనితోనే ప్రాప్తమైనవి. అశేషవ్యవహారసాధనకైన వాఙ్మయముకంటె, విజ్ఞాన సముపార్జనోపయోగి యైనది సారస్వతము. ఉత్తమ పురుషార్థ సిద్ధిలో ఆనంద సంధాయకమై, అతిశయించునది సాహిత్యము. అట్టి సాహిత్యమును భగవత్పరమొనర్చి, తత్కృపా పాత్రులై జన్మధన్యత గావించుకొనుట, వివేకలక్షణము. 'తైర్దత్తా నప్రదాయైభ్యోయో భుఙ్క్తే స్తేన ఏవ సః' అను గీతా వాక్యమును ఈ సందర్భమున సైతము ననుసంధించుకోవలెను.

సంస్కృతము మొదలుకొని అన్నిదేశభాషలయందును సాహిత్యమును భగవత్పర మొనరించిన మహనీయులు వెలసినారు.

"పలికెడిది భాగవతమట ; పలికించెడివాఁడు రామభద్రుండట నేఁ, బలికిన భవహర మగునట । పలికెద, వేఱొండుగాథ పలుకగ నేలా" అన్న పోతన ఆంధ్రుడు, మనవాఁడు, ఆదర్శప్రాయుఁడు. ఆ యనఘుని, యడుగుజాడలలో నడచిన సాహిత్యారాధకు లెందరో కలరు. మన శ్రీ కల్లూరు అహోబలరావు గారొకరు. జెందినవారు. "కీలబొమ్మగ నన్నుంచి కేవలముగ...... మురిగించె" నన్న పరిణత మనస్కుఁడీ కవి.

సాక్షాత్ శంకర స్వరూపులైన శ్రీ శంకర భగవత్పాదులు "జానాతి రామ తవనామ రుచిం మహేశః" అన్నట్లు పూర్వస్మృతి ననుసరించియే కావలయు శ్రీరామ మహిమామృతమును, మననము చేసికొనుచు, మన వంటివారికై, నవ్యాతాను రాగముతో, తమ మనోభావ మకరంధమును "రామకర్ణామృత" మనుపేర ఛందోబద్ధ వాగ్రూపమున ననుగ్రహించిరి. అయ్యది మృదు పద బంధ మాధుర్యముతోనే, మనసులను మత్తెక్కించి, కర్ణామృత ప్రాయమగుచున్నది. భక్తిభావ తాత్పర్య మనన మార్గమున, మన్నించువారికి మరేమి చెప్పవలయును ?

ఈ గ్రంథనామమును బట్టియే శ్రీరామావతార కథా ప్రాధాన్యమును ఊహింపవచ్చును. రాముఁడే పరదైవముగా, తద్రూప-లీలావిలాస-పరాక్రమ-ప్రభావ-ప్రాభవము లు, వివిధ భంగ్యంతరములలో నిందు విస్తరింపబడినవి. విశేషమేమన; రాముఁడు కేవలము రఘువంశావతంసముగానే కాక కృష్ణ-నరసింహాద్యవతారాంతరాభేద రూపుఁడుగ, వైకుంఠవాసి విష్ణువుగా, బహుశిరః కరధర భయంకర, విశ్వరూపుఁడుగా, శరీర షట్చక్ర సంచారాంతర్యామ్యాత్మ స్వరూపుఁడుగా; పరబ్రహ్మముగా భావించి, దర్శించి, వర్ణింపబడినాఁడు.

ఈ రామకర్ణామృతము నిదివరకే శ్రీ చేకూరు సిద్ధకవి పద్యాత్మకముగ తెనిగించి యుండిరి. ఇపుడు శ్రీ కల్లూరు అహోబలరావుగారు కూడ

ఆంధ్రపద్యానువాదము కావించిరి. సిద్ధకవిగాను పాండిత్య కవిత్వముల లోను, భక్తియందును సిద్ధహస్తులే. వారివన్నియు శార్దూల, మత్తేభ, ఉత్పల చంపక మాలాదులు, చతుర్విధ వృత్తములే. ఆ నియమముతో, మూలము నందలి చిన్నశ్లోకములను, పెంచి వ్రాయుట, ఒకచో సంగ్రహించి కుదించుట, తప్పని సరియైనది. శ్రీ రావుగారు సామాన్యముగ సీస లనే ఎక్కువగా వాడినారు. ఆటవెలది-తేటగీతులు-మంజరులను గూడ గ్రహించినారు. మధ్యనకు రెండు మూడు కందములు మాత్రమే కనంబడుచున్నవి. వీరును పోతనను. ఒరవడిగా పెట్టుకొని మూలము నందలి భావములను విస్తరించుచు, విరివిగ సాగించినారు. పద్యములు జాతీయము లగుటయేకాక, శైలియు మిక్కిలి సరళమై, సులభాన్వయము కలిగి, సామాన్యులకు సైతము పఠనయోగ్యములుగ నున్నవి.

శ్రీ కల్లూరు అహోబలరావుగారు ఆంధ్ర సారస్వతేయులకు సుపరిచితులే. శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాలను స్థాపించి, తద్వారా అనేక కావ్యములను అందించుటేకాక, 'ఉగాది స్వర్ణభారతి' 'భక్తమందారము' మున్నగు స్వయంరచనలు వెలయించి విఖ్యాతులైన వారు. రాయలసీమ రచయితలలోని స్తబ్ధత్వమును సడలింపఁజేసి, వారివి రచనలకు ప్రోత్సహించి. తత్ప్రకటనల ద్వారా తెలుగునాట, వెలుగులోనికిఁదెచ్చుటలో, నిర్విరామకృషి సాగించిన కార్యశూరులు, శ్రీ కల్లూరివారు. వీరి వేషము వలెనే భాష-భాషవలెనే భావము-భావమువలెనే, కవిత-చాల సహజము సరళము-తేటదనము-కలిగియుండును. అన్నింటి యందును ఆధునికమైన యాడంబరములు, ఆర్భాటములు, ఒడుకు దుడుకులు-వంక టింకరలు మచ్చునకుగూడ కానరావు. ప్రాచీన సంప్రదాయమునకు, పారమార్థిక భావభంగిమలకు, వీరును, వీరి కవితయు, నాలవాలములు.

ప్రకృతము మూలమునుగురించి ముచ్చటించుటకు మన కధికారము, నర్హతయు లేవు. పూర్వాంధ్రానువాదమును గూర్చి తడవుట, తర్కించుట, ప్రస్తుతము, అధిక ప్రసంగము కూడ. శ్రీరావుగారి యనువాదమున మెఱుగులు నా అలతి యొఱుక కందినవి. వానిని కూడ గ్రంథవిస్తరభీతితో మచ్చున కొకటొకటిగా పాఠకులకు చవిచూప యత్నింతును.

మూలము—1. అశ్వా—80 వ శ్లోకము

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేద: ప్రాచేత సాదాసీత్సాక్షా ద్రామాయణాత్మనే

సిద్ధకవి అనువాదము

ఉ॥ ఆగమవేద్యుఁడై నహరి । యాజితనూభవుఁడై జనించుచో
నాగమసంచయం బుచిత । మయ్యెను రామకథా స్వరూపమై
బాగుగ వామలూరు భవ । భవ్య కవిత్వమునన్ బ్రసన్నమై
భాగవతాగ్రగణ్యులకుఁ । బథ్యము నై శ్రవణార్హమై గదా.

ఈ పద్యమున చివరి రెండు పాదములు పద్యపూరణమునకై కల్పితములే.

శ్రీరావుగారి అనువాదము.

ఆ॥వె॥ వేదవేద్యుఁడైన యాదిదేవుండె తాఁ
దనయుఁ డగుచు వెలసె దశరథునకు
అతఁడు పుట్టినంత నావేదచయము, రా
మాయణం బనంగ మహిని వెలసె.

ఇందు భావము ముక్తసరిగ పొందుపడినది.

మూలము 1వ అశ్వా 36 వ శ్లోకము.

జానాతి రామ! తవ నామ రుచిం మహేశో
జానాతి గౌతమసతీ చరణ ప్రభావం.
జానాతి దోర్బల పరాక్రమ మీశచాపో
జానా త్యమోఘ పటు బాణగతిం పయోధిః.

పూర్వానువాదము—సిద్ధన.

ఉ॥ తావకనామమంత్రరుచి । దక్షసుతారమణుం డెఱుంగు, నీ
పావనపాద పంకజ ప్రభావ మహల్య యెఱుంగు; మిక్కిలిన్

దేవరదోర్బలంబు శివదేవుని చాప మెఱుంగు; నీదు మే
ధా విభవంబుఁగల్గు శరధాటి సముద్రుఁడెఱుంగు రాఘవా ॥

శ్రీరావుగారి యనువాదము.

గీ॥ ఎఱుగు నీనామ రుచిని మహేశ్వరుండు । అరయు
నీపాద సాంసర్గ్య మాయహల్య । శివధను వెఱుంగు
నీభుజశ్రీవిలాస, మబ్ధి నీ బాణగతిఁ దెలియంగ నేర్చు
నీకరుణ యర్థమగు నాకు నిశ్చయముగ
కావుమయ్య, సీతాపతీ! కావుమయ్య!

ఇందు మూలము చక్కఁగ నుండుటయేకాదు. ఎవరికి నర్థముకాని రాము కరుణ తనకర్థమైనదని శ్రీరావుగారు స్వానుభవ విశేషమును పాఠకులకు దెలిపి వారి నూరించినాఁడు.

మూలము 1వ ఆశ్వా 62వ శ్లోకము.

'కదావా సాకేతే తరుణ తులసీ కాననతలే
పిష్టన్తం వశ్య న్ననిహత విశాలోర్ధ్వతిలకం
అయే సీతానాథ, స్మృతజనపతే, దానవజయి
ప్రసీదేతి క్రోశ న్నిమిష మివ నేష్యామి దివసాన్.

పూర్వానువాదము—సిద్ధన.

శా॥ సాకేతంబున నొక్కచోటఁ దులసీ సంతాన మధ్యస్థుఁడై
శ్రీ కల్యాణ ముఖంబునన్ తిలకమున్ జెల్వొందు, నా రాము హే
లోకత్రేశ, విదేహజాధిపతి, యో కౌసల్యపుత్రా సదా
నీకుఁగా మ్రొక్కెదినంబులుఁగా నిమిషమౌ నీరేజ పత్రేక్షణా ।

శ్రీరావుగారి అనువాదము.

గీ॥ తులసితోట, అయోధ్యలో వెలయు; నచట

నూర్ధ్వ పుండ్రంబు ధరియించి యున్నవాఁడు
రాక్షసధ్వంసి జానకీరాముఁడతని
సహరహంబు ప్రార్థింపగా, నద్భుతములు
నెలలు-దినములు-గంటలై-నిమిషములుగ
గడచు టెన్నఁడో యనినేను గలపరింతు

శంకరులే రాముని కూర్ధ్వపుండ్రములుంపగా—పాపము సిద్ధన వైష్ణవుఁడు కాఁడేమో, తిలకమే దిద్దినాఁడు. దానవజయి కౌసల్యాపుత్రుఁడైనాడు.

శ్రీరావుగారి 'నేష్యామి దిపసాః' తెనుగు సేతలో చాల సరసము మనోహరముగా కలబుకన్నారు. బలే!

మూలము 1వ ఆశ్వా 39 వ శ్లోకము.

'శృంగారం క్షితినందనీ విహరణే, వీరం ధనుర్భంజనే,
కారుణ్యం బలిభోజనే, (అ)ద్భుత రసం సింధౌ గిరిస్థాపనే
హాస్యం శూర్పణ ఖాముఖే భయవహే, బీభత్స మన్యా
ముఖే, । రౌద్రిం రావణ మర్దనే, మునిజనే శాంతం, వపుః పాతునః

పూర్వానువాదము—సిద్ధన.

మ॥ ధరణీపుత్రి మునీంద్ర శంకరధను - దైత్యారి - లంకాపురీ
శ్వర - వైరోచన రావణానుజులకున్ సాధారణ ప్రౌఢిచే
పరశృంగారము, శాంత, వీర, భయ, బీభత్సాద్భుతోగ్రంబులున్
కరుణా హాస్యరసంబులుప్పతిలు రాడ్గాత్రంబు భావించెదన్

పై పద్యములో మూలమున నున్నంత సరళాన్వయము లేదు. క్రమాన్వయము తికమకలు పడ చేయును.

శ్రీ రావుగారి యనువాదము నరయుఁడు.

సీ॥ శృంగారరసము దాఁబొంగార సీతతో
మించువేడుక విహరించి నావు
శివధనుర్భంగంబు చేసెడి వేళలో
వీరరసంబు గుప్పించి నావు.
కాకాసురునియందు కారుణ్యరసముఁను
చిలికించి వాని రక్షించి నావు
అంబుధిలోఁ బర్వతాళిని దేలించి
అద్భుతంబును జూపియలరి నావు

గీ॥ శూర్పణఖ యందు హాస్యంబు చూపినావు
పరుల కాంతలయందు బీభత్సరసము
రావణాసుర వధయందు రౌద్రరసము
శాంతరసమా మునీంద్రుల శాంతచూపి
భయము పొడసూపితివి ప్రతిపక్షులకును.

ఇందు మూలమును మించిన వివరణ సారళ్యముతోఁబాటు రసములకు నవత్వమును సిద్ధింపజేయుట విశేషము.

**మూలము** 2వ ఆశ్వా 27 వ శ్లోకము

'కోదండ_మిక్షుజనితం, స్మరపంచచాపం,
శంఖం, రథావయవ, మంకుశపాశవేణుం
హస్తైర్దధాన మమలద్యుతి ముద్వహంతం
ప్రద్యుమ్న కృష్ణ మనిశం భజ రామచంద్రం

పూర్వానువాదము:-సిద్ధన.

చ॥ చెఱకువి, లైదుబాణములు చే ధరించి, రథాంగ వేణుపా
శరుచిర శార్ఙ్గముఖ్య ఘనసాధన ముఖ్య మహాష్టబాహు సుం

దరహాసి నీల గాత్రుఁ బరు । దర్పకుఁ గృష్ణు సువర్ణచేలు, దా
శరథి బలాధిపుఁ శరధి । సన్నుతు నచ్యుతు రాముఁ గొల్చెదన్.

ఇందు మూలమునందుంచినవి మఱుగుపడినవి. లేనివి అగుపడు చున్నవి.

శ్రీ రావుగారి యనువాదము

గీ॥ స్మరుని పంచబాణంబులు - చాప - మంకు
శంబు - శంఖంబు - చక్రపాశములు - వేణు
దండ- మెన్మిది చేతులందాల్చి, నూత్న
మణులకాంతిని గల్గి రమావినోది
యగుచు, ప్రద్యుమ్నుడై నల్లనయ్య నైన
రామచంద్రుని భజియింతు రక్తితోడ.

ఎనిమిదవ ఆయుధమేదో మూలమునసే లేదు. ఏడు బాహులందు టసంభవమని యెన్మిదన్నారేమో! సిద్ధకవి శడవిన 'శార్ఙ్గ'ము 'కోదండ'మను కొనవచ్చును.

మూలము 3వ అశ్వా 19 వ శ్లోకము.

'నహిమాతా, నహితాతో,
నహి మమ తనయాశ్చ, నైవసోదిర్యః
ఇతి మమ నికటే వృత్యో
రఘుపతి రయమేవ బంధు రాసన్నః'

పూర్వానువాదము- సిద్ధన.

ఉ॥ ఆరయ మృత్యు సన్నిహితమైన తరిణా దనతల్లిదండ్రులుణా
గూరిమిగల్గినట్టి కొడుకుల్ నిజసోదరు లింక నన్నులె
వ్వారలులేరు, తేరు హితవర్తను, లార శరణ్యగణ్యుఁడౌ
శ్రీరఘురాము డైనతమ చేయిపి బంధుగుడై మెలంగెడిణా

శ్రీరావుగారి యనువాదము.

గీ॥ సుత్తి వెన్నంటి దగ్గఱి మ్రింగరాఁగ
తల్లిలేదు-పుత్రులు లేరు—తండ్రి లేఁడు
తోడఁ బుట్టినవారు బంధువులు లేరు.
రాముఁడే నన్ను రక్షించు రక్షకుండు

**మూలము** 3వ ఆశ్వా—38 వ శ్లోకము.

'యాకృపాముని సంత్రాణే - యాకృపా కపినాయకే ।
యావిభీషణ రక్షాయాం—సారామ మమదీయతాం'

పూర్వానువాదము—సిద్ధన.

ఉ॥ ఏదయచేతఁ దాపసుల నేలితొ? వానరకేశరాశిపై
నేదయ గల్గియుంటివొ? రహిఁ దశకంధర సోదరావనం
బేదయ చేతనయ్యె? నను నిప్పుడు నాదయఁ బ్రోవవయ్య దా
మోదర! రామ! రాఘవ! సముజ్జ్వల భూషణ భక్తపోషణా ।

శ్రీరావుగారి యనువాదము.

గీ॥ ఎట్టి దయతోడ మునుల లాలించినావొ?
ఎట్టి కరుణతొ సుగ్రీవు నేలినావొ?
ఎట్టి ప్రేమ విభీషణుఁ బట్టినావొ?
అట్టి కనికరమునఁ బ్రోవు మభవ! నన్ను.

మూలమునకు వ్యాకోచము లేకుండుటే కాక, కృపా పర్యాయపదములు వాడినవి వాడకుండుట ఒక సొగసు. లాలించు-ఏలు—చేపట్టు—క్రియలు కూడ సార్థకములై శోభావంతములైనవి.

మూలము 4 ఆశ్వా 57 వ శ్లోకము

'కృష్టం భీమ ధనుఃకఠోర నినదం బ్రహ్మాది సంవిస్మయం

భాస్వద్వాజిగతేర మార్గ మనిశం శంభోశ్శిరః కంపనం
దిగ్దంతి స్ఖలనం కులాద్రిచలనం సప్తార్ణవోన్మీలనం
వైదేహీ మదనం మదాంధ దమనం త్రైలోక్యసమ్మోహనం ॥'

పూర్వానువాదము—సిద్ధన.

మ॥ హరచాపధ్వని కజ్జాదులును చో। ద్యం బంది రంభోనిధుల్
మొరసెన్ సీత ముదంబునొందె జగముల్। మోహంబుఁజెందెన్, ధరా
ధరముల్ దిక్కరులుం జలించెను, మదాంధ। వ్రాతముల్ గూలె, భా
స్కరవాజుల్ గతిదప్పె, శంభుఁడు శిరః కంపంబు చేసెన్ వెసన్

శ్రీ రావుగారి యనువాదము.

సీ॥ తపను గుఱ్ఱంబులు తప్పత్రోవను వెళ్ళె
ముక్కంటి శిరమూచె ముగ్ధుఁడగుచు
కుల పర్వతములు వ్యాకులములై చలియించె
విస్మయం బందెను వేధ యపుడు
దిగ్గజంబులకెల్ల తెలివి తేటలు తప్పి
తోరంబుగాఁ గల్గె త్రొట్రుపాటు
సప్తసముద్రముల్ స్తంభించి బెగ్గడె
మూడు లోకంబులు మూర్ఛ మునిఁగె

గీ॥ మద బలోద్ధతు లింకిరి, ముదముసెందె
సీత, శివధనుర్భంగంబుచేతఁ బుట్టి
నట్టి శబ్దంబు శ్రోత్రేంద్రియములు సోకి
నంత, శ్రీరామ! నీచర్య లద్భుతములు.

ఏకావ్యము నందైనను ముఖ్యముగా భక్తిరస ప్రధానకవితలో, మూలకవి ముఖతః వెలువడిన మూలభాషయందలి మెఱుగులను ఏ యను వాద కర్తయు పూర్తిగా నందీయ లేఁడనుట నిశ్చయమైన గూఢ

సత్యము. శ్రీ అహోబలరావుగారు కేవలము సామాన్య భక్తపాఠకుల నుద్దేశించియే రచన సాగించుటలో సంధి సమాసాది వ్యాకరణ బంధములను ఉద్దేశపూర్వకముగనే సడలించినారు. అదియు గుణముగానే పరిణమించిన దనుటకు వెనుదీయ నవసరముండదు.

పాఠకలోకము భక్తిశ్రద్ధాతత్పరత్వములతో పఠించి తదుద్దిష్ట సత్ఫలముల నందగలుగుదురని విశ్వసించుచు, శ్రీరావుగారి కృషికి అభినందనములు, వందనములు నర్పించి, ఇతోధిక కృతిరచనలకగు ఆయురారోగ్యములను మేధా సంపత్తులను, అబ్బానకీజాని అనుగ్రహించుతమని ఆశించి, ఆకారుణ్య నిధి నర్థించు చున్నాను.

విద్వద్విధేయుఁడు

తాడిపత్రి
18—9—80

డోస్యము జనార్దనశాస్త్రి
రిటైర్డు తెలుగు పండితులు.



# ఉత్తమ గ్రంథము

శ్రీ కల్లూరు అహోబలరావుగారు తమ శ్రీరామకర్ణామృత కావ్యము పంపి నిష్పాక్షిక రహితమైన అభిప్రాయము కావలెనని కోరిరి. కావ్యము లకు, పీఠికలు, అభిప్రాయములు వ్రాయవలసివచ్చినప్పుడు నావారని పెర వారని తరతమ భావములు నాకులేవు. కావ్యగత గుణదోషములు రెండిం టిని ఎత్తి చూపుటయే నా పద్ధతి-ఈరీతి సాహితీలోకమున కెంతో సహకారి.

పాలారబోసిన వెన్నెలగా యావద్భారతమునే నిండిన శ్రీరామచంద్రుని పవిత్రచరితము - ఎందఱో అనేక సాహిత్యప్రక్రియలలో నందించిరి. ఇది అనువాదకృతి. శ్రీ శంకరుల గీర్వాణకృతికి తెలుగుసేత-అనువక్త, భాషాద్వయమున సమగ్ర పరిశ్రమలేక అనువాద కార్యము తృప్తికరముగా చదువరుల దృష్టికి తేజాలదు. ఈ దృష్టితో చూచినప్పుడు కవితిలకుల శ్రీ కల్లూరివారి కృతి భంగపాటు లేనిదనియే భావింపవలయును.

జగన్మోహనమూర్తి అయిన శ్రీరామచంద్రుని స్వరూప స్వభావా దులు వర్ణించుపట్ల, భావములు పునః పునరుక్తములై పరంపరగా సాగినవ చట సహజము. మూలమునందే శ్రీ శంకరులు ఈ పద్ధతి ప్రవేశ పెట్టిరి. భావములు విస్తరించి విస్తరించి చెప్పుట, స్తోత్రకావ్యములయందు చూడదగ్గ విశేషము. రచనకు శోభయే కూర్చును.

బాల్యమునుండి, ఎన్నోపద్యములు కోకొల్లలుగా రచించిన శ్రీరావు గారికి సీసపద్య రచనలో అభిమానమెక్కువ. సీసములు, గీతములు, ద్విప దలు తమ కావ్యములలో ప్రవేశపెట్టి దేశి సాహిత్యమునెడల, వారుచూపిన ఆదరాభిమానములు భాషావేత్తలకు గమనార్హములు.

> "తెలుగు వారికెల్ల తేట తెల్లము గాగ
> తెలుగుబాస తీపి తెలియునట్లు
> రచన సల్పినాడ రామకర్ణామృత
> మాదరింపుడయ్య! ఆంధ్రులార!

అని ప్రతిజ్ఞ సల్పి ఈకృతి ఆద్యంతమూ తనమాట నెగ్గించుకొన్న నిపుణత మెచ్చదగ్గది.

1[?]వ పుటలో "శృంగారరసము" అను సీసమున కవి శ్రీరామ చంద్రుని నవరస స్వరూపునిగా సాక్షాత్కరింప జేసికొని ధ్యానించెను.

"శాస్త్ర పాఠంబులేల, విచారమేల ?
వేదపఠనంబు లేలొకో వాదులేల ?
జపతపంబులు వ్రతములు సల్పనేల ?
యాగ ముపవాసములు తీర్థయాత్రలేల ?
రామనామ మాహాత్మ్యంబు రక్తిగల్గు
మానవులకేల డంబంబు ? మరణ భయము
లేదు, పాపభీతియు లేదు" ఈ పద్యభావము ఆదర్శప్రాయము.

ఒక్కొక్కచోట కవిగారిలో శ్రీరామభక్తి పరవళ్ళు త్రొక్కుచు చదువరులకు తన్మయత్వము కల్పించుచున్నది.

ఎపుడు నామది వసియించు శ్రీరాముండు
రాముని సేవింతు రక్తి నేను
రాముచే పాతక రాసులు క్షీణించు
రామునికై యహరహము వేతు,
రాముని వలన బోరాములు నశియించు
రామునకును భక్తి ప్రణతి సేతు
రాముని యందు సుప్రేమభక్తులు నాకు
కూడి యుండెడి సదా వేడుకలర,
రామదాసుడేను"

శ్రీరామ సందర్శన నిరీక్షలో, తనలో తాను లీనమై, పోవుచున్న

సందర్భమిది. ఈ కృతి శ్రీరామకర్ణామృతము మాత్రమేకాదు, హృదయ సేచనము కావించి, రక్తి కట్టించు చున్నది.

కవిభూషణులు—ఎన్నో కావ్యములు రచించిరి. నిండు మదిమిలో, మనశ్శాంతి నిమిత్తము, రామనామ స్మరణ కావించుచు, నిట్టి మహత్తర గ్రంథము, సంతరించుట, వారికిగల కావ్య రచనోత్సాహమునకు, దీక్ష పటిమకు నిదర్శనము.

పద్యములన్నియు శ్రీరామనామ జపముగావించు జిజ్ఞాసువుల, కుపా యనముగా—శ్రీ ఆహోబలరాయ కవితల్లజులు, రచించినవి. ఈ బృహ త్కృతి ఆస్తిక జన శిరోధార్యము.

ఇది నాలుగాశ్వాసముల కృతి. ప్రతి ఆశ్వాసము చివరిలో కవి స్వీయజీవితమును సంగ్రహముగా తెల్పిరి. ఇది చరిత్రకారులకు పరమ ప్రయోజనము. శ్రీ రావుగారు సామాజిక దృక్పథము పుష్కలముగా గలవారు. ఈ చూపు వీరి "భక్తమందారము" "పూదోట" వంటి రచన లలో నిండుకొన్నది. ఈ రచన అనువాదము కావున, సంఘదృష్టితో చూడవలసిన అవసరము లేదు. సామాజికుల హృదయములలో శ్రీరామ భక్తి నెలకొల్పుటయే, ఇందలి పరమార్థము.

ఏవో రెండు మాటలు వ్రాసితిని. రాయలసీమలో శ్రీ అహోబల రావు పేరెన్నిక గన్న పెద్దలు. పెక్కుమంది కవులతో, పండితులతో పరి చితిగల మనీషి. రాయలసీమ రచయితల చరిత్ర మూడు సంపుటములుగా వ్రాసిరి; అందులో వారి గద్య రచనా విశిష్టత గోచరించును.

ఆధ్యాత్మిక చింతన గలవారికి, కవి అందించిన అమృత భాండమిది. సాహిత్యరసికులు, తత్త్వపిపాసువులు ఈ రచన నాదరింతురు గాక.

శ్రీరామనామ స్మరణము మహాపుణ్యప్రదము. నిత్య పారాయణ యోగ్యముగా ఈకృతి ఉపాసకులకు సహకరింపగలదు. సాహితీపరులు చదువవలసిన ఉత్తమ గ్రంథము.

కుంటిమద్ది
1-9-80

'మధురకవి'
ఐశ్లూరి శ్రీనివాసమూర్తి

# అభిప్రాయము

శ్రీయుతులు, కవిభూషణులు, కల్లూరు అహోబలరావుగారు రచించిన, శ్రీరామకర్ణామృతమును వారొసంగగా చూచి ఆనందించితిని. శ్రీరామ భక్తి భావ బంధురమిది, అమందానందమొసఁగును. గీర్వాణ భాషాప్రవేశములేని భక్తజనులకిది కొంగు బంగారమే.

సాహిత్య దృష్టికి, భక్తుల దృష్టికి భేదమెంతేని గలదు. అది యట్లుండుగాక; ఇంతటి శ్రీకృష్ణకర్ణామృతము సంతరించుకొన్న వ్యాప్తి, శ్రీరామ కర్ణామృతమునకు, సంస్కృతవాఙ్మయముననే, తక్కువగా యున్నది. ఆంధ్రీకృతి అవసరము కూడ.

తారక మంత్ర స్వరూపమైన, శ్రీరామ నామము యొక్క, మహత్త్వమును వర్ణింప, బ్రహ్మాదులకే శక్తి యల్పమని తెలియుచుండగా, అస్మదాదులకది యలవి యగునా? విద్యా భోజుడు, స్వకృత చంపూ రామాయణమున, రామాయణమహాకావ్యము స్వర్ధుని వంటిదనియే వచించి యున్నాడు.

"వాల్మీకి గీత రఘుపుంగవ కీర్తిలేశైః। తృప్తిం
కరోమి కథమప్యధునా బుధానాం। గంగాజలై
ర్భువి, భగీరథయత్నలబ్ధైః। కింతర్పణం_నవి
దదాతి జనః పితౄణాం"

సర్వభూత, హృదంతరాత్ముడై, యాత్మారామ ఖ్యాతిగాంచి స్వవిలాస పరతచే, ప్రకృతియను సీతను, పరిణయమాడి, తన కథను విశ్రుత గాయత్రీమంత్ర మహిమోపేతముగా, వాల్మీకి మహర్షిచే, లోకంబున వెలయింప జేసిన, భగ స్వరూపమైన రామ పరతత్త్వంబును యోగులకు, జ్ఞానులకు, భక్తుల కుపాదేయముగా మూల రామకర్ణామృతి కృతికర్త, గీర్వాణభాషలో వ్రాయగా, ఆంధ్రవాఙ్మయమున, కవిభూషణ కల్లూరు, అహోబలరావుగారు, తద్భక్తి తన్మయతచే, నీకృతి వెలయించి ఆంధ్ర భారతి కమూల్యాలంకార సేవ నొనర్చిరి. ఆంధ్ర శారద కీతడన్న నెంతేని యభిమానము. చాలకాలము నుండియే, కృతుల నొనర్పగల సామర్థ్య మీకవికి యలవడినది. గీర్వాణ భారతితో పరిచయ మెక్కువగా లేకున్నను, ఆంధ్రభారతిని, తమ చక్కని కవితా సుమములతో, నర్చించిన వారు వీరు. శ్రీరామ భక్తి పారవశ్యతచేతనే, ఈ శ్రీరామ కర్ణామృతకృతి, కృతిగా రూపొందినది.

శ్రీరాముని, మునిసేవ్యుని తెలియుట కష్టము. తెలియవలెనన్న, భక్తి యొక్కటే ముఖ్యము. శ్రీ మచ్ఛంకర భగవత్పూజ్యపాదులు, మోక్ష సాధన సామగ్ర్యాం-భక్తి రేవగరీయసీ" అని భక్తి యొక్క గొప్పదనమును వచించి యున్నారు.

శ్రీరావుగారి భక్తికితోడుగా, బాల్యమాదిగా అభ్యసించిన కవిత తోడుపడినది. అందు చేతనే, మృదు మధురముగా, మంచికృతుల నీతడు రచించి ధన్యుడయ్యె. శ్రీరావుగారు నాకు చిరకాలముగా తెలిసినవారు. సత్కుటుంబులు. నిరాడంబరులు. వీరికి శ్రీరామచంద్రమూర్తి ఇతోధికాయురారోగ్య భాగ్యములను ప్రసాదించి మనుచుగాత!

ఇట్లు
బుధజన విధేయుడు

6-637-14
రామనగరు
అనంతపురము
31-7-80

గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రి
విద్వాన్ వైద్యవిద్వాన్ సర్వతంత్ర,
స్వతంత్ర, విద్యానిధి, కవీశ్వరులు.

# పరిచయము

శ్రీ కల్లూరు అహోబలరావుగారు ఆంధ్రులకు చిరపరిచితులు. ఇది వరకే భావతరంగములు, పూదోట, భక్తమందారము. రాయలసీమ రచయితల చరిత్ర మున్నగు ఉద్గ్రంథములను వ్రాసి ప్రకటించి పేరెన్నికగన్న వారు. 'కవిభూషణ' 'కవితిలక' అను బిరుదులతో వీరిని భూషించి తెలుగువారు తమకుసహజమైన సత్కావ్య రసాస్వాద చతురత వెల్లడించిరి.

ప్రస్తుతము శ్రీ అహోబలరావుగారు శ్రీరామ కర్ణామృతమును తెనిగించి పాఠకుల కందించిరి. తెలుగులో శ్రీనృసింహ శతకము, దాశరథి శతకము, భక్తచింతామణి మొదలగు స్తోత్రగ్రంథములవలె, సంస్కృతము నందును, శివమహిమ స్తోత్రము, దక్షిణామూర్తి, చండీ, సూర్యశతకములు, ముకుందమాల, శ్రీరామకర్ణామృతము, శ్రీకృష్ణకర్ణామృతము మొదలగు స్తోత్ర గ్రంథములు లెక్కకు మిక్కిలి యున్నవి. శ్రీరామకర్ణామృతమును శంకరాచార్యులవారు సంస్కృతమున రచించిరనియు, విద్దానిని తెలుగున వ్రాసితిననియు కవిగారు తెలిపిరి.

> "సంస్కృతంబున శంకరాచార్యవర్యు
> లెలమి రామకర్ణామృత మింపు మీఱ
> శ్లోకములవ్రాసి, రద్దాని లోకులకును
> సులభముగఁ దెల్ప వ్రాసితి దెలుఁగు బాస

దీనిని చేకూరు సిద్దయ అను కవికూడ మున్నే తెనుఁగుచేసెనని కవిగారే వ్రాసిరి, (1-104) అట్లైన మరల ఈగ్రంథమునే తెనిగించుటెందుకు? అను నాక్షేపణమునకు కవిగారి సమాధానము, సమంజసముగా నున్నది,

"......... .... ........నీ కథ జనములెన్ని
విధములను పొదుకొన్నను వింగలదే ।"

తిక్కన వ్రాసిన నిర్వచనోత్తర రామాయణము పిదప ఉత్తర రామాయణము వ్రాయదొడఁగు, కంకంటి పాపరాజును ఇట్లే చెప్పుకొన్నాడు.

"రామవేశ్వరు చారిత్రము నెందఱెన్నిగతుల న్వర్ణించిన గ్రొత్తదే ?

ఆది శంకరాచార్యులు శ్రీరామ కర్ణామృతమును వ్రాసినట్లు వారి చరిత్రలో గానరాదు. మరి యే శంకరాచార్యులు వ్రాసిరో? ఎవరు వ్రాసినను ఇవి పాఠకులను ఆకర్షించు భక్తిరస ప్రధానమైన ఉత్తమ కావ్యము. సంస్కృతమునందు ఇప్పుడు, ఈ పుస్తకము లీలాశుకుని శ్రీకృష్ణ కర్ణామృతమువలె సులభముగా దొరకుటనది కాదు. నా వద్ద మూలగ్రంథము లేనందున మన కవిగారు ఎంతవఱకు మూలమును అనుసరించిరో చెప్పలేను. మఱియు, చేకూరి సిద్ధకవి వ్రాసిన పుస్తకమైన లభించియుండిన, ఈ రెండు కావ్యముల తారతమ్యము, శయ్యాదుల పై బరులను విమర్శింప వీలైయుండెడిది.

ఇప్పుడు మనచేతిలోనున్న శ్రీ అహోబలకవిగారి శ్రీరామ కర్ణామృతను నాలుగాశ్వాసముల కావ్యము. ఆశ్వాసాంతములందు,

"శ్రీరమాపతి నాకిచ్చి చిత్తశుద్ధి
కీలుబొమ్మగఁజేసి లిఖింపఁజేసె"

అని కవిగారు చమత్కారముగా రచనలోని గుణదోషములను శ్రీరమాపతి తలపై మోపిరి. ఇట్లే పోతన్నకూడ "పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట" అని తన ఉత్తర దాయిత్వమును రామభద్రుని కంటగట్టెను. మన ఈ కవిగారి అడుగున తెచ్చికోలుగాక సహజ భక్త్యాతిశయానుభవమని కావ్యము, చదివిన వారికి, దోచక మానదు. ఏదైన

గొప్పపనిసాధించినప్పుడు ఉత్తముడై నభక్తుడు దైవమే తన్ను ప్రేరేపించెనని, తాను చేసినది అల్పమేనని తెలియును, తెలియజేయును. ఇది నిర్మలభక్తికి తగినది, ఆర్య సంస్కృతికి అనుగుణము. ''స్వాహం కర్తా హరిఃకర్తా'' అనియు ''నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్'' అనియు వేదాంతపు మాటలు.

ఈ కావ్యమునందు ప్రతిపద్యములోను భక్తిరసము పొంగి పొరలు చున్నది. మన కవి ఒక్కొక్కచో శ్రీరాముని దివ్యమంగళ విగ్రహమును వర్ణించును, ఇంకొక్కచో శ్రీరాముని నిందు కొలువుకూటమును కొండా డును, మఱియొక్కచో సీతారాముల అన్యోన్యానురాగమును చిత్రించును, దుష్టదానవ సంహారమును పొగడును, అహల్యాదుల కొసంగిన వరముల, నుతించును. ఎన్ని భంగుల తనభక్తిని వెలిబుచ్చినను మనకవిగారికి తనివి తీరదు. ఉదాహరణములకు గడగితినేని, గ్రంథమంతయు చెప్పవలసి వచ్చును. మచ్చునకు ద్వితీయాశ్వాసములోని 38 వ పద్యము.

సీ॥ 'నా తండ్రి, నానిధి' అను పద్యము చదువండి.

మనకవిగారి శ్రీరామభక్తి తెనుగు కైలిని పెంచెనో, తెనుగుశైలి శ్రీరామభక్తిని పోషించెనో, చెప్పనలవి కాదు. రెండు దరులను ఒరసికొని పోవు వెల్లువవలె శ్రీ అహోబలకవి కావ్యధార ''గాంగనిర్ఝర సదృగ్ధారాళ వాగ్ధాటి'' నెరపినది. పలుచోట్ల గీత, మంజరి, సీసపద్యపాదాంతములందు వాక్యములను నిలుపక,తిక్కన వలె ముందు పాదముల పఱకు నడిపించిరి. ఇది ప్రౌఢ కవిత్వలక్షణములలో నొక్కటియని పెద్దలందురు. ఇది నిరం కుశ భావావేశ గుణము కూడ అని నేననుకొందును. గ్రంథమంతయు తేట గీతి, ఆటవెలది, ద్విపద, సీసపద్యములతోనే కొనసాగించిరి. ఇందులో వీరు మాకందజేసిన రెండుమూడు కందములు మాకందఫలములు (1_24;

4—74) శబ్ద, యోగశాస్త్రములను తడవు ఏ యొందు రెండు పద్యము లలో తప్ప, కావ్యమంతయు తేటయైన భావములతో సంస్కృతాంధ్ర పదముల పొందికతో, నడచినది. ఇందలి ఊహలు, ఉదారములు; ఆశయములు, అత్యున్నతములు; రసము రంజకము. ఇది భక్తిరస ప్రధానమైన కావ్యమైనందున శ్రీ అహోబలకవిగారు పండితులను పామరులను దృష్టిలో నుంచుకొని వ్రాసినట్లున్నది. ఇది కేవలము పండితులు, పామరులేకాక ఆబాలగోపాలమును మరిమరి చదివి పాడుకొని పారవశ్యము నొందదగిన కావ్యము. రాళ్ళసీమ అనిపిలిపించు కొనిన రాయలసీమలో, మన శ్రీకల్లూరు అహోబలకవిగారు ఒక వెలరాయి. వీరు అనంతపురము జిల్లా, హిందూపురము తాల్లూకా, లేపాక్షి పురమునకు దగ్గఱగానున్న 'కల్లూరు' పురవాస్తవ్యులు. ఈ గ్రామములోనే. రాజకీయ పితామహులైన కీ॥ శే॥ శ్రీకల్లూరు సుబ్బరావుగారు జనన మొందిరి. వీరు కవిగారికి మేనమామగారు.

వీరు తమ యుత్తమ గ్రంథములతోనేమి, ఇతరుల గ్రంథప్రకటనలతోనేమి ఆంధ్రులకు మహోపకారము చేసిరి. శ్రీరామచంద్రమూర్తి వీరి సాంద్రకీర్తి చంద్రికలను ఆచంద్రతారకముగా వెలయించుగాక !

మతం వాసుదేవమూర్తి
బెంగళూరు.



సంపూర్ణం.



శ్రీ కల్లూరు అహోబలరావుగారు గ్రంథకర్త

శ్రీమతి సీతమ్మ గ్రంథకర్తగారి ధర్మపత్ని

రూ॥ 316/- సమర్పించిన



శ్రీ

మహారాజ పోషకులు

సాహిత్య పోషకులు

కళాభిమానులు

శ్రీ అనంతరామయ్య

శ్రేష్టిగారు

మండీ మర్చెంట్స్,

హిందూపురం.

జననము:- 15—8—1920

తల్లి:- శ్రీమతి ఆదెమ్మ

తండ్రి:- శ్రీకట్టారామన్నగారి క్రిష్ణయ్యగారు

వీరి ధర్మపత్ని శ్రీమతి రామరత్నమ్మగారు. ఈ పుణ్యదంపతులకు ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు గలరు. అనంతరామయ్యగారు ఇంటర్మీడి యేట్ వరకు చదివి 1946 లో విద్యార్థి కాంగ్రెస్సు నందు చేరిరి. హిందూపుర పురపాలక సంఘ కౌన్సిలరుగా పనిచేసిరి. ప్రస్తుతము వీరు టౌను కాంగ్రెసు 'బి' ప్రెసిడెంటుగా ఉన్నారు. వీరిని, వీరి కుటుంబమును శ్రీ సర్వేశ్వరుడు సదా రక్షించు గాక!

రూ॥ 316/- సమర్పించిన
శ్రీ మహారాజ పోషకులు



శ్రీ సింహాద్రిస్వామి ఆతని భార్య

కుం॥ సౌ॥ నాగమణియమ్మగారు

హిందూపురము. శ్రీ నరహరి సంఘ పీఠాధ్యక్షులు.

శ్రీరామభక్తులు. కవి పండితులయందు అవ్యాజానురాగము గల్గి, వారిని పోషించు, సుగుణసంపత్తి కల్గినవారు. బంగారునకు పరిమళము తోడైనట్లు శ్రీ నాగమణియమ్మగారు, అర్ధాంగియై శ్రీ సింహాద్రి స్వాములవారికి, చేదోడు, వాదోడై, సర్వ విధముల సహకరించు సాధ్వీమణి. ఈ పుణ్యదంపతులకు, సుగుణ ఖనులైన పుత్రరత్నములు, పుత్రికామణు లుద్భవించి నారు. శ్రీవారి కుటుంబమువారికందరకు సర్వదా ఆయురారోగ్య సౌభాగ్యములొసంగి శ్రీ పరమేశ్వరుడు రక్షించు గాక.

శ్రీ రాజపోషకులు రూ॥ 316/- చెల్లించిన వారలు.





## శ్రీ గుంటూరు సుబ్బరాయుడుగారు వీరి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు

ఇంటి పేరు "గుంటూరు" అయినా అనంతపుర మండలవాసులు. భూస్వామి. స్వాతంత్ర్య సమరారంభము నుండి దాదాపు 5 దశాబ్దములు స్వాతంత్ర్య సమరము యొక్క వివిధ రంగములలో స్వచ్ఛంద సేవను గావించిరి. నేటికిని వీరి నీ ప్రాంతమునందు "అనంతపురం గాంధీ" అని పిలుచుట కలదు. దాదాపు యాభై సంవత్సరములనుండి సహకార శాఖకు సంబంధించిన వివిధ పదవులను చేపట్టి. నిష్కల్మష చిత్తముతో నాయా పదవులను నిర్వహించుచున్నారు. తాను సత్యమని నమ్మిన దానిని బాహాటముగా వెల్లడించగల ధైర్యశాలి. శుద్ధ ఖద్దరును ధరించి కండువా వేసికొని బోసినోరుతో సులోచనములను ధరించి నడచుచున్న వీరిని చూచినపుడు సత్యాగ్రహ కాలమునాటి స్వాతంత్ర్య సమర నాయకులు గుర్తుకు వచ్చు చుందురు. ప్రకృతము వీరు అనంతపురమునందే నివసించు చున్నారు.

వీరిని, వీరి కుటుంబము వారినందరిని, సదా, శ్రీ సర్వేశ్వరుడు రక్షించు గాక!

రూ॥ 116/— చెల్లించిన దాతలు.



శ్రీ బి. రామకృష్ణ, M.S.C.O.T.R.I.
శ్రీమతి కుం॥ సౌ॥ లక్ష్మిదేవి
ఈ దంపతులకు ఆయురారోగ్య భాగ్యములిచ్చి సర్వేశ్వరుడు రక్షించుగాక!

రూ॥ 116/- చెల్లించిన దాతలు



శ్రీ తె. రంగనాయకులు వీరి ధర్మపత్ని

కుం॥ సౌ॥ సుశీలా దవి

తాడిపత్రి తా॥ రావివెంకటంపల్లిలో వ్యవసాయము చేయుచున్నారు.

ఈ దంపతులను సర్వకాలము సర్వేశ్వరుడు రక్షించుగాక!

9. శ్రీ జయం సత్యనారాయణశ్రేష్ఠిగారు, జవుళి వ్యాపారము. హిందూపురము.

10. శ్రీ రాధాకృష్ణ సత్యనారాయణగారు, ఆయిల్ మిల్సు హిందూపురం.

11. శ్రీ నరసేపల్లి సత్యమయ్యగారు పామిడి.

12. శ్రీ కాసంశెట్టి లక్ష్మయ్యగారు, పామిడి.

13. కరణము ఛాయప్పగారు భూస్వామి మలుగూరు.

14. శ్రీ జి. యం. మహానంది ఈశ్వరయ్యగారు సూపరింటెండెంటు. సెంట్రలు ఎక్సయిజ్, క్వీన్సు రోడ్డు, బెంగళూరు—1

15. శ్రీ డాక్టరు యం. మునిరెడ్డిగారు, పామిడి.

16. శ్రీ రెడ్డివారి నారాయణరెడ్డిగారు, నాయనపల్లి, హిందూపురం తా॥

17. శ్రీ లంకా కృష్ణమూర్తిగారు ఇందిరా నగరు, బెంగళూరు.

18. శ్రీ యం. గోవిందరావుగారు డాక్టరు బవరంపల్లి, కళ్యాణదుర్గము తాల్లూక.

19. శ్రీ వై. నాగేశ్వర శర్మగారు 215—5 క్రాసు రోడ్డు, రెండవ బ్లాకు జయనగరు బెంగళూరు—2

20. శ్రీ శెట్టి కొండయ్యగారు, పాతూరు, అనంతపురము.

21. శ్రీ పల్లెము వేంకటేశ్వరులుగారు ధర్మవరము.

22. శ్రీ యస్. యన్. రామకృష్ణయ్యగారు, కడప.

23. శ్రీ మద్దూరు శ్రీనివాసరావుగారు రాజమండ్రి.

24. శ్రీ భాస్కర అండు కంపెని. కల్లూరు ఆర్. ఎస్.

25. శ్రీ కె. బి. ప్రాణేశ్వరరావు, సూపరు వైజరు, హిందూపురము.

26. శ్రీ రఘునాథబాబు రెసిడెన్షియలు స్కూలు, సేవామందిరం. హిందూపురం.

27. శ్రీ వై. సదాశివంగారు హెచ్. యం. జిల్లా పరిషత్తు హైస్కూలు సేవామందిరము, హిందూపురము.

28. శ్రీ ప్రభాకరుగారు, బి. ఎ., ప్రభాకర్ పైనాన్సు. సెకెండు రోడ్డు. జార్జిపేట, అనంతపురము.

29. శ్రీ పుట్టా నారణయ్యగారు క్లాత్ మర్చెంటు, హిందూపురము.

శ్రీ పరుచూరు రామయ్య - శ్రీమతి రామక్క

ఈ దంపతుల సుపుత్రుడు, శ్రీరామభక్తుడు

మౌద్గల్య గోత్ర సంభూతులు

శ్రీ పరుచూరు హనుమంతయ్య గుప్తగారు

అతని ధర్మపత్ని

శ్రీమతి సావిత్రమ్మగారు



దాతలుగా చేరి రూ॥ 116/– విరాళము సమర్పించినారు, అనంతపురము. గీతామందిర సమితి ప్రెసిడెంటుగారు, శ్రీసీతారామ పాదారవిందముల నమందానందంబున నమ్మి, అహర్నిశము వారి సేవకే, తను, మన, ధనంబుల నర్పించిన భక్త శిఖామణులు. ఈ దంపతులకు శ్రీ సీతారామ చంద్ర స్వామి, ఆయురారోగ్య సౌభాగ్యముల నొసంగి రక్షించు గాత,

రూ॥ 116/- విరాళమొసగిన దాతలు.



శ్రీ గిరిరాజు చిన్న వెంకటరమణప్పగారు

వారి ధర్మపత్ని, శ్రీకాంతమ్మ.

ఈ దంపతుల కాయురారోగ్యభాగ్యము లొసంగి, శ్రీపరమేశ్వరుడు

రక్షించుగాత !



కీ॥ శే॥ నాగసముద్రము వెంకోబరావు

ధర్మపత్ని

కీ॥ శే॥ శ్రీమతి వేంకటలక్ష్మమ్మ

వీరి జ్ఞాపకార్థము కుమారుడు



శ్రీ యన్. రామరావుగారు

రెండవసారి గ్రంథమాలకు రూ॥ 116/- సమర్పించి ధన్యులైనారు.

వీరు శ్రీరామభక్తులు. నిరంతరము, హరసేవలో నిమగ్నులై యుందురు. పెద్దల, సాధు సజ్జనుల, సేవలో అమితాసక్తి కల్గి యుందురు. అనంతపురములో వీరు పాల్గొనని సంఘ సేవా కార్యక్రమమేలేదు. నిరాడంబరులు. కవి పండితులయందు గౌరవము కలవారు. పేదసాదలనాదరించు స్వభావముకలవారు. వీరిని, వీరికుటుంబమును, శ్రీసర్వేశ్వరుడు రక్షించు గాక.

రూ॥ 116/-సమర్పించిన దాతలు.



శ్రీ కగ్గల్లు సుబ్బరత్నంగారు
కవిపండితులన్న అభిమానము కలవారు.
నిరాడంబరులు చక్కని పద్యములు

రూ॥ 116/- సమర్పించిన దాతలు.



శ్రీ కె. గురుమూర్తి గారు బి.ఏ.
సొసైటి అడిటరు, రాయదుర్గము,
వీరికి, వీరికుటుంబమునకు శ్రీపరాత్పరుడు



కీ॥ శే॥

కల్లూరు సీతారామరావుగారు

గ్రంథకర్తగారి మామగారు. వీరి ఆత్మకు

శాంతి లభించు గాత !



కీ॥ శే॥ కోడిహళ్ళి చెన్నరాయప్పగారు

రిటైర్డు టీచరు. ఆంధ్రసాహిత్యములో కృషి చేసిరి.

వీరి జ్ఞాపకార్థము, అల్లుడు ఆర్. శ్రీనివాసమూర్తిగారు

రూ॥ 116/- చెల్లించిరి.

వీరి కుటుంబము ఆయురారోగ్య, సౌభాగ్యములతో,

వర్థిల్లు గాత !



కీ॥ శే॥ దాసాకృష్ణయ్య వీరి ధర్మపత్ని

శ్రీ లక్ష్మీదేవమ్మ

వీరి జ్ఞాపకార్థము కొమారుడు శ్రీ యం. కృష్ణమూర్తిగారు

రూ॥ 116/– విరాళము సమర్పించి,

తమ తల్లిదండ్రుల ఆత్మకుశాంతి నొసగి, ధన్యులైనారు.

రూ॥ 116/– చెల్లించిన దాతలు



శ్రీ లక్ష్మీనృసింహ వాస్తులక్షణ గ్రంథకర్త
శ్రీ ఎద్దుల వెంకటరెడ్డిగారు వారి ధర్మపత్ని
నారాయణమ్మగారు

వీరి పుత్రులు చి॥ నారాయణరెడ్డి & చి॥ శివరామరెడ్డి,
నేసేవాండ్లపల్లి, హిందూపురం తా॥

వీరిని వీరి కుటుంబమును శ్రీ పరమేశ్వరుడు రక్షించు గాక!



శ్రీ పైడి లక్ష్మయ్యగారు
జిల్లా రచయితల సంఘమునకు అధ్యక్షులు
అనంతపురం.
రూ॥ 116/– సమర్పించిన దాతలు.
కవిపండితుల యందభిమానము గలవారు,
ఇటీవల వీరు 'కళాప్రపూర్ణ' బిరుదు సంపాదించిరి.
అనేక నాటకములను రచించిన కవులు.
శ్రీసర్వేశ్వరుఁడు వీరిని రక్షించుగాక ।

రూ॥ 116/— సమర్పించిన దాతలు.



శ్రీ మఠం వాసుదేవమూర్తి, Ph.D.

Retd. Professor of Sociology & Social Work and
Dean of Social Sciences.
(Andhra University & Kashi Vidyapeath)
BANGALORE - 560011.

వీరిని, వీరి కుటుంబమును శ్రీ సర్వేశ్వరుడు సదా రక్షించు గాక!

రూ॥ 115/– సమర్పించిన దాతలు



కీ॥శే॥ గౌరా సుబ్బరాయప్ప శ్రేష్ఠిగారు
ఆదోని. వీరి జ్ఞాపకార్థము, వీరి పుత్రులు
విరాళము సమర్పించిరి.

రూ॥ 116/– సమర్పించిన దాతలు.



కీ॥శే॥ పయ్యావుల కేశన్నగారు
వీరి జ్ఞాపకార్థము కు॥ శ్రీ వేంకటనారాయణ, M. L. A.

రూ॥ 116/- సమర్పించిన దాతలు.



శ్రీ తూముకుంట భీమసేనరావుగారు, B.A., B.Ed.,

తూముకుంట, కల్యాణదుర్గము తా॥

వీరిని వీరి కుటుంబమును శ్రీపరమేశ్వరుడు రక్షించుగాక

రూ॥ 116/- సమర్పించిన దాతలు.



శ్రీ యం. బాల విశ్వనాథశర్మ, B.A.,

అనంతపురం.

వీరిని వీరి కుటుంబమును శ్రీపరాత్పరుడు రక్షించుగాక

రూ॥ 116/_ సమర్పించిన దాతలు



శ్రీ బియన్నగారి నాగయ్యగారు

పాతూరు, అనంతపురము.

వీరిని, వీరి కుటుంబమువారిని శ్రీ సర్వేశ్వరుడు

సదా రక్షించుగాక !

రూ॥ 116/- చెల్లించిన దాతలు.



**శ్రీ ఎ. రమేష్‌గారు, రిటైర్డు D. E. O.**

అనంతపురము. ఆంధ్రభాషలో బహుపరిశ్రమచేసి, అనేక గ్రంథములు రచించినారు. కవిపండితులయందు అభిమానము కలవారు. ఆయురారోగ్యభాగ్యములిచ్చి సర్వేశ్వరుడు వీరిని రక్షించుగాక!

రూ॥ 316 సమర్పించిన మహారాజ పోషకులు



కళాభిమానులు, సాహిత్య పోషకులు, రచయితలు-ప్రసిద్ధ నేత్ర వైద్యులు

**శ్రీ గుంటుపల్లి రాధాకృష్ణమూర్తి గారు**

కోర్టు రోడ్డు, అనంతపురం.

వీరిని, వీరికుటుంబమును శ్రీసర్వేశ్వరుడు రక్షించుగాక!

చిత్రములలో లేని దాతలు.

రూ॥ 116/— విరాళము చెల్లించినవారు.

1. శ్రీ తాన సంరెడ్డి, నారాయణస్వామి సుబ్బర్నమ్మ ఛారిటబుల్ ట్రస్టు, కల్లూరు ఆర్. ఎస్. అనంతపురము జిల్లా.
2. శ్రీ ఓరుగంటి సీతారామప్పగారి పేరుతో పుత్రులు, శ్రీ ఓ. యస్. శర్మగారు 3/48 ఎ. సెకెండు రోడ్డు, ఏడవక్రాసు రోడ్డు. జార్జిపేట. అనంతపురము.
3. సెక్రెటరీ—కళాజ్యోతి. ధర్మవరము.
4. శ్రీ వేలూరి సుబ్బన్న, B A., B Ed మర్తాడు గ్రామము. (అనంతపురము జిల్లా)
5. శ్రీ పరుచూరు కృష్ణమూర్తి, జవళీ వ్యాపారము, అనంతపురము.
6. శ్రీ కట్టా లక్ష్మీనారాయణగారు, హిందూపురము.
7. శ్రీ గొల్లాపిన్ని రామకృష్ణశాస్త్రిగారు, అనంతపురము.
8. శ్రీ జూటూరు, రమణయ్య శ్రేష్ఠిగారు. ప్రొద్దుటూరు.
9. శ్రీ తాటి మురకన్నగారు. మౌక్తికపురము మద్దనాయనపల్లి పోస్టు, కల్యాణదుర్గము తా॥

రూ॥ 25 చెల్లించిన పోషకులు.

1. శ్రీ నూకల రామయ్యకుమారుడు శ్రీ ఎన్. ఎ. సత్యనారాయణ మూర్తి & సన్సు. హిందూపురం.
2 శ్రీ బాగేపల్లి నాగయ్య & సన్సు, హిందూపురం.
3 శ్రీ టి. వి. కృష్ణమూర్తి & సన్సు, జ్యూయిలర్సు, హిందూపురం.
4 శ్రీ సాయికృపా టెక్సుటైల్సు, సి. ఎ. మద్దన్న & సన్సు. ,,
5. శ్రీరామకృష్ణ టెక్సుటైల్సు, హిందూపురము.
6. శ్రీ బైసాని కృష్ణయ్యగారి కుమారుడు బైసాని నారణయ్యగారు, హిందూపురం.
7. శ్రీ విక్రమ స్టోర్సు, కె.వి.జగన్నాథగుప్త & సన్సు, హిందూపురం.
8. శ్రీ అణికార్ బ్రహ్మరాయప్పగారు. హిందూపురము.

9. శ్రీ జయం సత్యనారాయణశ్రేష్ఠిగారు, జపుళి వ్యాపారము, హిందూపురము.

10. శ్రీ రాధాకృష్ణ సత్యనారాయణగారు, ఆయిల్ మిల్సు హిందూపురం.

11. శ్రీ నరసేపల్లి సత్యమయ్యగారు పామిడి.

12. శ్రీ కానంశెట్టి లక్ష్మయ్యగారు, పామిడి.

13. కరణము ఛాయప్పగారు భూస్వామి మలుగూరు.

14. శ్రీ జి. యం. మహానంది ఈశ్వరయ్యగారు సూపరింటెండెంటు, సెంట్రిలు ఎక్సయిజ్, క్వీన్సు రోడ్డు, బెంగళూరు_1

15. శ్రీ డాక్టరు యం. మునిరెడ్డిగారు. పామిడి.

16. శ్రీ రెడ్డివారి నారాయణరెడ్డిగారు. నాయనపల్లి, హిందూపురం తా॥

17. శ్రీ లంకా కృష్ణమూర్తిగారు ఇందిరా నగరు, బెంగళూరు.

18. శ్రీ యం. గోవిందరావుగారు డాక్టరు బవరంపల్లి, కళ్యాణదుర్గము తాలూక.

19. శ్రీ వై. నాగేశ్వర శర్మగారు 215_ 5 క్రాసు రోడ్డు, రెండవ బ్లాకు జయనగరు బెంగళూరు_2

20. శ్రీ శెట్టి కొండయ్యగారు, పాతూరు, అనంతపురము.

21. శ్రీ పల్లెమ వేంకటేశ్వరులుగారు ధర్మవరము.

22. శ్రీ యస్. యన్. రామకృష్ణయ్యగారు, కడప.

23. శ్రీ మద్దూరు శ్రీనివాసరావుగారు రాజమండ్రి.

24. శ్రీ భాస్కర అండు కంపెని. కల్లూరు ఆర్. ఎస్.

25. శ్రీ కె. బి. ప్రాణేశ్వరరావు, సూపరు వైజరు, హిందూపురము.

26. శ్రీ రఘునాథబాబు రెసిడెన్షియలు స్కూలు, సేవామందిరం, హిందూపురం.

27. శ్రీ వై. సదాశివంగారు హెడ్, యం, జిల్లా పరిషత్తు హైస్కూలు సేవామందిరము, హిందూపురము.

28. శ్రీ ప్రభాకరుగారు, బి. ఎ., ప్రభాకర్ ఫైనాన్సు, సెకెండు రోడ్డు, జూర్జిపేట, అనంతపురము.

29. శ్రీ పుట్టా నారణయ్యగారు క్లాత్ మర్చెంటు, హిందూపురము.

అనంతపురం జిల్లా రచయితల మహాసభ.



కవితిలక, కవిభూషణ, శ్రీ కల్లూరు అహోబలరావుగారిని హైదరాబా సాంస్కృతిక శాఖాధ్యక్షులు. శ్రీ అంతటి నరసింహముగారు సన్మానమొనర్చిన చిత్రము.

# శ్రీరామ కర్ణామృతము

## పరిభమాశ్వాసము

సీ. శ్రీ దేవతలకెల్ల - నాదిదేవుండవు
మూడు లోకములకు - ముఖ్యగురుఁడ
వవని జాతకు భర్త - వాద్యుండ వీవు। స
త్యవ్రతుండవు; శాంతి తత్పరుఁడవు
కోటి చంద్రుల మించు మేటి కాంతులు గల్గు
ముఖమండ లుండవు సఖుఁడ వీవు !
కౌస్తుభమణి తోడ - గాంతియుక్తుండవు
సకలార్థసిద్ధుల సహితుఁడీవు ।

గీ. పరగ, సరయూ నదీతీర వాసుఁడగుచు
భక్తకోటిని రక్షించు పావనుఁడవు
అమల రఘువంశరాజుల నధికుఁడీవు
ప్రాంజలి, నొసర్తు రామ నీపాదములకు.

౨

సీ॥ అప్రమేయుండవు; దశరథాత్మజుఁడవు
పద్మనయనుండ వాజాను బాహుయుగ్మఁ
డీవు । సీతాపతివి; రాక్షసేశకుల వి
నాశ । శ్రీరామ ; కొనుము నా నమస్సు.

౩

సీ॥ చిఱునవ్వు మోమునఁజిందులాడెడి వాఁడు
కరుణాసముద్రుఁడై గ్రాలువాఁడు
కర్ణ కుండలముల - కాంతి, మెఱయు వాఁడు
హరి నీలకేశంబు - లమరు వాఁడు
చెప్పలంటు కన్నుల - చెలువు గల్గిన వాఁడు
శ్యామల వర్ణ దేహంబు వాఁడు
జానకీ దేవితో సరస మాడెడి వాఁడు
తమ్ములఁబోలు పాదముల వాఁడు

గీ॥ వాఁడు మావాఁడు; శ్రీరామ వల్లభుండు
దేవతలలోన శ్రేష్ఠుఁడై - దివ్యఁడగుచు
మాదు కోర్కెల సన్నిందు - మాధవుండు
అట్టి శ్రీరాము సతతంబు - నాశ్రయింతు

౪

మం. ద్వి.

కౌసల్యవరపుత్రి ! కాకుత్స్థవంశ్య
ఘనసుతారంజన ! ఘనసైకవీర !
నీరద సమగాత్ర ! నిరుపమాకార !
ధర్మకార్యాసక్త - దానవహంత !
జనతతి దుష్పాప - సంచయ ధ్వంస
జననుత శుభకర - పనులనొసర్చ
నాసక్తుఁడై యుండు నభిరామ ! రామ !
శ్రీసఖ ! రఘుపతీ ! చిన్మయాకార !
వందనంబొనరించి - ప్రార్థింతు నిన్ను
సుందరాకార ! బ్రోచుట, నీకుఁదగదె ?

౫

సీ॥ జనక పుత్రీనాథ ! జగదీశ్వరుఁడవీవు !
జనులకానందంబు నల్పుదీవు !

సకల జంతువులకు జననమూలంబీవు ;
జనులబాధ హరించు స్వామివీవు !
జనన మాది, మునుల సఖుఁడై - వెలసితీవు ;
శాశ్వతుండవు నీవు - సరసుఁడీవు ;
భార్గవ గర్వంబుఁ బరిహరించితి వీవు ;
జాజ్వల్యమాన తేజస్వి వీవు ;

గీ॥ కరుణ గల్గిన శ్రీరామ ! కావుమయ్య ;
రక్తి ధ్యానింతు. లోకేశ్వరా ! ప్రణామ
మర్పణముసేతు, భజియింతు నాశ్రయింతు ;
రక్షసేయుము, శ్రీరఘురామచంద్ర ;

సీ॥ రఘువంశరాజుల రత్నంబు,
రాజీవ - నేత్రుండు, బలపూర్ణ గాత్రుఁడఖిల
జనకంటకులగు, నిశాచర ధ్వంసంబుఁ
గావించినట్టి విఖ్యాత పురుషుఁ
డాదిమదేవుండు, హస్తంబులందుఁ గిం -
కిణి, కంకణముల నంకించుకొన్న
రాఘవేశ్వరుఁడు, శ్రీ రాకేందు బింబాన
నుండు రఘుకులోత్తముండు, ధరణి

గీ॥ జాత సీత కింపు సల్పెడు, రఘునాయ
కుండు, మమ్ము సతము నిండుప్రేమఁ
గాంచి రక్షసేయఁగాఁ బ్రార్థనముసేయు
చుండు మధికభక్తిఁ బొందుపఱచి

౨

గీ॥ రాఘవేంద్ర ; దయాకర ; రామచంద్ర ;
భద్రాద్రియశ ; రఘువంశ, సముదారిచంద్ర ;

కువలయేశ ! సీతామనః కుముదచంద్ర !
నిర్మలాత్ముఁడౌ, సుగ్రీవు నేత్రములను
కలువలకుఁ బూర్ణచంద్ర ! విఖ్యాతపురుష !
చేతు జేజేలు నీకు ! రాజేంద్రచంద్ర !

౮

సీ॥ కోదండధారివై, వేదండములఁబోలు
ఘోరారి ప్రకరముల్ గూల్చి నావు!
వారిధి గంభీర ! వర్షాంబుద శరీర !
స్థిరుఁడవై, జగముల చెలఁగి నావు!
గుణనిధివై, భక్తగణములనెల్లను
కరుణతో, రక్షించిగ్రాలి నావు !
శ్రీరామ ! రఘువర ! సీతాపతీ ! పద్మ
నేత్ర ! విజయుఁడవై, నెగడి నావు !

గీ॥ సుప్రకాశుండవగుదువు సుందరాంగ !
జగములకు వెల్గునొసగెదు సార్వభౌమ !
మాదు చింతలమాన్పి, సమ్మోదమిమ్ము;
రమ్యగుణధామ ! శ్రీరామ ! సౌమ్యనామ!

౯

గీ॥ లక్ష్మణునిఁగూడినట్టి, శ్రీరామచంద్ర !
ఉత్పల శ్యామల శరీర ! యుజ్జ్వలాంగ !
మహితమగు నీదు నామ సంస్మరణ మెప్పుడెడ
తెగక, నాదుజిహ్వ పైనెసఁగుఁగాక !

౧౦

గీ॥ వామభాగంబునఁ లక్ష్మి వఱలుచుండ
నాపదలఁదోలి, శత్రుజయంబుఁగొనుచు
వారిచే, నమస్సులఁగొను వారిజాక్ష !
రమ్యగుణధామ ! రామ! ప్రార్థనమొనర్తు

౧౧

గీ॥ రామచంద్ర! రఘూత్తమా! రాజవర్య!
రాజరాజేంద్ర! సురరాజ! రాఘవేశ!
రామ భద్రుండ! రఘువంశ రాజతిలక!
శరణుజొచ్చితి; దాసుండ! జయమునిమ్ము!

౧౨

గీ॥ కోటి మెఱుపులకాంతితో సాటివచ్చు
కాంతిగల వస్త్రము ధరించి - శాంతమూర్తి
వగుచు, పీఠాసనముబొంది - యవనిజాత
నీదుతొడమీదఁ గూర్చుండి నెగడ, నామె గౌగిలించియు,
మఱియొండు కరముచేత - బ్రహ్మతత్త్వంబు
మునులకు రక్తిఁదెలుపు రామ! పద్మాక్ష! శ్యామాంగ!
ప్రార్థనంబుఁ జేసి, సేవింతు సతము - రక్షింపుమయ్య!

౧౩

సీ॥ రఘువంశ తిలకుండు - రాముండు నాతండ్రి
భూదేవి పుత్రిక - నాదుతల్లి
బ్రహ్మసఖుండైన - పావని నాభ్రాత
వైరాగ్యమే, ప్రేమ పడఁతినాకు
ఇంద్రియ నిగ్రహంబిమ్మగా సాధించి
నట్టి విశ్వామిత్రుఁడ నఘమూర్తి
యా విభీషణుఁడాదియగు, సజ్జనంబులె
మిత్రులు! జ్ఞానంబె మేటి హితుఁడు

గీ॥ విమల హరిపాద భక్తియే వెతలమాన్పి
యోగమును గూర్చి, యిచ్చుసంయోగ సుఖము
కోరికలఁదీర్చునట్టి - వైకుంఠమరయ
నాకు, నిత్యనివాస మెన్నటికి నైన

౧౪

సీ॥ నంద నందనుఁడ ! గోవింద ! నృసింహావ
తార ! ఆనంద ! సత్యస్వరూప ;
దామోదరా! ముకుందా! వాసుదేవ! - ప
ద్మాక్ష! సీతాపతీ! అవ్యయుండ !
పాపసంహారకా! పతితపావనరూప !
సంసార విస్తార జలధిదాట
గాఁజేయు, గంభీర కర్ణధారుండ ! శ్రీ
కృష్ణావతారుఁడౌ! విష్ణుదేవ

గీ॥ కాంతిచే, మనోహరుఁడవై గ్రాలువాఁడ !
అచ్యుతానంత ; శ్రీరామ! ఆదిదేవ!
నిత్యతాపత్రయంబు ఖండించి, నాకు
సంతస మొసంగుమా - రామచంద్ర సతము.

౧౫

సీ॥ విప్రప్రియుండను - పేరునఁగొన్నావు
కరుణాకరుండయి గ్రాలినావు
ధర్మస్వరూపుఁడై ! దనరినవాఁడవు
సీతకు భర్తయై, చెలఁగినావు
రాత్రించరుల, సంహరణ మొనర్చితివివు ;
కోటి, విద్యుత్కాంతిఁ గూడినావు
మాయా మృగంబును - మర్దించినాఁడవు !
కాకుత్స్థవంశాన గ్రాలినావు

గీ॥ లక్ష్మణునితోడ సతము చెలంగినావు
ధరణి, రఘుకుల శ్రేష్ఠుఁడై దనరినావు
సుందరాకార ; కుండల శోభితాంగ !
రామచంద్ర ! రక్షింపుమా ! రాఘవేశ ;

౧౬

సీ॥ రత్నకిరీటంబు - రత్నకుండలములు
ధరియించి, రామచంద్ర ప్రభుండు
భుజకీర్తులనుగల్గి, బొలుపొందు హారముల్
కంఠసీమ, ధరించి - కాంతసీత
వామభాగమునందు, వసియింపగాఁదాను
సింహాసనమునందు చేరియుండి,
వానర వరులెల్ల, మాననీయముగఁదగ
సేవింప, మునులెల్లఁజేరివాగడ

గీ॥ వారి కథయమొసఁగి, కోరికలీడేర్చు
జానకీధవుండు సరసుఁడగుచు
నాదుకోర్కెఁదీర్ప సాదరభక్తితోఁ
బ్రార్థనంబొనర్చి ప్రణుతిసేతు.

౧౭

సీ॥ భూసుతతోఁగూడి, బొలుపొందు రాముండు
నా హృదయమునఁ జెన్నారుగాత !
తమ్ములతోగూడి, దనరెడి రాముండు
నా నమస్సుఁగొనుఁ బూర్ణంబుగాగ,
మనసున - వాక్కున - మత్కాయమున - నేను
చేసిన కర్మల, శ్రీ రఘూత్త
మునకు, నర్పింతు; యనఘు పాదంబుల
కంజలి ఘటియించి - యధికభక్తి

గీ॥ పాపములనుండి రక్షింపఁ బ్రార్థనంబు
సేతు; పదునాల్గులోకముల్ సేమముగను
కుక్షియందుంచి నాఁడవో కోమలాంగ !
వీర! శ్రీరామ ! రక్షింపు - శ్రీరమేశ !

౧౮

సీ॥ రాజులలో, శ్రేష్ఠుఁడై - జగంబుల కుప
కారంబుసేయు. రక్కసుల నడఁచి
లోకహితమొనర్చి, లోకుల రక్షించి
గుణనిధియన కీర్తిఁగొన్నరామ !
మరకత రత్నసమ్మానిత, తనువుచే
శోభించు చున్నట్టి సుందరాంగ !
కౌసల్య పుత్రుడై, వాసిఁగాంచెదు, హస్త
పద్మంబులనుగల్గు వారిజాక్ష !

గీ॥ రఘుపతీ! జానకీపతీ! రమ్యగుణప
తీ! త్రిలోకపతీ! నిన్నుఁదేఁటభక్తి
ప్రార్థనముసేతు సతతంబు; పాపములను
బాపి, రక్షింపుమా!రామభద్ర! నన్ను

౧౯

సీ॥ షట్కోణ పీఠమాసనముగాఁ గూర్చుండి
వీరాసనముఁబూని వేడ్కతోడ
మోకాలిపై, హస్తమునుగల్గి, వామభా
గంబున - భూజాత గ్రాలుచుండ,
జ్ఞానముద్రనుగల్గి, జ్ఞానోపదేశంబు
హనుమంతునకు, సల్పుచును, ముదంబు
వఱలఁగా, సుగ్రీవ భక్తుండు నినుసేవఁ
జేయ, లక్ష్మణుఁడు దాచేతులందుఁ

గీ॥ బూని, శరచాపముల, నిన్నుఁ బూర్ణభక్తి
సేవసలుపుచునుండగా, శ్రీరఘూత్త
మా! వెలయుచున్న ఁడపు; మనసునందు
నిన్నుఁ జింతింతుఁ బ్రోవుమా సన్నుతాంగ!

౨౦

సీ॥ సౌమిత్రి మిత్రుఁడై, సత్యస్వరూపుఁడై
సురముని వినుతుఁడై - సుందరాంగ!
రామచంద్రుండవై, రఘుపతివై, రాక్ష
స, కులనాశకుఁడవై - సార్వభౌమ!
శ్రీ రమేశుండవై, సీతామహాదేవి
సౌందర్యపాత్రుఁడై - సరసిజాక్ష!
నీలమేఘశ్యామ! నిత్యవందితపాద!
రమ్యకోదండధారణ! ముకుంద!

గీ॥ వెలయుచున్నావు; శ్రీ రఘువీర! రామ!
నిన్ను స్మరియింతు సతతంబు నేమముగను
నాదు తాపత్రయంబుఁ బోనాడఁజేసి
రక్షణముసేయుమయ్య! శ్రీరామచంద్ర!

౨౧

సీ॥ వైదేహి లోచన పద్మంబుల కినుండు,
పూర్ణ చంద్రుని వంటి మోమువాఁడు
సీత మానసమునఁ బ్రీతి నుండెడివాఁడు
శ్రీ కరుండయి, సదా వెలఁగువాఁడు
జానకి మోహింపఁజాలు, సొబగువాఁడు
దయచిల్కునట్టి నేత్రములవాఁడు
సీతా మహాదేవి చెక్కిళ్ల దర్పణ
మందు, వెలింగెడి యందగాఁడు

గీ॥ కొల్లలాడెడి వేదనల్ - పెల్లగించి
సల్లలిత చిత్తశుద్ధి నొసంగి సతము
చందనము వంటి శీతలస్వామి - మమ్ము
రక్షణము, సేయు గావుత-రక్తితోడ.

౨౨

సీ॥ చంద్రుడు, రవియు లోచనములుగాఁగల్గి
కోటి సూర్యులవంటి మేటి కాంతిఁ
దళతళ మెఱయు, సుందర గాత్రమునుగల్గు
కాలస్వరూప! విఖ్యాత పురుష!
శరచాపములను, ప్రశస్త్రాయుధముల, హ
స్తమునందు బూనిన చారుచరిత!
ప్రళయాగ్ని కరణిని భయమును పుట్టించి
భీమాట్ట హాసుఁడై విఘ్నతతులఁ

గీ॥ గొట్టి, శత్రువంశంబుల మట్టుపఱచి
యభయ మొసఁగితి వీవు! లోకాళికెల్ల
రామ! శ్యామాభిరామ! ప్రార్థన మొనర్తు
నామనోదుఃఖముల, బాపుమా! ముకుంద!

౨౩

గీ॥ దశరథాత్మజుని, గుణకథామృతంబు
రాఘవేశ్వరుని, గుణకీర్తనము, లక్ష్మ
ణాగ్రజుని, పాదసేవయు నబ్బుగాక!
జన్మ జన్మంబులను నాకు, సత్యముగను.

౨౪ (అ)

కం. రాముఁడు, నాకులదైవము
రాముని చేఁ నాదుపాప రాశి నశించున్
రాముని కంటెను సులభుఁడు
భూమీస్థలి లేడు లేడు పొలుపుగ వెదకన్

౨౪ (ఆ)

కం॥ రాముని దాసుఁడ నేనే
రాముఁడె నావంశ గురువు! రామునిపై, నా
కేమో - మిక్కిలి యిష్టము
రాముని నే నా దరమునఁబ్రార్దన చేతుఁ

౨౫

సీ॥ శ్రీరామ! నీ కీర్తి స్థిరకల్పకంబాయె
భువనంబు పాదయి పొలుపు మీఱె
నాగలోకము మొదల్గాగ, నాకాశంబు
ప్రాకయి వెలసెను మాన్యముగను
దిక్కులు గొమ్మలై తేజరిల్లదు నుండె
జుక్కలు పువ్వులై చోద్యమొసఁగె
నిండు చంద్రుఁడు, తీపి పండయి ముదమిచ్చె
అమృతధార లోనంగి హాయిగాగ

గీ॥ రామ! శ్రీరామ! రఘురామ! రామచంద్ర!
నిన్ను బొగడంగ నేనేర నన్ను తాంగ!
నాదు లోపంబులను బాపి మోదమొసఁగఁ
బ్రార్థనముజేతు సతతంబు ప్రణతు లొసఁగి.

౨౬

సీ॥ పులకాంకురముగల్గు భూజాత సీతను
ముదమునఁగొగిట నదిమిపట్టి
వామ స్తనాగ్రంబు వామ హస్తముతోడఁ
దాకి, దక్షిణపు హస్తంబునందు
జ్ఞాన ముద్రవహించి, జ్ఞానోపదేశంబు
సురుచిరానందమౌ సూక్తితోడ
మతిమంతుఁడౌ, హనుమంతున కొనరించి
యతఁడు, సేవింపగా నలరినావు

గీ॥ దంబుగా, రాజ్య సింహాసనంబునందు
ముఖియు చున్నావు శ్రీరామ! పుణ్యధామ!
నిన్ను సతతంబు సేవించు నిర్మలులకు
రక్ష యొసఁగుము రాఘవా! రామభద్ర!

౨౭

సీ॥ ఒకచేత ధనువు, వేరొకచేతఁజక్రమిం
కొకచేత శంఖంబు నుత్సుకతను
మఱి యొక్కచేతను-మహిత బాణంబును
ధరియించి యున్నావు-భద్రముగను
వామాంకమున, జానకీ మహిళా శిరో
మణి చేతికంకణ క్వణము సెలఁగ
భవ్యదివ్యభూషణ ప్రాప్తిఁ జేఁజెలువొంది
రఘువంశ రత్నమై-రామచంద్ర!

గీ॥ శ్రీ చతుర్భుజములఁతోడ-చెలువుగాగ
కరము శోభించు చున్నావు కమలనేత్ర!
శ్యామలాకార! రఘుపతీ! సత్యచరిత!
నిన్నుసేవింతు సతతంబు-నిశ్చలముగ

౨౮

సీ॥ వామభాగంబున-వైదేహి భరత, శ
త్రుఘ్నులిరుగడల-రూఢి మెఱయ
మించట మారుతి-మోకాలిపై వ్రాల
వెనుక లక్ష్మణుఁడు, దా వెలయుచుండ
వాయవ్యకోణాన-వానరరాజు, వి
భీషణుఁడీశాన్య వీథివెలయ
నాగ్నేయమూలయం దంగదుండుండ, నై
రుతి, జాంబవంతుడు-నుతియొనర్ప

గీ॥ మధ్యనల్లగలువ-మాడ్కి. సుందరమైన
కాంతిచేతవెలసి గ్రాలుసట్టి
రామ! భక్తవరద! రక్షింపుమయ్య! నిన్
జిత్తశుద్ధితోడ-సేవఁజేతు

సీ॥ కల్పవృక్షము క్రిందఁ గనక మంటప మందుఁ
బుష్పకం బొక్కటి-పొల్పెసంగు
రత్నపీఠంబందు-రాజిల్లు సద్దాన
వీరాసనము తోడ-వెలసినావు
పద్మాక్షి జానకి-వామభాగంబున
రాజిల్లు; భరతుండు-లక్ష్మణుండు
నిన్ను సేవింతురు; నిష్ఠతోఁ బావని
జ్ఞాన తత్త్వంబులు-నదువుచుండ

గీ॥ మునితతికి, తత్త్వబోధన-ముద్దుగాఁగఁ
జేయు చుండెడు, శ్రీరామ! చిద్విలాస!
శ్యామలాకార! సేవింతు-నేమమార
పాప పుంజంబులను, వేగ-బాపుమయ్య.

౩౦

సీ॥ అందె లొడ్డాణంబు-హారముల్, కడియముల్
చెవుల పువ్వులుగల్గి-చెలువమొప్ప
సుస్మితాననముతో-శోభిల్లి రుచిర వే
షమున, చెల్వారు తోషమున బరగి
కర్పూర మిళితమౌ - ఘనసారయుత గంధ
కలితమై, ఘుమఘుమల్ గ్రమ్ముచుండు
స్తనయుగ్మమును గల్గు-జానకి నాలింగ
నము సేయఁ బులకలు-నాతికబ్బె

గీ॥ నవ్వు మోము తోడ-నల్లనీ వాఁడైన
రాముఁ గాంచి సీత రక్తిఁ జెందె;
నట్టి సుందరాంగు-నధిపు, రఘుశ్రేష్ఠు
భక్తితోఁ దలంతు-ప్రణతు లొసఁగి

౩౧

సీ॥ బ్రహ్మకుఁదండ్రివై-వరలిన వాఁడవు
శత్రుసంహారంబు-సలిపినావు
విద్యాధరులచేత-వినుతింప బడినావు
అంతట వ్యాపించి-యలరినావు.
వ్యాసుఁడాంగిరస-వరమౌని ముఖ్యులు
వినుతింపఁగీర్తిచే-వెలసినావు
ఆ విభీషణు, శరణన్నఁ బ్రోచితివీవు!
భూజాత భర్తవై పొలిచినావు.

గీ॥ విష్ణురూపుఁడవై, లోకవితతి, సృష్టి
చేయుచును, పరిపాలించి, చేసి వృద్ధి
ప్రజలఁ బోషించు చున్నావు రామచంద్ర!
శరణు వేడెద రక్షింపు కరుణగల్గి.

౩౨

సీ॥ మిథిలలో, శుభవార తిథియందు శ్రీరామ!
నీ వివాహంబు, వన్నియకు నెక్క
చంద్రకాంతమణులఁ జక్కఁగాఁ దీర్చిన
శుభ పీఠమందుఁ గూర్చుండినావు
కళ్యాణ వేదికఁ గాంత సీతనుగూడి
వేదార్థములఁ బ్రీతి వినుచు నట్టి
విద్వాంసులను, కడు వేడ్కతోఁ గాంచుచు
వారి యాశీస్సులఁ బరగఁబొంది

గీ॥ పెండ్లికూతురు జానకి ప్రియమొసంగ
వేడ్కనుంటివి; వహ్వారె! పెండ్లికొడుక!
నవ్య దంపతులరు మీరు-నాకు శుభము
సర్వవేళల నొసంగుడీ జయ మొసంగి.

౩౩

సీ॥ దినకరకులబాల! దివ్య కోదండంబు
ధరియించి, శత్రుమర్దన మొనర్చి
మూడు లోకములకు, ముదముఁ జేకూర్చి, త
నూ కాంతిచేనింపి, లోకములను
వెలుఁగొందఁజేయుచు, విహరించి నాఁడవు
దశరథ కులదీప! ధర్మ హృదయ!
రత్న భూషణముల, రాజిల్లు శ్రీరామ!
శుభగుణ చారిత్ర! సుందరాంగ!

గీ॥ దేవతాళి పద్మముల దేదీప్యమాన
ముగ, ప్రకాశింప జేయుచు-మురుపు గొల్పు
భాస్కరుడవీవు! శ్రీరామ పరమపురుష!
ప్రాంజలి నొనర్తు-రక్షింపు! భక్తవరద!

౩౪

సీ॥ స్నిగ్ధమౌ నల్లని నిడుపు వెంట్రుకలచే
గొప్ప నేత్రములచేఁ గొమరుమీఱి
చారు ముఖంబుచేఁ జక్కని నుదురుచే
భ్రూ విలాసంబుచేఁ బొలుపు మీఱి
రత్న దంతములచే-రాజిల్లు ముక్కుచే
బింబోష్ఠములచేత, పేర్కమీఱి
కంబు కంఠంబుచేఁ గఠినమౌ ఱొమ్ముచే
పిడికిలి నడుముచే, ప్రియము మీఱి

గీ॥ రామ! ఆజాను బాహుండవై, మనోహ
రంబులగు, గొప్ప పిఱుదులు, రమ్యమైన
పిక్కలును, పాదపద్మముల్ చక్కఁగాఁగఁ
గల్గియున్నావు; ప్రార్థింతు కావుమయ్య!

౩౫

గీ॥ హరుని చండ కోదండంబు విఱిచినావు
జానకీ హృదయానంద! సారసాక్ష!
శ్రీ రఘూత్తమ! శ్రీ రామ! చేతు నీకు
వందనంబులు గావుమా-సుందరాంగ!

౩౬

గీ॥ ఎఱుఁగు, నీ నామ రుచిని మహేశ్వరుండు,
అరయు, నీ పాద సామర్థ్య మాయహల్య,
శివధను వెఱుంగు నీభుజ శ్రీ విలాస
మబ్ధి నీ బాణగతిఁ దెలియంగనేర్చు,
నీకరుణ యర్థమగు నాకు నిశ్చయముగ
కావు మయ్య! సీతాపతీ! కావుమయ్య

౩౭

సీ॥ దివ్యమౌ రథము నధిష్ఠించి, రణగుణ
ధ్వని సేయుచుండెడి ధనువుఁబట్టి
ప్రళయాగ్నితోఁబోలు బాణంబు సంధించి
అస్త్ర తూణీద్వయం బమరఁగల్గి
రాక్షస కోటుల రణమందు నిర్జించి
సాధు సజ్జనులను శాంతపఱచి
అంగద సుగ్రీవ హనుమదాదులచేత
సేవింపఁబడుచున్న శ్రీ శుభాంగ!

గీ॥ రామ! కెందామరలఁబోలు, రమ్యమైన
నేత్ర యుగ్మంబులనుఁగల్గి, నిన్ను స్మరణ
సల్పు వారల రక్షించు సారసాక్ష!
భజన సల్పెద నిరతంబు భక్తితోడ.

౩౮

సీ॥ బ్రహ్మాది దేవతల్ ప్రభవించినారు, నీ
నాభి పద్మంబులో, నళిననేత్ర !
పదునాల్గు లోకముల్ బవళించియుండు నీ
గర్భకోశంబులో - కంబుకంఠ !
ఇందిరారమణి, వసించు నీ వక్షస్థ
లంబున సుఖముగా లలితచరిత !
సాధు సజ్జన మహాజనులు, నీనామ మం
త్రము, బఠియింతురు, తత్త్వ వేత్త !

గీ॥ రామ ! సర్వశుభాకార ! ప్రణతు లొసఁగి
ప్రార్థనముసేతు; సంసార బంధనములఁ
జిక్కి తపియించు దీనుండ ! జిక్కువాపి
రక్షణము సేయుమయ్య ! శ్రీరామచంద్ర !

౩౯

సీ॥ శృంగార రసము తాఁ బొంగార సీతతో
మించువేడుక విహరించినావు.
శివధను ర్భంగంబుఁ జేసెడి వేళలో
వీరరసంబు, గుప్పించి నావు.
కాకాసురునియందు, కారుణ్య రసమును
చిలికించి, వాని రక్షించి నావు.
అంబుధిలో, పర్వతాళివి దేలించి
యద్భుతంబునుజూపి యలరినావు

గీ॥ శూర్పణఖయందు హాస్యంబు జూపినావు
పరుల కాంతలయందు, బీభత్సరసము
రావణాసుర వధయందు రౌద్రరసము
శాంతరసమా, మునీంద్రుల శాంతఁజూపి
భయము బొడసూపితివి, ప్రతిపక్షులకును
రామ ! శ్రీరామ ! రక్షింపు ! రామచంద్ర !

౪౦

గీ॥ తల్లిదండ్రి నాకు ధరణిలో రాముండు
భ్రాత నాకు, ధరణిజాత విభుండు
సఖుండు నాకు రామచంద్రుండు; సర్వస్వ
మరయ రాముండతని నాశ్రయింతు.

౪౦ (అ)

గీ॥ ఇష్టదైవ మతండె, కష్టంబులను బాపు
సులభ దైవమతండె, చూడ వేఱు
దైవ మెఱుంగనేను-దయతోడ రాముండు
రక్షసేయునన్ను రక్తితోడ,

౪౧

సీ॥ నవరత్న ఖచితమౌ నవ్యపీఠమునందుం
గల్పవృక్షము క్రిందం గ్రాలినావు
విల్లంబులనుబూని - ప్రేమముతో లక్ష్మణ
వర్యుండు, నినుంగొల్వం బరగినావు
ముత్యాల గొడుగును ముద్దుగా భరతుండు
ప్రియము మీఱంగంబట్ట వెలసినావు
వింజామరలంబూని-వేడ్క- శత్రుఘ్నుండు
సేవింప ముదమునం జెలంగినావు

గీ॥ వామ భాగంబునను సీత వఱలుచుండం
జిఱునగవు మోము నందునం జిందులాడ
రామ! వెలుగొందు చున్నావు; ప్రార్థనంబు
సలిపి, భజియించు చున్నాడ! శరణు! శరణు!

౪౨ (అ)

గీ॥ ఎడమ చేత ధనువు - కుడిచేత బాణంబు
వీపు నంబుల పొదిం బ్రీతిం గ్రాల్ప
లక్ష్మణుండు గొలిపి, లక్ష్మి ధరాజాత
వామ భాగమందు వఱలుచుండ.

౪౨ (ఆ)

గీ॥ రామ! నీలమేఘ శ్యామ! పరిణతు లొసంగి
నిన్ను సేవించు భక్తుల, నిఖిల దుఃఖ
పుంజములఁ బాపు చుందువు పుణ్యపురుష!
నన్ను రక్షింపుమయ్య శ్రీనాథ శరణు।

౪౩

గీ॥ అంబుజాక్ష। శ్యామలదేహ! కంబుకంఠ।
వీరపురుష। జటాధారి। వినుత లక్ష్మ
ణుఁడు, ధరాజాత. నీ సేవ ఱటఁగ నెపుడు
సేయు చున్నారు రామ। నా సేవ యెంత?

౪౪ (అ)

గీ॥ అప్రమేయ! వరద! యాజానుబాహుండ
వీవు! దాశరథివి। వినుత సుగుణ।
త్రిజగములకు, వీర దేవుండ వీవు। కో
దండధారి! నాదు దండ మిదిగో!

౪౪ (ఆ)

గీ॥ లక్ష్మణుండు చెంత రాజిల్లు చుండంగ
దిక్కులేనివారి మ్రొక్కు బడుల
శ్రీ శుభాంగ! కరుణ జెలంగఁ దీర్చుచున్న
వాఁడవయ్య రామ! వందనములు।

౪౫

సీ॥ కోటి మన్మథరూప! కువలయ దళనేత్ర।
రఘువంశ తిలకమా। రామచంద్ర।

కస్తూరి వాసనల్ గ్రమ్మిన దేహంబు
గల్గి, నిర్మలుఁడవై గ్రాలువాఁడ ।
ఖరరాక్షసుని ధైర్యగరిమను జెండాడి
వీరాధి వీరుఁడై - వెలయువాఁడ !
ముక్కంటి సేవల - ముదముతోఁ గొనువాడ ।
అప్రమేయుండవై - యలరువాఁడ

గీ॥ చంచలలకుఁ గామములఁ బుట్టించువాఁడ ।
సీతతోఁగూడి శుభములఁ జెలఁగువాఁడ !
విష్ణు రూపుఁడౌ శ్రీరామ । వేడ్క నిన్ను
భజన సల్పెద - కావుమా - భక్తవరద ।

౪౬

సీ॥ దిక్పాలకు లఖిల దేవతల్ నీ పాద
కమలముల్ సేవింప గ్రాలినావు
సర్వలక్షణముల - సంశోభితంబైన
యమల దేహంబుతో నలరినావు
కనక కుండలముల కాంతిఁ బ్రకాశించి
పీతాంబరము తోడ - వెలసినావు
నీలమేఘశ్యామ ! నిగమ వందితరామ !
సీతా మనోహరా ! శ్రీనివాస ।

గీ॥ రఘుపతీ ! నిన్ను సతతంబుఁ బ్రార్థనముల
సేవ సలిపెడి వారికిఁ జింతలున్నె ?
రామ । శ్రీరామ ! సీతాపతీ ! మనోహ
రా । ముకుంద! రక్షింపుమా - రామభద్ర ।

౪౭

సీ॥ నిగనిగలీను, మాణిక్య కాంతులు, గిరీ
టముల నుండి దొరల - దండు మీఱ
బ్రహ్మదేవుండును -ఫాల నేత్రుండు, దే
వేంద్రాది సురలు, నీ కెలగుదుంద్రు;
పార్వతి నీపాద పద్మముల్ సతతంబు
స్తుతియించుచుండు ; నన్నుతులొనర్చి
కోదండధారివై - వేదండములఁబోలు
శత్రులహరణంబు సల్పుచుండు

గీ॥ వీశ్వరుని, మానసంబును శాశ్వతముగ
హరణ మొనరించినావు ; విఖ్యాతమైన
కీర్తియబ్బెను శ్రీరామమూర్తి ! నిన్ను
సేవఁజేసెద రక్షింపు; శ్రీ శుభాంగ !

౪౮

సీ॥ అంజలి జోడించి యాంజనేయుఁడు ముందు
నాతని చేరువ నంగదుండు
కుడిని, సుగ్రీవుండు గొమరారొప్పి భజియింప
నా విభీషణుఁడుండె యతనిప్రక్క-
వామభాగంబున, భామ సీతాదేవి
చెలువుగా నీ సేవ సలుపుచుండ
లక్ష్మణానుజుఁడు, సలక్షణంబుగ నెన్న...
ప్రక్కన ఛత్రంబుఁ బట్టియుండ!

గీ॥ వీరి మధ్యను శ్రీరామ ! వేడ్క శ్రీకర
ముఱియు చున్నావు; జ్ఞానపు ముద్రనొప్పి
నిన్ను ధ్యానించుచున్నారు - నిర్మలాత్మ !
రమ్యగుణధామ ! శ్రీ రామ ! సోమ్యనామ!

౨౯

సీ॥ పాల సముద్రంబు బరగు ; నా మధ్యలోఁ
దెలిదీవి యొక్కండు వెలయుచుండుఁ
గనకాద్రి యాద్వీపకంబులో వెలయును
కల్ప వృక్షములందుఁ గాంతు లీను
కల్పకంబుల క్రిందఁ గనక మంటప ముండుఁ
గనక మంటపమునఁ గాంతు లొసఁగు
వేదిక చెన్నారు; విఖ్యాత మానమౌ
సింహాసనంబందుఁ జెలఁగు చుండు:

గీ॥ దాన, బంగారు పద్మంబు దనరుచుండు
నందు, వీరాసనము బూని సుందరాంగ !
రామ ! శోభించు చున్నావు రమణితోడ
అట్టి నీస్వరూపధ్యాన మాచరింతు.

౩౦

సీ॥ పిడుగులఁబోలెడి భీషణ బాణముల్
రవికోటి కాంతులఁ గ్రిక్కుకొనుచు
బ్రహ్మాదులెల్ల - 'సెబాసన' నీ ధను
స్సునుండి వెడలివచ్చుచు, ముకుంద !
రాక్షసవరుల దోర్బలము రూపడగించె;
సుగ్రీవ వానర శూరవరులు
శ్రీరామ ! మేల్కొని - పోరాటముల సల్పి
నీ యాజ్ఞ భక్తి మన్నించినారు;

గీ॥ ఖలులు రాక్షసాళి ఖండింపఁబడినారు
సాధు సజ్జనాళి సంతసంబు
బొందినారు, సుఖములందిరి; శ్రీరామ !
వందనంబు నీకు సుందరాంగ !

౫౧

సీ॥ శ్రీరామ ! వింటిని జేఁదార్చి బాణముల్
సంధించి విడిచెడు సమయమందు
భీషణ రావంబు వెలువడి, దిక్కుల
న్నియు నిండుకొనిపోవు నిగమచరిత !
భూకంపములు పేగుట్టు, నాకాశంబు
బ్రద్దలై, పటియలు వాలు; వనధి
క్షోభించు; రాక్షస శూరులు మరణింత్రు;
పర్వత తతులెల్ల బ్రద్ద లగును.

గీ॥ దేవతావళి తలలూచు దివ్యముగను
సీత సంశసంబొందును శ్రీ కరముగ
రామ ! శుభనామ ! శ్రీరామ ! రామచంద్ర !
నీ భుజాశక్తి నాకు వర్ణింప వశమె ?

౫౨

గీ॥ రమ్యమైనట్టి కమల నేత్రములవాఁడు
పశిథల వెలుగొందు నీలగాత్రంబువాఁడు
ధన్యమైనట్టి శుభచరిత్రంబువాఁడు
చండ దానవధ్వాంత మిత్రుండు, తపన
కుల పవిత్రుండు, రాముండు, గుణమయుండు
భూమిజాతా కళత్రుండు, పుణ్య యశుఁడు
దశరథ వరపుత్రుండు, కోదండధారి
నాకు మిత్రుఁడతనికి, వందన మొనర్తు.

౫౩

గీ॥ సీత తల్లి, రాముఁడు తండ్రి, స్నేహితుండు
లక్ష్మణుం డాంజనేయ, నలాంగదాది
వీరవానర బంధువుల్ వెలసి యుండ
భయ విచారంబు నాకేల పట్టువడును ?

౫౪

సీ॥ వైదేహి కెప్పుడుఁ బ్రాణ మంత్రంబైన
రామ మంత్రముసాటి భూమిఁగలదె?
విబుధ వరేణ్యుల వినుతి పాత్రంబైన
రామ మంత్రముసాటి భూమిఁగలదె?
దితిజుల మర్దించి స్తుతిపాత్ర మైనట్టి
రామ మంత్రముసాటి భూమిఁగలదె?
జగతీ జనుల మోక్ష సాధన మైనట్టి
రామ మంత్రముసాటి భూమిఁగలదె?

గీ॥ రఘుపతీ! నీ పరమ మంత్ర మఘము బాపు,
దాశరథి! నీ విమలమంత్ర మాశ లుడుపు
జానకీశ నీనామ సంస్మరణమందె
ముక్తి చేకూరు; వేయేల భక్తవరద!

౫౫

సీ॥ మందార పుష్ప సమ్మానిత మైనట్టి
పాదపద్మంబులు పరగువాఁడు
ఇంద్రుండు, బ్రహ్మ, మునీంద్రులచే, నమ
స్సులఁగొను చరణముల్ గలుగువాఁడు
లక్ష్మణుండొక ప్రక్క లలన సీతాదేవి
రెండవ ప్రక్కలోనుండి, తన్ను
సేవింప, విష్ణుఁడై చెలువొంది, కోదండ
ధారియై, శాంతుఁడై దనరువాఁడు

గీ॥ చంద్రుని బోలువాఁడు, జలజ నేత్రమువాఁడు
మలయ పర్వతంపు మధుర గంధ
మొదలి పూతగాఁగఁ గడుచెల్వుఁగలవాఁడు
రాముఁ డతనిఁగొల్తుఁ బ్రార్థనముల

౫౬

గీ॥ పుడమి నిక్ష్వాకు వంశానఁ బుట్టినావు
అనఘ సుగ్రీవు పూజల నందినావు
పొంచి, త్రిభువనములను, రక్షించి నావు
సత్య వాక్పాలనంబును జరిపినావు
పద్మ నేత్రంబులను గల్గి వరలి నావు
రాఘవా ! రామచంద్ర ! భద్రాద్రిరామ !
నిన్ను సేవింతుఁ బూజింతు నిశ్చలముగ
నన్ను రక్షింపుమయ్య ! సంపన్న చరిత !

౫౭ (అ)

గీ॥ భూమి జాత విభుఁడు - భూరి మందారమై
యతని కరము సీత నాశ్రయించి
కొమ్మయై వెలుంగ, గొప్ప వేదాంత, వి
జ్ఞాన సుమము లందు జననమొందె

౫౭ (ఆ)

గీ॥ మంచి పరిమళంబు నించె నా పుష్పంబు
అందుఁ బ్రభవమొందె యమృతరసము
లూట గారునట్టి మేటి బ్రహ్మానంద
మనెడి ఫలము దాని ననుభవింతు.

౫౮ (అ)

కం॥ బంగారు కాంతిఁ గలిగిన
రంగారెడు మేనుఁ గల్గి రాజించెనుగా
శృంగారంబుగ జానకి
భృంగంబులు మోముదమ్మి వెసఁ గ్రమ్మంగన్

౨౮ (అ)

కం॥ భృంగములకు భయపడి, యా
లింగన మొనరించె సీత లీలాకోలన్
శృంగార పురుష రాముని
జెంగటఁ దామెఱపు కరణిఁ జెలువు వహించెన్

౨౮ (ఇ)

గీ॥ క్రొత్త మెఱపు తోడఁ గూడిన మేఘంబు
విధము - రామచంద్రవిభుఁడు, సీత
తన్నుఁ గౌగిలింపఁ దనరారు చుండె; నా
తండ్రి బాపు నాదు తాపములను

౨౯

గీ॥ శాస్త్ర పాఠంబులేల, విచార మేల,
వేద పఠనంబు లేలొకో? వాదు లేల,
జప తపంబులు వ్రతములు సల్పనేల?
యాగ, ముపవాసములు. తీర్థయాత్రలేల?
రామనామ మహాత్మ్యంబు రక్తిఁగల్గు
మానవులకేల డంబంబు? మరణ భయము
లేదు, పాపభీతియులేదు లేశ మేని
రాము గుణధాము సేవించు ప్రాటలకెపుడు

౩౦

గీ॥ మానస సరోవరంబు, రమా వధూట
చిత్తమందలి విహరించు - పత్త్రరాజ
హంసమైన యో శ్రీరామ! యహరహంబు
బాధలొనగూర్చు, సంసార బహుళ కష్ట

తతులఁబోనాడి, నాకు శాంతం బొసంగి
రక్ష నొసఁగుము; తారక బ్రహ్మరామ!
రాక్షస ధ్వంస! శ్రీరామ! రామభద్ర!
నా నమస్సులఁ గొనుము; శ్రీనాథ! వరద!

౬౧

సీ॥ సాకేత పురమందు, సరయూ నదీతీర
సైకతంబుల యందు, సౌరతంబుఁ
గూర్చుండి శ్రీరామ! కొమరొప్పు నీ నామ
చింతన మదిలోనఁ జేయునట్టి
శుభదివసంబు వచ్చునె? యెన్నటికి నేని
శ్రీరామ! సీతాపతీ! రమా వి
భుండ! మనోహరా! పొలుపారు, రాకాశ
శాంతమూర్తి ముకుంద! సాధు చరిత!

గీ॥ రామ! రక్షింపు! రక్షింపు! రామచంద్ర!
యంచు, మొఱ! నిదుమాడఁగ, నబ్ద తతుల
నెలలు, దినములు, గంటలై, నిమిషములుగఁ
గడచు "నెన్నడో! యని నేను కలవరింతు

౬౨

గీ॥ తులసితోట, యయోధ్యలో వెలయు; నచట
నూర్ధ్వ పుండ్రంబు ధరియించి యున్నవాఁడు
రాక్షసధ్వంసి, జానకీ రాముఁ డతని
సహరహంబుఁ బ్రార్థింపగా నబ్దతతుల
నెలలు, దినములు, గంటలై, నిమిషములుగఁ
గడచు నెన్నడో! యని నేను కలవరింతు.

౬౩

గీ॥ రత్న సింహాసనము నందు - రామచంద్ర!
కూరుచున్నా వయోధ్యలో గూర్మితోడ
సీత బెండ్లాడఁగాఁ గోరి శివ ధనుస్సు
విఱిచినాఁడవు; రఘుపతీ పేడ్క తోడ
నిన్నుఁ బ్రార్థింప నట్టిముల్, నెలలు, దినము
లగుచు, గంటలై, నిమిషంబు లగుట యెన్న
ఁడంచుఁ గలవరింతును నేను, హరి! ముకుంద!

౬౪

సీ॥ రత్నంపు వేదికల్ - రాజిల్లు చుండును
తెరువులలో, ప్రతి తరువు క్రింద
ప్రతివేదికోపరి భాగంబునందును
చెలువారుఁ గిన్నర స్త్రీల పాట
ప్రతిపాటలోపలఁ బ్రతిబింబమై యుండు
మంజులాలాపంపు మధుర గోష్ఠి
ప్రతిగోష్ఠియందు - శ్రీరామ నీ కథ యుండు
కథయందు నమృతంబు గ్రాఱుచుండు

గీ॥ నమృతధారఁ గ్రోలినట్టి భక్తుల కెందు
జరయు, మృతియు లేదు; సంతతంబు
నీ కథామృతమ్ము నా కిమ్ము శ్రీరామ!
వందనములజేతు సుందరాంగ;

౬౫

గీ॥ ప్రతి తరువు నందుఁ గన్పడుఁ బక్షిమూక
పక్షి మూకలు మృదువైన పలుకులోనఁగుఁ
బలుకుఁ బలుకున, మంజుల పదములుండు
ప్రతి పదమునందుఁ జెలఁగు శ్రీరామకథలు.

౬౬

గీ॥ శ్వేత పుష్పక మెక్కి, భూజాతఁగూడి
యాంజనేయ, విభీషణులాది భక్త
వరులు నీ సేవఁ జేయంగ వఱలినావు;
నా మనస్సున విహరింపు రామచంద్ర!

౬౭

సీ॥ ఖడ్గ, త్రిశూలము లగ్రముల ధరియించి
డమరుకము, గదయు, డాలుగల్గి
శంఖంబు, పాశంబు, చక్రంబు, ముసలంబు
ధరియించి, నాగలి కరముబూని
చిన్నకత్తియు, విల్లుఁ జేతిలో ధరియించి
బాణంబు. గొడ్డలి పరగఁదాల్చి
భిండివాలంబగ్ని, పిడికిలి బిగఁబట్టి
యభయంబు భక్తుల కరయనొసఁగి

గీ॥ తెల్లరంగుఁగల్గి, దేదీప్యమానమౌ
మూడు నేత్రములను వేడిఁజూపి
సర్వ శత్రువులను, సంహరించెడి, భీక
రస్వరూప! రామ! ప్రణతు లివిగో!

౬౮

సీ॥ పాపాంధ కారంబు-బాపు చంద్రుండవు
దుర్మార్గు లనియెడు-దుష్ట పద్మ
ముల, తోష మెల్లను-ముకుళింప జేసెడు
ముద్దు చంద్రుండవు-మురువు వెలయ
సూర్యవంశ సముద్ర శోభ, పెంపొందఁగఁ
జేయు చంద్రుండవు; స్వీయమైన
ప్రజ కనురక్తుండవౌ, నిండు శశివీవు!
సుర కువలయముల సొబగు పెంచు

గీ॥ చందురుండవు; నీసేవ సలుపు భక్తు
లగు, కుముదముల చందురింద వగణితముగ
రామచంద్రుండ! శ్రీ సార్వభౌమ! నీకుఁ
బ్రణతు లర్పించి ప్రార్థింతు; భక్తవరద

౭౯

సీ॥ కౌశిక యజ్ఞంబు గాచిన దక్షుండు
శుభముల నొసఁగెడి యభయమూర్తి
కనక పర్వతధైర్య గరిమఁగల్గినవాఁడు
కరుణా సముద్రుఁడై - గ్రాలువాఁడు
కంజాత నేత్రుండు-కాకుత్ స్థవంశ్యుండు
సీతా సమేతుండు;, చిన్మయుండు
కష్టముల్ వోకార్చి-యిష్టంబు లొనగూర్చు
మానస దైవంబు మాధవుండు

గీ॥ చిత్త మందు సతము వెలఁగు చుండెడివాఁడు
శాంతి నొసఁగు నట్టి శాంత మూర్తి;
రామచంద్ర విభుఁడు రక్షించు గావుత!
యతని కనుదినంబు నతులొనర్తు,

౮౦

సీ॥ రామాయణంబు, క్షీర సముద్రమాయె; వా
ల్మీకి - మందర మాయె; మీననేత్ర
జానకి లక్ష్మియై - జనియించె; సుగ్రీవ
జాంబవ దంగదుల్ జనన మైరి
కల్పవృక్షములుగా; కమనీయ చంద్రుఁడై
లక్ష్మణుండు జనించె లక్షణముగ
అసుల విభీషణుం డమృత భాండంబుగా
నుద్భవమయ్యె నాయుపధి యందు!

గీ॥ పవన సుతుఁడు, చింతామణి ప్రభల వెలిగె;
రావణుఁడు, కాలకూటమై రహిఁ జనింప
నతనిఁ జెండాడి శ్రీరామ! యశము గొంటి
వయ్య! శుభముల మా కిమ్ము నెయ్యమలర.

౭౧

గీ॥ మాకు దైవంబు, రఘుకుల శ్రీ కరుండు
ప్రీతి దైవంబు, రఘువంశ సూతి మాకు
భరత సోదరుఁడే మాదు ప్రభు వరుండు
రాముఁడే, భగవంతుండు; రాముఁదలఁతు.

౭౨

సీ॥ నీలోత్పలశ్యామ నిర్మలాంగము వాఁడు
సీతా హృదుత్పల శీతకరుఁడు
శాంతంబు గల్గిన సత్య స్వరూపుండు
నిర్మల గుణముల నెగడువాఁడు
పూఁదోఁట కరణి సొంపుల నింపుగూర్చు, మ
నోహర రూపుండు మోహనుండు
ధ్యానంబుఁజేసెడి, మౌనుల మానసం
బను సరోవరమున నాడునట్టి

గీ॥ హంసమై యున్న రామ! ప్రశంసనీయ!
అందమైనట్టి తేజము నందినావు!
ఘోర సంసారబాధఁ గూల్చిరామ!
మానసానంద మిమ్ము; రమా వినోద!

౭౩

సీ॥ మందారవృక్ష సమ్మానితమైనట్టి
మంటప మందులో మహిత మైన

కనక పుష్పక మొందు, కమనీయమై యొప్పు
సందొక్క సభయుందు, నందురత్న
సింహాసనంబుందు - సీతా మహాదేవి
తో, లక్ష్మణునితోడ లాలితముగ
శ్రీరామ చంద్రుండు-వెలువారు నింద్రాది
దేవతల్ సేవింప దివ్యభక్తి;

గీ॥ పద్మనేత్రుండు శ్రీరామభద్రుఁ డమల
మైన, నీలోత్పలామల శ్యామవర్ణుఁ
డెపుడు, మునిసమూహములచే. నెసగువాఁడు
నాదు మ్రొక్కులఁగొనుగాత-సాదరమున

౨౪

గీ॥ నీలనీరద గాత్ర! సుశీల పాత్ర!
ప్రవిమల, ముని మానస, సరో రాజహంస!
ముగ్ధ వనితా మనోమోహ మూలమంత్ర!
కమలనేత్ర! శ్రీరామ! రక్షణము విమ్ము.

౨౫

గీ॥ చాలు వాదంబు, శ్రీరామ చంద్రమూర్తి
నరుడు గాడుసుమీ! నిశాచరులఁ జంపు
ఆది నారాయణుఁడు సుమీ! యతని భక్తి
సేవఁజేయుడి జనులార! చిత్తమందు

౨౬

సీ॥ దశకంఠ కంఠముల్-ధ్వంసం బొనర్చిన
లోకరక్షకుఁడవు, ప్రాకటముగఁ

పరశురాముని గర్వభంగం బొనర్చిన
ధీరమూర్తివి నీవు - ధీసమేత !
లంకేశుపుర మహాలంకారముల నెల్ల
నేలమట్టముజేసి నెగడినావు
జానకీదేవితో సల్లాపముల నాడి
యామె పాపటఁదిద్దు ప్రేమమూర్తి

గీ॥ వనల ధనువును జేఁబట్టి - యఖిల దుష్ట
జనుల శిక్షించి, భూభారమును హరించి
రామ వెలుగొందుచున్నావు ; రత్నమకుట
ధారి ! కోదండధారి ! కైదండనిమ్ము.

౨౨

సీ॥ బ్రహ్మాదియోగులు, రామమంత్రము నెప్డుఁ
పూజించుచున్నారు పుణ్యబుద్ధి
మౌనులు శ్రీరామ మంత్రంబు సతతంబు
జపియించుచున్నారు సత్యమెఱిఁగి
దారిద్ర్య దుఃఖాబ్ధి దాటగా శ్రీరామ
మంత్రంబుఁ జింతింత్రు మనుజులెల్ల
భవరోగమును, నాశ పఱుపగా - శ్రీరామ
మంత్రంబు సేవింత్రు మానవాళి

గీ॥ తలఁప సంసార సాగర తారణంబు
సలిపి, భయమును బాపంగఁ జాలి నట్టి
మహిమఁ గల్గిన శ్రీరామ మంత్రమునకు
సాటియున్నదె? మఱియొండు జగమునందు !

౨౩

సీ॥ శత్రుసంహారంబు సల్పెడు మంత్రంబు
సంసార మను దుఃఖసాగరంబు

దాటించు మంత్రంబు; సూటిగా జన్మసా
ఫల్యంబు నొదగూర్చు పరమ మంత్ర
మన్ని యైశ్వర్యంబు లందు ముఖ్యపు మంత్ర
ముపనిషద్వాక్య సంపూజ్య మంత్ర
మారయ ద్యూతాది వ్యసనంబు లనబడు
పాపుచే గఱపంగ - బడిన యట్టి

గీ॥ వారి రక్షించు మంత్రంబు; వసుధఁ బాప
రాశిఁబోగొట్టు మంత్రంబు; రామ మంత్ర
మరసి, ఓజిహ్వ! ఇద్దాని, నహరహంబు
జపము, సేయుము; నీపాప, చయము దొలఁగు

మంజరి ౭౫

రథమధిరోహించి - రణరంగమందు
బ్రహ్మాస్త్రమును బూని - పరమ ధైర్యమున
ఆకర్ణమారూఢ - మై, ధనుర్గుణము
శోభింప, దిక్కులు క్షోభింప మండ
రావణాసురుని పర్యాణితుజేసి
సంహారించినయట్టి సారసనేత్ర!
శ్రీరామ! శుభనామ! చిన్మయానంద
ప్రార్థింతు నిన్నుసద్భక్తితో సతము

౭౬

సీ॥ అరటి తోటల బోలు, నట్టి, రావణుకంఠ,
ములదెగగోసిన - ముద్దుకరము
అత్యంత సుకుమార - మైన సీతాకుచ
ములకుఁ గుంకుమపూత-చెలువముగను
పూయంగ నెట్టినై - బోలుపారుకరములు;
భువన సంరక్షణమునకు, యజ్ఞ
ముల సేయ యూపముల్ వలెనుండు, గొప్ప ప
రాక్రమో పేతమౌ - లలితమైన

గీ॥ నీదు కరములు; శ్రీరామ మోదమలర
నమ్ముకొన్నాను - దీవనలిమ్ము; నిండు
రెండుకరముల నాశీస్సులిమ్ము; గొప్ప
శుభము లందచేయుము రామ! శుభ్ర చరిత

౮౧

సీ॥ భూషణ తతులచే - భూపుత్రి శోభించి
వామాంక సీమలో - వఱలుచుండ
నామె సౌందర్యంబు - నక్కజం గాంచుచుఁ
బూర్ణచంద్రునివంటి - మొగముతోడ
శోభించు శ్రీరామ! శుభకరనామ! యౌ
దలమీద మిలమిల వెలుగునట్టి
మకుటంబు మెఱయంగ - మానిత నవరత్న
సింహాసనంబున - చెలువుగాగ

గీ॥ గూరుచున్నావు; పవమాను కూర్మిసుతుఁడు
లక్ష్మణుండు, సుగ్రీవుండు - లాలితముగ
నంగదుఁడు, పిన్నపూజింతు రధికభక్తి
రామ! నాసేవ లొక్కింత ప్రేమ గొనుము!

౮౨

సీ॥ సీతావధూమణి - శ్రీవివాహపువేళ
నామె దోసిలియందు - నమరి యున్న
తలఁబ్రాలు ముత్యముల్ - వెలశేని, పద్మరా
గ, మణులవలెఁ దోచెఁ గన్నుఁగవకు
నామీద నాపణులా రామచంద్రుని
శిరమున బడునప్డు - చిత్రముగను
మల్లెపూవుల భంగిఁ దెల్లగాఁ గన్పడె
నంతరాళపువన్నె నావహించి -

తరువాత జాజీ, పుత్యములు క్రిందికి జేర
నపుడు, శ్రీరాము, దేహంపుకాంతి

గీ॥ కతన, దివ్యనీలంబులై - గానబడియె
నట్టి తలబ్రాలు ముత్యంబు - లనవరతము
భక్తులకు, శుభంబులొసంగి - పావనముగ
వారి రక్షించు గావుత - వసుధలోన

౮౩

సీ॥ శ్రీరామ మంత్రంబు - శ్రేష్ఠమై, జ్ఞానంబు
నీతియు, బోధించు - నిర్మలముగ
శ్రీరామ మంత్రంబు - స్థిరతరైశ్వర్యంబు
నారోగ్య సౌఖ్యంబు - లందఁజేయు
శ్రీరామ మంత్రంబుఁ జింతించు వారికి
సౌభాగ్యములుగల్గు సంతసమున
శ్రీరామ మంత్రంబు సేవించు నంజనా
సుతునకు కైవల్యసుఖములబ్బు

గీ॥ మహిమగల్గు రామ - మంత్రంబు గొప్పది
దీని సాటి వేరు గానరాదు -
సతము రామభజన - సల్పెడు వారికి
భయము లేశమేని - వలదు - వలదు

౮౪

సీ॥ వ్యామోహమడగించి - యతిశాంతి జేకూర్చు
నమల శ్రీరామ నామౌషధంబు
మునుల గష్టపఱచు - దనుజులఁజెండాడు
నమల, శ్రీరామ నామౌషధంబు
భవ భయంబునుబాపి । భక్తుల రక్షించు
నమల శ్రీరామ నామౌషధంబు

మూడు లోకములకు ముదము సంపాదించు
నమల శ్రీరామ నామౌషధంబు

గీ॥ శ్రేయ మొసఁగునట్టి శ్రీరామ నామౌష
ధంబు నోయి మనస ! త్రాగి త్రాగి
దుఃఖ రోగములను దొలగించుకొనుము; నీ
వితర చింత సేయుటేల చెపుమ ?

రాగ

సీ॥ ముక్కంటి నీ రూపు ముదమార నుతియించు
సూర్యవంశ శ్రేష్ఠ సుందరాంగ ।
బాలారుణాభుఁడై - పద్మిథల వెలిఁగెడు
కమలా మనోహరా ! విమల తేజ ।
కౌసల్య సుతుఁడవై - కడుమనోహరుఁడవై
చిఱునవ్వు జిందించు చిత్రకాశ ।
దేవతాధిపుఁడవై సేవించు లోకాళి
కానంద మొసగూర్చు నమృతరూప ।

గీ॥ పాప సంహార బాధలఁ బరగఁ ద్రోలి
కనక మణిమయాలంకార ఘనతఁ బొంది
వెలుఁగు చున్నట్టి శ్రీరామ వినుతిసేతు
సతము విన్నుఁ బ్రాతఃకాల సమయమందు

రాగ

సీ॥ చిఱునవ్వురూపులు జెలగు చుండెడివాడు
బహు సూర్యకాంతులఁ బరగువాఁడు
మరకత మణుల, సమ్మోన్య రూపమువాఁడు
ఆనందరూపుఁడై - యలరువాఁడు
దాకొడఁగూర్చున్న - సీత గల్గినవాఁడు
కమల లోచనములు - గలుగువాడు

పీతాంబరంబును - ప్రేమఁదాల్చినవాఁడు
అఖిల లోక నివాసి యైనవాఁడు

గీ॥ శ్రేష్ఠమౌ, ధనుర్బాణముల్ - చెలఁగువాఁడు
మణిగణంబుల లలితుఁడై మామనముల
సతము వెలుగొందు శ్రీరామచంద్రు; శుభగు
సన్నుతింతును; మధ్యాహ్న - సమయమందు

౭౬

సీ॥ పూర్ణ చంద్రునిబోలు, ముద్దుమోము గలాఁడు
ముసిముసి నవ్వుల నెసగువాఁడు
కోటి సూర్యులవంటి మేటికాంతి గలాఁడు
సురముని వినతుఁడై పరగువాఁడు
భవమహాశాసన బాధ మాన్పెడువాఁడు
శ్యామదేహంబుతో నలరువాఁడు
దేవతాధీశుఁడై దివ్యకాంతి గలాఁడు
సీత సేవింపంగఁ జెలఁగువాఁడు

గీ॥ భక్త సులభుండు, శ్రీరామవల్లభుండు
శ్రేష్ఠసింహాసనస్థుఁడై చెలఁగియుండు
సంతసమున, సాయంకాల సమయమందు
సతనిఁ బ్రార్థింతు నిశ్చలమతిని రతిని

౭౭

ఆ॥ కమలనాథ! రామ! కంకణకేయూర
మణిసరములతోడ మాన్యుఁడగుచు
ఛత్రచామరముల సంసేవ్యుఁడై; కోటి
పూర్ణచంద్రకాంతిఁ బొందినావు.

౭౭ (అ)

ఆ॥ పదియు నారువేలు బంగారు స్తంభముల్
గలుగు మంటపమున వెలసి భ్రాతృ

కతియుఁగొల్వ, దేవతల కధీశుండవై
వఱలురామ ! కొనుము వందనములు

౮౯

గీ॥ దాశరథి ! క్షణమాత్రంబు ధనువువీడి
నెమిలి పింఛంబు ధరియించి, రమణఁబిల్ల
గ్రోవి మోగ్రియింపుమయ్య ! మా కుతుకమెక్కు-
వాయె; కర్ణామృతము సేయుమయ్య రామ !

౯౦

సీ॥ మొలత్రాటి మణులచే వెలసియుండెడునట్టి
మువ్వల గజ్జెలు సవ్వడింప
ముద్దుగా నుదుటిలో, ముత్యాల చేర్చుక్క-
కరము సొంపులు నింపగా నెలర్చి
అంతఃపురమునందు నంబాజనాళిని
రంజించి, దశరథరాజు నెదుట
సంచార మొనరించు సత్యస్వరూప ! నీ
చరణపు టందియల్ సందడింప

గీ॥ ముసిముసిగ నవ్వుచుందువో మోహనాంగ !
నీకు వందన మొనరించు నిఖిలజనుల
బాధలను బాఱద్రోలెదు బాలరామ !
ప్రార్థనముసేతు వినుగూర్చి భక్తితోడ.

౯౧

సీ॥ పూర్ణచంద్రునివంటి, ముద్దుమోము, గలాఁడు
కమలనేత్రంబులు గల్గువాఁడు
మణికుండలంబుల మహితఁదాల్చినవాఁడు
వరకిరీటముచేత వఱలువాఁడు
సంపంగి పసుపు పచ్చని చీరగలవాఁడు
శరచాపములతోడఁ బరగువాఁడు

ఇంద్రనీలమణుల కీడైన శ్యామల
వర్ణదేహంబుతో వఱలువాఁడు

గీ॥ తులసిమాలికా తతులచే వెలయువాఁడు
మునిసమూహంపు, వందనములను గొనుచు
నిత్య సౌందర్యమూర్తియై నెగడువాఁడు
రామచంద్రుడు ననుబ్రోచు రక్తితోడ

౯౨

గీ॥ రామచంద్ర! దయాసాంద్ర! రాజవదన!
నన్నుఁ జూడుము; కాపాడుమన్న! కరుణ
గల్గు నేత్రంబు లొక్కింత కమలనాభ!
నాదుదెసఁ ద్రిప్పుమయ్య! వందనమొనర్తు.

౯౩

సీ॥ కలియుగమందుండు కల్మషమానవ
తతి, వేఱు ధర్మచింతనముసేయ
వలవదు; రామేతివర్ణ ద్వయంబును
సతమాదరంబున సంస్తుతింప
ముక్తిచేకూరును; భక్తుల కిష్టుఁడై
కామితార్థంబులఁ గల్గఁజేయ
శ్రీరామచంద్రుండు సిద్ధమైయున్నాడు
కామధేనువు, కల్పకముకరణి

గీ॥ కోటి, సూర్యచంద్రులతోడ మేటియైన
కాంతితో, వెల్గుచుండు శ్రీ కాంతుఁడాది
పూరుషుఁడు, రామచంద్రుండు - పుణ్యమూర్తి
యతని స్తుతియించి మోక్షంబు నందుడయ్య!

౯౪

సీ॥ సకల లోకంబుల సత్యరత్నంబీవు -
సకల శాస్త్ర రహస్యసారమీవు।

సచ్చిదానందుఁడై, సమర జయముగొన్న
రఘువంశరాజుల రత్నమీవు।
దశకంఠ సంహార। దానవ కులనాశ!
శ్రీరామ భవనాశ। చిత్ప్రకాశ।
నవరత్నములమించు నవరత్నమవు నీవు।
సీతకు రత్నమై చెలఁగుదీవు!

గీ॥ నాకు రత్నమీవు। నా హృదయాబ్జంబు,
దొంగిలించినావు రంగుగాగ
రామరత్నమా। విరాన నా దరిజేర
రాగదయ్య। చేతుప్రార్థనంబు.

౬౨

సీ॥ అల్లారు ముద్దుగాఁ దల్లిచెంగట నీవు
రతనంపు శయ్యపై ప్రాభవముగ
సొగసైన నగలచే సుందరాంగుడవౌచు,
కనులు మూసి నిదురకనులలోన
తల్లిత్రొమ్మునుబట్టి మెల్లమెల్లనఁ బాలుఁ
గ్రాపుచు, రెండవ స్తనము నీదు
వ్రేళ్ళచేఁబట్టుచుఁ బ్రియమంది సుఖివౌచుఁ
గట్టిగా దల్లిని గౌగిలించి

గీ॥ నిద్ర నభినయించు నీరజలోచన!
వట్టి మాయకాడ। బాలరామ!
నీదు బాల్యలీల నెమ్మని జూపుము
కాచి నాడ నేను కమలనయన!

౬౩

సీ॥ సుందరాకారుల సుందరమూర్తివి,
నయనాభి రాముఁడైనావు నీవు!
ఇంపైన వాక్యంబు లెపుడు బల్కుదువీవు।
సుందర ముఖముతో నుందువీవు

సర్వజనుల కీవు సంతోష మొసఁగుదు
సర్వదా ముదమునఁబర్వుదీవు !
దశరథవరపుత్ర ! దానవ నాశన !
సీతామనోహరా ; శ్రీ విలాస !

గీ॥ రామ, జయరామ! శ్రీరామ; రామభద్ర;
భద్రయశములఁగూర్చు, సౌభాగ్యసీమ ;
నా మనంబున సతతంబు నేమముగను
నధివసించియు నన్బ్రోవుమయ్య, వరద!

౬౩

సీ॥ శ్రీ మనోహర ! కరుణామృతసాగరా !
జయజయ ! రఘురామచంద్ర నీకు ;
పద్మాక్ష ! రఘువీర ! పాప సంహారకా ;
జయజయ ! శ్రీరామచంద్ర ! నీకు !
సీతాకరాంబుజాశ్లేషిత ! భుజయుగ్మ ;
జయజయ ! రఘునాథ ; జయము నీకు ;
సజ్జననుత ! చిత్రచారిత్ర ; నుతిపాత్ర ;
జయజయ ! రఘువరా ! జయము నీకు ;

గీ॥ శ్రీముఖాంభోజ భాస్కరా ; శ్రీవిలాస !
జయము ! రఘునాథ ! శ్రీరామ ! జయము ! జయము ;
జయము ! కోదండరామ ; దిగ్జయమునీకు ;
జయము లొసఁగి రక్షింపుమా ; సారసాక్ష ;

౬౪

సీ॥ శంఖంబు గదయును - చక్రంబుఁజేఁబట్టు
మాధవ ! జయజయ ! మంగళములు ;
దాసుల ప్రార్థితార్థముల నొసంగెడు
మంగళాత్మక ; జయ మంగళములు ;
త్రిభువన మయుఁడవై ; ప్రియమున భక్తుల
యంగరక్షక ; నీకు మంగళములు ;

ప్రాణిభావజ్ఞ విద్వాంసుండ వై నట్టి!
మహిమోన్నత విశాల - మంగళములు!

గీ॥ శ్రేష్ఠుఁడవు, యోగ్యుఁడవు, రక్షింప గాన
శరణు జొచ్చితి నిన్ను, విచార ముడిపి
మానసానందము, నొసంగి - మమతతోడ
రక్షసేయుము; శ్రీరామ రామచంద్ర!

౯౯

గీ॥ వేదవేద్యుఁడై న - యాదిదేవుండె, తాఁ
దనయుఁడగుచు వెలసె - దశరథునకు
అతఁడు పుట్టినంత - నావేద చయము, రా
మాయణంబనంగ - మహినివెలసె.

౧౦౦

గీ॥ మనసు, సతము శ్రీరామసంస్మరణ మగ్న
మగుచు, "రామ"యంచొక సారి యన్నమాత్ర
మతని, యేక శతాన్వయ మందుకొనును
ముక్తిసంపద, దీనినమ్ముము; నిజమ్ము.

౧౦౧

గీ॥ 'రామ' శబ్దంబు ప్రథమాక్షరంబు 'రా' య
నుచుఁబలుక, పాపపుంజముల్ - నోటినుండి
వెడలు వేవేగ! మఱిలేదు 'భీతి' - 'మ' యను
యక్షరంబు, కవాటమై - రక్ష సలుప.

౧౦౨

సీ॥ ఆదికావ్యంబుగా - నలరారు చుండును
మహిమాన్వితంబు, రామాయణంబు
వాల్మీకి ఋషి, దీని వ్రాసె; దేవతలెల్ల
పూజించు చుందురీ - పుణ్యకథను
వేదాంత శాస్త్రార్థ - విద్వాంసు లనుదినం
బీరామ కథఁబఠి యించు చుందురి

కల్పక మునకు, నిక్కంబుగాఁ సాటియౌ
శ్రీరాముకథ విన్న వారి కెల్ల

గీ॥ ముక్తి సేకూరు; భక్తి, రాము కథనంబు
వ్రాసినను, భక్తిఁజదివిన - వారికెల్ల
నహము తొలఁగి విష్ణుస్థాన మబ్బుచుండు
సంశయము, బూనవలవదు - సత్యమిద్ది.

౧౦౩

గీ॥ సంస్కృతంబున, శంకరాచార్య వర్యు
లెలమి 'రామకర్ణామృత' మింపుమీఱ
శ్లోకముల వ్రాసి; రద్దాని లోకులకును
సులభముగఁదెల్ప వ్రాసితిఁ దెలుగు బాస

౧౦౪

గీ॥ మున్ను, చేకూరు వంశ మందున్న సిద్ధ
సుకవి మాన్యుండు తెలిగించె - సుకృత ఫణితి;
నేను గూడ యోపినమేఱ - దీని రచన
సల్పితిని రామ! నీ కథ జనను లెన్ని
విధములను, పాడుకొన్నను - వింతగలదె ?

౧౦౫

గీ॥ తెలుఁగువారికెల్లఁ దేటతెల్లము గాగ
తెలుఁగుబాస తీపి తెలియు నట్లు
రచన సలిపి నాడ "రామకర్ణామృత"
మాద రింపుడయ్య - ఆంధ్రులార !

౧౦౬

గీ॥ శ్రీరమాపతి నాకిచ్చి చిత్తశుద్ధి
కీలు బొమ్మగ నన్నుంచి, కేవలముగ
మొదటి, యాశ్వాసము, ముగించె - మోదమలర
ప్రాంజలి, నొనర్తు; శ్రీరామ భద్రునకును.

౧౦౩

గీ॥ కావ్యమండలి, సుగుణ విఖ్యాతి నీది ।
అవగుణముల, దోసం బపఖ్యాతి నాది ।
యంచు, శ్రీరామ । నే విన్నవించు కొందు
విసమొ - యమృతమొ - రామ! సేవింపు మభవ ।

౧౦౪

సీ॥ వసుమతి గాశ్యపావత్సార, నైధ్రువ
శ్యార్షేయమై, కీర్తి నందుకొన్న
ప్రవరాన్వితము; కాశ్యపసగోత్రి, మాశ్వలా
యన సూత్రిమందుపై - నధ్యయనము
ఋక్శాఖ; మా తండ్రి కృష్ణార్యుఁడవిరళ
విష్ణు సేవామృత తృష్ణ గలఁడు
మధ్వమతస్థుండు - మధువైరి నిత్యంబు
పూజించు భక్తుండు - పుణ్యశాలి

గీ॥ అతని భార్య, అశ్వత్థమ్మ - కామె కేము
ముగ్గురము, పుత్రకులము; సమ్మదముతోడ
జ్యేష్ఠుఁడ, నహోబలాహ్వయ శ్రీవిలాసుఁ
డను; కరుణతోడ శ్రీరామ! నను, దరింపు.

౧౦౫

మాలిని. అవనిజ ప్రియమూర్తీ! ఆర్య సన్మాన కీర్తీ ।
ప్రవిమల గుణరాశీ! పాప కాంతార కీలీ ।
దివిజ నుత చరిత్రా । ధీరకౌసల్యపుత్రా!
రవికుల గుణధామా! రమ్య శ్రీరామనామా ।

గద్యము.

ఇది, శ్రీమదఖిల కవిమిత్ర, వాగీశ్వరీ దయావిధేయ, శ్రీరామ
చంద్ర, చరణారవింద సంసేవిత, శ్రీ మత్కాశ్యపసగోత్ర
పవిత్ర, బడగనాటి గూహూరు అశ్వత్థమాంబా, కృష్ణార్య,
తనూభవ కవిభూషణ, కవితిలక, బిరుదాన్వయ
కల్లూరు, శ్రీ అహోబలరాయ ప్రణీతంబైన
ఆంధ్ర శ్రీరామ కర్ణామృత మను పద్య
కావ్యము ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

ఓం-తత్సత్.



# శ్రీ రామ కర్ణామృతము
# ద్వితీయాశ్వాసము



సీ॥ శ్రీవత్స చిహ్నంబుచేఁ బ్రకాశించెడి
శ్రీరామచంద్ర! సౌశీల్య సాంద్ర!
భాను వంశాబ్ధిలోఁ బ్రభవించి వెలుగొందు
కౌస్తుభ మణివీవు! కమల నయన!
లక్ష్మీకరంబులౌ, రత్నహారంబుల
వక్షస్థలము నందుఁ బడసినావు
హర, సురగణము, లత్యంత విధేయత
రత్న కిరీటముల్ రమ్యమైన ౧

గీ॥ నీచరణ పద్మముల నిడి, నెగడినారు;
ఇంద్ర నీల దేహచ్ఛాయ! ఇందిరా ర
మణ! జనక సుతాధిప! నా నమస్సు లివిగో!
రక్షణము, సేయుమయ్య! శ్రీరామచంద్ర!

సీ॥ శ్రీశంఖ చక్రముల్ చెలువుగా ధరియించి
ఆదిశేషుని, దేహమందుఁబండి
సీతతోఁగూడి, యాశ్రితులను రక్షించి
సింహాసనము, నధిష్ఠించి, కల్ప
వృక్షంబు భాతి, నిజ వేడ్కతో సేవించు
వారి కోర్కె లొసంగి, వారిజాక్ష!
శ్రీరంగ నాయకు శ్రీపాదపద్మముల్
మనమున ధ్యానించు మాననీయ! ౨

గీ॥ శ్రీశ! రఘువీర! శ్రీరామ! చిత్ప్రకాశ;
ఆర్త బాంధవ! శ్యామాంగ! హరి! ముకుంద!
నిన్ను సతతంబు ధ్యానించు నెమ్మనమున
నన్ను రక్షించి బ్రోవవే, సన్నుతాంగ!

సీ॥ అరుణాధరము మీఁది యానంద రేఖతో
పీతాంబరముతోడ వెలయు వాఁడు
'అ'క్షాంతవర్ణుఁడై - యవిసె పువ్వులకాంతి
గ్రక్కు- శరీరంబు గల్గు వాఁడు
అకలంకుడై, యమేయ స్వరూపుఁడయి, యా
ద్యుఁడయి, జగంబునఁ దోచువాడు
అంబుజాక్షుండయి, యఖిల లోకము మెచ్చు
గొప్ప సౌందర్యంబుఁగొన్నవాఁడు

గీ॥ వాఁడు, మా వాఁడు శ్రీరమా వల్లభుండు
రఘు కులేశుండు, హితుఁడు శ్రీరామచంద్ర
మూర్తి, శరణుఁజొచ్చిన వారి మోదమలర
బ్రోచు నాతని పదపద్మముల, భజింతు.

సీ॥ నవరత్న ఖచితమౌ - నవ్యధ్వజావళి
చే నలంకృతమయి చెలువు మీఱు
సౌధంబులోపల స్వర్ణాష్ట దళపద్మ
మొండు, విరాజిల్లు నొప్పుగల్గి
అయ్యష్టదళ పద్మ మందుండెడి, విమాన
మందు రాఘవుఁడు, ధాన్యాస మేరు
డతని వానరులు, దిక్పరులు కిన్నరులు - ల
క్ష్మణ, భరతాదులు క్షేమపరులును

గీ॥ మునిగణము లెల్ల సాకేత పురము నందు
భక్తితోఁగొల్చుచున్నారు ప్రాభవమున,

అట్టి శ్రీరాము సతతంబు నాశ్రయింతు
రక్తితోడుతఁ గైవల్య ముక్తికొఱకు, ౪

సీ॥ నీల మేఘశ్యామ! నిత్యస్మితానన!
కోటి మన్మథ తేజ! కువలయేశ!
కస్తూరి తిలకంబు, కర్ణకుండలములు,
కౌస్తుభమణి దాల్చి కౌతుకమున
కంబుగళము చెంత, కమనీయమై యొప్పు,
జ్ఞానముద్ర వహించి జాను మీఱ,
భూపుత్రితో, వాయు పుత్రునితో, లక్ష్మ
ణునితోడఁ గూడిన యినకులేశ

గీ॥ జ్ఞానతత్త్వంబు బోధించి శాంతిఁగూర్చి
భక్తగణముల రక్షించు పంకజాక్ష!
చారు సింహాసనము నందు, ధీరుఁడగుచు
వెలయు చున్నావు; శ్రీరామ! వినుతిసేతు, ౫

గీ॥ శంఖ, చక్ర కౌస్తుభమణి చారు హార
ములు, కిరీటంబు, భుజకీర్తులు, లలితముగ
గల్గి, శ్రీవత్స చిహ్నంబు గల్గి, వరద!
పట్టు పుట్టంబుఁ గట్టిన పంకజాక్ష
శుభము లొసఁగుము కుండల శోభితాంగ!
రామ! శ్రీరామ; రఘువీర! రామచంద్ర!

మంజరి: మొలనూలు గజ్జెలు మ్రోయుచు నుండ
ముంగురుల్ నుదుటను ముసరి వ్రేరాడ
నందెలు 'గల్లుగల్లు'నుచు శబ్దింప
మోకాళ్లపై మద్దు మచ్చటల్ మెఱయ
నడయాడు శిశురామ - నటనా ధురీణ!
మధుర వాక్య నిపుణ మాయాప్రవీణ
కమలలోచనుడ! దిగంబర! సతము
ప్రార్థింతు మనమున బాల శ్రీరామ! ౬

మంజరి: కల్పవృక్షము క్రింద, కమనీయ మైన
మణిపీఠమందున్న, మహనీయ తేజ!
ఆనంద కరుఁడైన, యమృతస్వరూప!
ఆది, విరాటు - మహాతేజ! నాద
బిందు కళాతీత! వీరాధివీర!
రఘువంశ తిలక! శ్రీరామ! సంపూర్ణ!
నా మనోజాడ్యంబు నశియించుకొఱకు
భక్తితోఁ బ్రార్థింతుఁ బ్రణతు లొసంగి. ౮

సీ॥ మాణిక్యములచేత మహితమై వెలుగొందు
శ్రీపాదుకలు గల్గు శ్రీ శుభాంగ!
బృందారకాళి, నీ సుందర చరణార
విందముల్ సేవించు చుందు రెపుడు
అంబుజచ్ఛత్రి రథాంగ ధ్వజంబులు
శంఖ, దంభోళి, పాశాంకుశములు
మత్స్య చిహ్నంబులు మాన్యమై యందుండు
బ్రహ్మేంద్ర, దేవాది, భక్త వరుల ౯

గీ॥ శీర్షపు, కిరీట కాంతులు శ్రీనివాస!
నీ చరణ యుగ్మముల యందు - నెగడు చుండ
వెలుఁగుచున్నావు; శ్రీరామ! వేదవేద్య!
స్తోత్రమొనరింతు నిన్ను, సుశ్లోక చరిత!

గీ॥ కల్గి పులిగోరు పతకంబు కంఠమందు
నుదుటఁ జేర్చుక్క యొక్క సంపదయు గల్గి
శ్రీదిగంబర మూర్తివై చెల్వుగాగ
నాట్యమొనరించు చున్న విజ్ఞానశాలి
బర్బరాలక శోభిత బాల రామ!
నీకు వందన మొనరింతు నిగమ వేద్య! ౧౦

గీ॥ ఉత్తమోత్తమ మైన యష్టోత్తర శత
పుణ్య తీర్థంబులందు నీ మూర్తి పూజ
కరము శోభించఁగా ; శతక్రతువు లందు
నింద్రుఁడును, బ్రహ్మ దేవత లెపుడు నిన్ను
భక్తి నర్చించు చున్నారు; భాను చంద్ర
మండల నివాస ! కొనుము నమస్సులివిగో ! ౧౧

మంజరి: ఇంద్రుని రథమెక్కి యేపారు శౌర్య
వీరప్రతాపముల్ వెలయగా, నారి
కర్ణాంతముగ లాగి, గాఢంబు గాగ
బ్రహ్మాస్త్రము దొడిగి, రణభూమి క[illegible]
మంది యల్లాడఁగా నామహేంద్రాది
దివిజులు స్తుతియింప తేజంబు - మీఱి
దశకంఠుఁద్రుంచిన - దశరథరామ !
రూక్షేక్షణంబుల, వీక్షింప రాని
తీక్ష్ణరూపము మాని తెలివొందు మయ్య;
నా నమస్కారంబు - నాథ! శ్రీరామ !
అర్పింతు గొనుమయ్య హరి! హృషీకేశ !
రక్షింపు మాధవా! రామ ! ముకుంద ! ౧౨

మంజరి: నీల మేఘంబుల - మేలిమి శోభ
నీలోత్పలంబుల - నిగనిగ లింద్ర
నీలాల కాంతులు - నీ శరీరంపు
కాంతికి సాటియే ? కమనీయగాత్ర !
సీతతోఁగూడిన శ్రీరామ చంద్ర !
దానవ మర్దనా ! దశరథరామ !
ఇంద్ర రక్షణము నం దేపారుశ్రద్ధ
వరలిన వాఁడవు; భజియింతు నిన్ను. ౧౩

సీ॥ పూర్ణచంద్రుని వంటి మోము గలిగినవాఁడు
ముక్కంటి కిష్టుఁడై మెలఁగు వాఁడు
స్ఫుట, పటు, ప్రఖ్యాత భూరి బాణమువాఁడు
రావణు బొరిగొన్న ప్రణుత యశుఁడు
రత్న విరాజిత రమణీయ చరణుండు,
వితరణ జితకల్ప వృక్ష శతుఁడు
లక్ష్మీకి ప్రియమైన లలిత రూపమువాఁడు,
ద్వేష రాగంబుల విడిన వాఁడు

గీ॥ ప్రజలకెల్ల సులభ వశ్యుఁడై యున్నాడు
భవము బాపు నట్టి బాంధవుండు
నీరజాక్షుఁడతఁడు తారక నామండు
అతని భజన సేతు ననుదినంబు. ౧౪

సీ॥ షట్చక్రమున, నివాసంబుగల్గి, 'అ' కార
మాది, 'క్ష' కార పర్యంతమ క్ష
ర, స్వరూపుండయి, రత్నకుండలముల
ధరియించి, చిఱునవ్వు దొండవింప
నానంద మూలమై, యాపదలను గ్రీష్మ
తాపంబుతోఁ బరితాప - మొందు
ప్రజలకు మేఘుఁడై, బాధలఁ బోకార్చి
దయకు, సముద్రుఁడై తాపమార్చి

గీ॥ భక్త గణమునెల్ల పరిరక్షఁజేసెడి
రామ చంద్ర! వరద! రాఘవేశ!
ధర్మహృదయ! శ్రీశ! తారకనామ! నే
భజన సేతు నిన్ను భక్తి తోడ. ౧౫

సీ॥ శ్రీ యయోధ్యకు మధ్యఁ జెలఁగు మంటపమందు
గొప్పగా మణిపీఠ మొప్పు చుండు,

పీఠమధ్యంబున విలసిల్లు 'పద్మ క
        ర్ణిక' యష్ట దళముల నెగడియుండు
'పద్మకర్ణిక' యందు భద్రాసనంబున
        శ్రీరామ భద్రుండు చెలఁగియుండు
నిజ సోదరులు, నాంజనేయుండు సుగ్రీవుఁ
        డతి భక్తిఁగొల్వగా నలరి యుండు

గీ॥ పాణిపద్మమందు, 'జ్ఞానముద్ర' గలిగి
బోధసేయు నట్టి పుణ్యమూర్తి
తత్వవేత్త బుధుఁడు తారకనాముండు
నను తరింపఁజేయు ననుదినంబు. ౧౩

గీ॥ కుండల, కిరీట, కౌస్తుభ మండితుండు
తులసి మాలలును, భుజకీర్తులను గల్గి
పసిడి పుట్టంబు ధరియించి వరలు వాఁడు
రామచంద్రుండు మము సదా రక్షసేయు. ౧౪

సీ॥ అరయ, మూలాధార మాదిగాగల యారు
        పద్మంబులకు పైనఁబరగియుండు
నద్రంబుగాగ, సహస్రారపద్మంబు
        దాని మధ్యంబున స్థాన మొంది
సంసారపాశముల్ నశయింపఁ జేయుచు
        రాజిల్లుచుండు శ్రీరామ మూర్తి
ప్రణవనాదాంత, చంద్రగళితామృతసిక్త
        రూపంబుఁ గొన్న సుశ్లోక మూర్తి

గీ॥ నాదనాదంబులో నుండు నాదమహిమ
కిలను, స్థానమైయుండు, మహీసుతాధి
నాథు, శ్రీనాథు, శ్రీరఘునాథు. నీ - య
నాథు రక్షింపఁ బ్రార్థింతు నతులొనర్చి. ౧౫

గీ॥ బ్రహ్మ యొసఁగిన వరగర్వబలముచేత
మన్ను మిన్నుఁగానక, యవమాన మైన
పనుల నొనరించు రావణవంశ గిరిని
తలఁబగులఁగొట్టు వజ్రాయుధంబ నీవు। ౭౯

గీ॥ రామ। తమ్ములు, దిక్పతుల్, నేమముగను
రావణానుజ వాయుజ ప్రముఖు లెపుడు
సేవ సల్పుచు నుందురి; సుగ్రీవసహిత!
శ్రీరమాలోల। వరద! రక్షింపు రామ। ౮౯ (అ)

సీ॥ అజ్ఞానమనెడి, గాఢాంధ కారమునకు
సూర్య స్వరూపుఁడౌ సుందరాంగ।
వనధి మధ్యమునందు వటపత్ర శాయివి
సీతామనోహరా చిత్ప్రకాశ।
ఆది మధ్యాంతమ్ము లరయ లేవయ్య - నీ
కానతి; జనకామితార్థకల్ప।
అఖిల జీవంబుల కాది బీజమ వీవు
వన్ని కార్యంబుల కాస్పదుఁడవు ౨౦

గీ॥ మతియు, బుద్ధివీవు! వితత శక్తియు నీవు
కవిత వీవు! వ్రాయు కవివి నీవు!
వ్రజ్ఞ వీవు! పనులఁబట్టుదలయు నీవు!
రామ నిన్నుఁదలఁచు రచన కొఱకు.

మంజరి: అమృతాబ్ధిఁదెలిదీవి యలరుచు నుండు
నందు, శోభించును, చందన పారి
జాతముల్. కల్పవృక్షంబులు రెండు
గొప్ప పీఠంబొండు గొమరారు నచట
పన్నగ తల్పంబు చెన్నారు; దాని
మధ్యనో, జానకీ మహిళా మనోహ

రుండు, వెల్గొందు; నారాధమౌ భక్తి
నతని జింతింతు నే ననవరతంబు. ౨౧

సీ॥ చిఱునవ్వు మోము నంజిందులాడెడి వాఁడు
రమణీయ పద్మనేత్రముల వాఁడు
నీలంపుమణుల, మించిన శరీరము వాఁడు
శరచాపములతోడ వరలువాఁడు
సూర్య వంశాబ్ధిలో, సొబగు కౌస్తుభమణి
కరణిఁబ్రకాశించి గ్రాలువాఁడు
డంబుగా మెఱయు, జటా కిరీటంబుల
నానందమూర్తియై యలరు వాఁడు ౨౨

గీ॥ వాఁడు మావాఁడు శ్రీరామ వల్లభుండు
చందనము మేనఁబూసిన యందగాడు
నిత్య సంతోషమూర్తియై నెగడువాఁడు
నన్ను రక్షించు గాత! ప్రసన్నుఁడగుచు

సీ॥ పుష్పబాణంబుచేఁ బొలుపొందు, చెఱకు వి
ల్లును, రెండు చేతులలో ధరించి
శంఖచక్రములు పాశంబంకుశము పంశ
నాళంబుఁదక్కిన నాల్గు, రెండు
కరముల పరుసగా ధరియించి, సూర్యుని
రంగుతో, శోభిల్లి రామ! సిపు
శ్రీకృష్ణరూపుఁడై - చెన్నారు చుందుపు
నీలమేఘశ్యామ! నీరజాక్ష! ౨౩

గీ॥ రామచంద్ర! దయాకర! రాఘవేశ!
నిన్ను భజియింతు స్తుతియింతు నన్నుఁబ్రోంగ
నామనోదుఃఖములబాపి నవ్య శుభము
లందఁజేయుము; శ్రీశ! ముకుంద; వరద!

సీ॥ పెక్కు పాదములతో - పెక్కు తొడల తోడ
పెక్కు కడుపులతోడ - విశ్వరూప!
బహు ముఖంబులతోడ - బహు బాహువులతోడ
బహు నేత్రములతోడ - పంకజాక్ష!
పెక్కు శీర్షములతో - పెక్కు చేతులతోడ
పెక్కు నోరులతోడ - భీమరూప;
బహు దేవతలతోడ - బహు సర్పములతోడ
తీక్ష్ణాగ్నివలె వెల్గు - దివ్యరూప!

గీ॥ కోటి సూర్యుల మించెడి మేటి వాఁడ!
పూల హారముల్, గంధంపు పూత లొడల
గల్గిన, యనంత వీర్యుఁడౌ కమల నయన!
విశ్వరూప! శ్రీరామ! నీకు వినుతి సేతు. ౨౪-౨౫

మంజరి: కోదండ బాణముల్ కొమరొప్పఁబట్టి
గదయు, శంఖముగల్గి, కడు భయంకరము
లగు, కోరలను జూపి, యగ్నులఁగక్కు
నాననంబుల నొప్పు, నంబుజ నయన!
పచ్చని పుట్టంబు, పైడి కిరీట
మును, కుండలంబులఁ బొలుపారఁదాల్చి
విశ్వరూపమునూని వెలుగొందు రామ!
భజియింతు నిను సదా భక్తిభావమున. ౨౬

గీ॥ స్మరుని పంచ బాణంబులు, చాప మంకు
శంబు, శంఖంబు చక్రపాశములు, వేణు
దండ మెన్మిది చేతులఁదాల్చి సూత్న
మణుల కాంతిని గల్గి, రణ వినోది
యగుచుఁ బ్రద్యుమ్నుఁడై, నల్ల నయ్యాయైన
రామ చంద్రుని భజియింతు రక్తితోడ. ౨౭

సీ॥ సీతఁగాంచుట యందు ప్రీతి వహించెడి
నీలమణి శరీర! నిగమ వినుత!
ఎడమ మోకాలిపై నిడిన హస్తముగల్గి
వీరాసనము బూని వెలయురామ!
కల్పవృక్షముక్రింద, కమలాసనుడు, సప్త
ఋషులు, నిన్ భజియించి మ్రొక్కుచుండ
ముత్యాల హారంబు - ముద్దు కిరీటంబు
కుండలంబుల దాల్చి కోవిదుండ

గీ॥ వగుచు, బోధముద్ర ధరించి, యాప్తభక్త
వరులకెల్లను జ్ఞానతత్త్వంబు దెలిపి
హర్ష వారిధి దేల్చు పట్టాభిరామ!
సేవ సలిపెద రక్షింపు శ్రీ శుభాంగ! ౨౮

గీ॥ మునుల కెవ్వని మూర్తి సమ్ముదమొసంగు
నెవని బాణము దితిజాళి యేపడంచు?
నెపడు నరలోక హృద్వీథి నెసగుచుండు?
నట్టి సర్వస్వ రూపుఁడౌ నమల చరితు
శ్రీ శుభాంగుని రఘురాము సేవఁజేతు. ౨౯

సీ॥ వేదాంతముల యందు - వెలుగు చున్నావీవు
ఓంకార వాచ్యుఁడై యొప్పు దీవు!
నాదప్రియుండయి - మోదమందెద వీవు!
ఆకార రహితుఁడై యలరె దీవు!
వేదాంబుజ మరంద మాదరంబున గ్రోలి
మత్తిల్లు చున్నట్టి మధుప మీవు!
క్రొత్త మేఘపు నీల ఛుచులతో శోభిల్లు
దేహ కాంతులు గల్గు దివ్యుఁడీవు!

గీ॥ నామములు, బెక్కులుండియు, నామ రహితుఁ
డగుచు, నంతరాత్ముండయి, యలరు దీవు!

ఆశ్రితుల రక్ష సలిపెడి యభయ మూర్తి
శ్రీశ! తారకరామ! రక్షింపు దేవ! ౯

సీ॥ అఖిల భూత హృదబ్జమందు వెలెగెడివాఁడు
ఉజ్వల నాముఁడై యొప్పువాఁడు
ముల్లోకవాసుల - కెల్ల నభీష్టమౌ
ముద్దు నామముతోడ మురిసెయు వాఁడు
అమల, నారాయణాష్టాక్షరమంత్ర స్వ
రూపుఁడై జగములఁ బ్రోచువాఁడు
నాద చంద్రామృతామోదాభిషేకంబు
...నిర్మలుఁడయి చెలఁగువాఁడు

గీ॥ ఆత్మలందుఁ జిన్మాత్రుఁడై యలరువాఁడు
కోటి భాస్కర తేజుఁడై కొమరు మీఱు
ముద్దు తారక రాముండు; ముదము తోడ
సతవిఁ బ్రార్థించి సేవింతు ననుదినంబు. ౧౦

సీ॥ ఖశ్యాముఁడై నావు - ఖరరిపుండై నావు
ఖగవాహనుండయి గాంచినావు
ఖాతీతుఁడై నావు - ఖావాచ్యుఁడై నావు
ఖగ కేతనుండయి గ్రాలినావు
ఖర్వాట పర్వతాగ్రమునందు నివసించి
ఖారాధ్యుఁడై నీవు గ్రాలినావు
ఖాద్యాది భూతాత్మకంబయినావు; శ్రీ
తారక నాముడై దనరి నావు

గీ॥ శ్రీ మనః పీఠమందు వసించినావు
వరదుఁడై, ఖగమంత్ర తత్పరులఁ బ్రోచి
నావు; కోటి విద్యుత్కాంతితో వెలసిత
వమల తారకరామ! నిన్నాశ్రయింతు. ౧౧

సీ॥ వేదార్థ చతురుఁడై వెలసిన బ్రహ్మకు
జనకుఁడై వెలసిన - సత్యచరిత ;
వేదాంత రూపుఁడై - వేద్యుఁడై వెలసిన
శశ్వత్ప్రకాశుఁడౌ చారుశీల ;
వేద శృంగంబుల వితతిని బోలెడి
శేషుని ఫణులపై చిత్రరూప ;
శయనించి. వేదనిర్ణయమైన - ఋక్మంత్ర
పూజిత చరణముల్ బొందినావు

గీ॥ జ్ఞానులకు వేద్యుఁడవు నీవు మౌని వినుత ;
వేదమహిమ కాధారమై వెలయుదీవు ;
తారకుండైన శ్రీరామ ; ధర్మహృదయ ;
భజన సల్పెద, రక్షింపు పరమ పురుష ; 33

సీ॥ లావణ్యమైన 'మూలాధార' చక్రంపు
జ్వాలలచే, సహస్రార చక్ర
మండలి, శశిబింబ మందంబుగాఁజుట్ట
బడియున్నదా మధ్య పంకజాక్షుఁ
డైన - శ్రీరఘురామ ; హాయిగా నున్నావు;
దేవతల్ వానరుల్ దివిరి కొలువ
అమృతాభిషేకప్రి - యా ; నరేశులు నిన్ను
సేవించు చున్నారు చిత్తశుద్ధి

గీ॥ సుత్యములచెప శ్లోకిల్లు సుద్దు శిఖలు
గలుగు మౌనులు నీ పూజ సలుపు చుంద్రు ;
రమ్యగుణధామ శ్రీరామ సౌమ్యనామ ;
భజన సల్పెద రక్షింపు పరమ పురుష ;

సీ॥ నక్షత్రముల పంటి - నవ్యవిమాన, మ
ధ్యమునందు నున్నావు తత్త్వవేత్త ;

ప్రకృతి, ఈశ్వరుఁడు, జీవస్మూర్తి - ఈతత్త్వ
ములఁ బూజ లందెడు ముద్దుమూర్తి
యోగ నిర్గుణులయి - యొప్పెడి సిద్ధుల
పూజలఁ గొందువో పుణ్యమూర్తి!
ముక్కంటి సఖుఁడవయి - భ్రూమధ్య భాగంబు
నందున్నయట్టి - యానంద మూర్తి!

గీ॥ వరమణి కిరీట కుండల భాసమానుఁ
డగుచు, సీతాసమేతుఁడై - హాయి గాగ
నిత్య సంతోష వార్ధిలో నెగడుచుండు
రామ తారకమూర్తిఁ బ్రార్థన మొనర్తు. ౩౫

సీ॥ ముల్లోక వాసులు - ముగ్ధులైనారు; బ్ర
హ్మజ్ఞాన మహిమచే హరి! ముకుంద!
నక్షత్ర రాశిపై - నటియించు, ధ్రువమండ
లమునఁ బద్మమునందు రాజితముగ
శోభించు శ్రీరామ! శుభకరనామ! తా
రకరామ! రఘుపతీ! రామభద్ర!
'తత్త్వమసి' యను మంత్రంబును భక్తుల
కుపదేశ మొసగెఁడు నిపుణ చరిత!

గీ॥ డంబుగాగ, ముత్యాల పీఠంబునందు
మధ్యమున నుండి, విద్యుత్ సమానమైన
దేహకాంతి శోభిల్లు, వైదేహినాథ!
రామ తారకనామ! నా ప్రణుతి గొనుము. ౩౬

సీ॥ కస్తూరి, కుంకుమ, కర్పూర గంధముల్
మైపూతఁ గాఁగల మధుర మూర్తి
కాకుస్థవంశ విఖ్యాతుఁడై, నీలమే
ఘశ్యాముఁడై, యొప్పు కమలమూర్తి

పీతాంబరము గట్టి - సీతామహాలక్ష్మి
సేవింపగా వెల్గు ! సిద్ధమూర్తి
మఃక్కాంటి కిష్టుఁడై - ముద్దు మన్మథు మించు
సుందరుఁడైనట్టి సుగుణ మూర్తి

గీ॥ ముద్ద మంగళమూర్తి. సమ్మోహమూర్తి
శాస్త్ర విశ్వాసమున గొన్న చారుమూర్తి,
రామమూర్తిని ధ్యానింతు రక్తితోడ
నా మనోదుఃఖముల బాపి సేమ మొసఁగ ౩౩

సీ॥ నా తండ్రి, నానిధి - నా పుణ్య రూపుండు
నా తపస్సిద్ధియు ! నాదు గురువు
నా ప్రాణ మాయువు, నా ధ్యాన రూపుండు
నా పరమాత్మయు, నా సమస్త
కర్మల పుణ్యంబు, కారుణ్య వార్ధి, నా
బహు బంధు రూపుండు ! ప్రాణములకు
నాధార భూతుండు నై, యనుగ్రహము, నా
యందుఁజూపెడి, పరమాత్ముఁడరయ

గీ॥ నాదు నేలిక, నా సౌఖ్య మాదరమునఁ
గోరు సన్మిత్రుఁడాతండు, కువలయేశుఁ
డతఁడు తారక రాముండు ; సతత మతని
సేవ సలిపెద, నా తపస్సిద్ధి కొఱకు. ౩౪

సీ॥ సర్వస్వరూపుఁడై - సత్యుఁడై, నిత్యుఁడై
నిర్మలుండయి సదా నెగడు నెవడు?
సూక్ష్మరూపుండయి - శుద్ధుఁడై, యుపమాన
రహితుఁడై, జ్ఞానియై గ్రాలునెవఁడు ?
పద్మాక్షుఁడై, పుణ్యపాప శూన్యుండయి
శ్యామదేహుండయి - యలరునెవఁడు ?

'నీవు - నేనను' భేద - నియతి లేనట్టిదై
బహు గుణంబుల తోడ వరలునెవఁడు ?

గీ॥ అతఁడు తారకరాముండు - సతత మతని
మదిని స్మరియించి సేవించు మనుజులకును
పాప పుంజంబు దొలఁగి కైవల్యమబ్బు।
మనస ! శ్రీరాము స్మరియింపు మనుదినంబు. ౩౯

సీ॥ శ్రీ వత్స వక్షుఁడై శ్రేష్ఠమహిమ కెల్ల
నాథాంశుఁడై, యఖిల జగము
మోహింపఁజేసియు, మందమున, శంఖ-చ
క్ర, గదాబ్జముల బూని, జ్ఞానసీవుఁ
డగుచు, శ్రీ రఘువంశమను, మహావార్ధికి
సోముఁడై, విమల కౌస్తుభము దాల్చి
పీతాంబరము గట్టి, సీతాసతీ మనో
నాథుఁడై, శ్రీరామ ! నవ్యశోభ

గీ॥ నలరుదీవు ! పరమహంస రూపుఁడగుచుఁ
బురుష రత్నమగుచుఁ బొలిచె దీవు !
నీలమణుల రుచుల నెగడు దేహముగల్గు
రామ ! నిన్నుఁదలఁతు రక్షకొఱకు. ౪౦

సీ॥ అచ్యుతుండాది మధ్యాంత రహితుఁడప్ర
మేయుండు, పూర్ణుండు - శ్రీయుతుండు
కూటస్థ రూపుండు - కోటి మన్మథ తేజుఁ
డాజాను బాహుండు - రాజమనుడు
జ్ఞానరూపుండు, నాశనము లేని మనుజుఁ
డఖిల దిశల నిండి యాడువాఁడు
చావు పుట్టుకలేక - సత్యస్వరూపుఁడై
మోక్ష సౌఖ్యమొసంగు - ముఖ్యుఁడఖిల

గీ॥ వస్తువులకు సాక్షి యగుచు - వఱలువాడు
శ్రీవిరాట్స్వరూపుండు, ప్రసిద్ధ వ్యక్తి
పూర్వికుడు, దోష రహితుండు - పుణ్యమూర్తి
ప్రార్థన మొనర్తు ; తారక రామమూర్తి. ౪౧

సీ॥ పూర్ణ చంద్రుని వంటి - ముద్దుమోము గలాఁడు
పల్లవాధరుఁడయి - బరగువాఁడు
రాధ హృదయమందు - రంజిల్లు శుభగుఁడు
సూర్య సమానుండు - సుందరుండు
ద్వైత వంశంబును - ధ్వంసంబొనర్చిన
శ్రీరఘూనాథుండు - చిన్మయుండు
రఘువంశ వర్ధనుం డఘము బాపెడివాడు
హృదయ కుండలి యందు - మెదలు వాడు

ఆ॥ శేషశాయి నాదు చిత్తవీధి మెలంగి
పాప బుద్ధిఁబాపి - భవ్య సుగుణ
తతి నొసంగుగాత ! తారక రాముని
సేవ సతమొనర్తు - చిత్తశుద్ధి. ౪౨

సీ॥ నిఖిల నిలయుఁడైన - నిగమ గోచరుఁడీవు ।
ఆకాశ రూపుడై - యలరుదీవు !
సగుణ, నిర్గుణుఁడైన - సరస రూపుండీవు ।
అంగుష్ఠ రూపుఁడై - యలరుదీవు ।
ఆకాశ రంధ్ర మధ్యమమందు నివసించి
మోక్ష శోభనుగల్గి - మురిసెదీవు ।
సత్త్వ, రజస్తమోతత్త్వ శూన్యుండీవు
తరియింపఁజేసెడి తజ్ఞుఁడీవు

గీ॥ తత్త్వమస్యాది లక్ష్యుఁడై - దనరె దీవు ।
శ్రీసుషుమ్న, నాడిని చేరి - వెలఁగుదీవు ।

రామ ! తారకనామ ! నిన్నేమముగను
ప్రార్థనము సేతు; రక్షింపు - భక్తవరద ! ౪౩

సీ॥ మునుల, మనుజులకు - ముదము సేకూర్చుచు
ముక్తికారణుఁడైన - శక్తివీవె !
స్థాయివై, కూటస్థ చైతన్య రూపుఁడై
సకల పరదుఁడైన సాక్షివీవె !
నాదాంత తత్త్వాత్ముఁడై, దాశరథియు నై
కమల నిలయుఁడైన జ్ఞానివీవె !
ప్రకృతి శూన్యుఁడగుచుఁ బ్రకృతి మాన్యుఁడగుచు
సంతోషమును జెందు నరసుఁడీవె !

గీ॥ పరగ నోంకార ధ్వనియొక్క బ్రహ్మమీవె !
శ్రీ సహస్రార పద్మంబు జెంది, యందు
స్థానమును గొన్న శ్రీ రామ చంద్రుఁడీవె !
భక్తి నీసేవ లొనరింతు పరమ పురుష ! ౪

సీ॥ తనదు యానందంబె తానుగా నున్నాడు
శివుఁడు, బూజింపఁబ్రసిద్ధి నుండు
పరమ పదము బొంది పావనుడైనాడు
ప్రకృతి శూన్యుండయి వఱలుచుండు
దయకు సముద్రుఁడై, తా నిర్గుణుండయి
పరమ పురుషుఁడౌచుఁ బరగుచుండు.
రక్తితోడుత, సహస్రార పద్మము నందు
నివసించి, సంతోష నియతి నుండు

గీ॥ శ్యామల శరీరుఁడవ్యయ చరితుఁడూర్జి
తుఁడు, పరబ్రహ్మరూపంబుతో, రమించ
దగిన శ్రీరాము సతతంబు ధ్యాన నిష్ఠ
బ్రార్థన మొనర్చి సేవింతుఁబరమ భక్తి. ౪౫

సీ॥ వైకుంఠ లోకాధిపతివీవు ; దేవతల్
మునులు. నీపాదముల్, మ్రొక్కుచుండ
వారి కిరీట యుజ్జ్వల కాంతి, నీ స్వర్ణ
పాద పీఠంబును ప్రభలుగొలుప
నిండు చంద్రునివంటి నెమ్మోముతో నొప్పి
మాణిక్య మకుటంబు, మాన్యమైన
శ్రీధనుర్బాణముల్ జెలువార ధరియించి
ఓంకార పీఠమం దొప్పుగాగ

గీ॥ నధివసించి జానకితోడ, నాశ్రయించు
వారి పాపముల్ హరియించి, వరము లొసగు
రామ చంద్ర! ధ్యానింతును - భక్తితోడ
భక్తమందార ; రక్షింపు పరమ పురుష! ౪౬

సీ॥ సాకేత పురములో చారు రత్న వినిర్మి
తంబు, మంటప మొందు దనరు చుండు;
శిల్పకి మచ్చట కలదు; విమానంబు
మధ్య, అష్టదళపద్మము వెలుంగు;
నందు వన్నియకెక్కు సుందర సౌధంబు
వెలయు; సుగ్రీవ విభీషణాంజ
నేయులు, దమ్ములు నియతితో సేవింప
వారి మధ్యను నీవు వఱలి నావు

గీ॥ ఇంద్ర నీల కోమలగాత్ర ; ఇన కులేశ !
రామ ! రఘువంశ తిలక ! సీతామనోహ
రా ! మనసునందుఁ బ్రార్థింతు రామచంద్ర ;
వరద ; తారక రామ ; కాపాడు మధవ ; ౪౭

సీ॥ వేదశాస్త్రములచే - వెదకిన దొరకవు
వేద నియమముల లభింతు వీవు ;

హృదయ కుహరమందు - ముదమున వసియించు
'తత్'మంత్రసారమై - దనరెదీవు!
హరి, హర, విధివంద్య! హంస మంత్రాంతర
మందు, వసించెడి సుందరాంగ!
వక్షస్థలమునందు భాగ్యలక్ష్మి వసింప
దశరథ పుత్రుడై - దనరె దీవు!

గీ॥ దీనులనుబ్రోచు శ్రీరామ - దేవ దేవ!
నన్ను రక్షింపుమా! కరుణాసముద్ర!
భవ్య నీ పాదపద్మముల్ - భక్తితోడ
గొలిచి సేవింతు సతము - ముకుంద వరద! ౪౨

సీ॥ పూర్ణచంద్రుని వంటి ముద్దుమోము గలాడు
సీతాసమేతుడై వెలుగువాడు
శరచాప హస్తుడై, సౌందర్యమూర్తియై
శరణన్నబ్రోచెడు కరుణగలడు
నవ మేఘములబోలు నవ్య దేహము వాడు
కలువరేకుల వంటి కనులవాడు
లలిత శుభ గుణుండు లక్ష్మణు ననయంబు
దనకడజేకొని తనరు వాడు

గీ॥ ఇంద్ర నీలరుచి, జయించిన తనుకాంతి
తోడ, సొబగు లీనువాడు; రామ
చంద్రమూర్తి నన్ను సతతంబు రక్షింప
బ్రార్థనం బొనర్తు భక్తితోడ. ౪౩

సీ॥ "ఓంకార"మే నీకు నొప్పు బీజాక్షర
మై, రామచంద్ర! సత్వగుణ సాంద్ర!
"ఓం! భూర్భువస్సువః ఓంతత్" నెడుశబ్ద
ముల చేత నిండిన మోహనాంగ!

ఓషధత్రియముచేత రాఘవా ! నీవెప్పు
డారాధనముఁబొంది యలరినావు !
ఓంకార ప్రకృతిపై, ఓంకార కందాంకు
రంబపై యున్నావు రామచంద్ర !

గీ॥ శ్రీ షడక్షర మంత్రంబు భూషణంబు
నీకు; సర్వోపగతుఁడవై నెగడు కమల
నాథ ! "ఓంకార" సింహాసనంబు స్థాన
మాయె నీకు శ్రీరామ ! జోహారుఁగొనుము.

సీ॥ సాకేతపురములో - శ్రీకల్పవృక్ష వా
టికయందు మేడలో తీవి మెఱయ,
'అ' మొదల్ 'క్షం'త వర్ణాబ్జ మధ్యము నందు
సింహాసనము మీద చెలువుగాగ
ఓంకార పద్మంబు నొప్పి యుండగ, నందు
శ్రీరామచంద్ర ! యాసీనుఁడగుచు
వ్యాసాంబరీషాదు లాది మునీశ్వరు
లఖిల దేవతలు నీ యండఁజేరి

గీ॥ స్తోత్ర మొనరింప, వారి సంస్తుతుల వలన
మెచ్చి వరముల నొసఁగెడి సచ్చరిత్ర !
రామ ! తారకనామ ! శ్రీరామ చంద్ర !
భజన సల్పెదఁ బ్రోవుమా భయము బాపి ౫౧

సీ॥ జానకీ కుచచర్చ చందన కుంకుమ
చిహ్నముల్ గలిగిన శ్రీ శుభాంగ !
కోదండ విద్యలో గురుపీఠము వహించి
యాది మూలంబైన యజ్ఞనేత్రి !
సద్గుణంబుల కెల్ల స్థావరంబైనట్టి
శ్రీపరాత్పరుఁడైన చిత్సరికాళ !

అఖిల జనంబుల యంతరంగము నందు
వెలుగుచు నున్నట్టి వేదవేద్య !

గీ॥ అనుఁగుఁదమ్ముఁడు లక్ష్మణుం డనవరతము
నిన్ను వెంబడి సేవింప సన్నుతాంగ !
ముదము తోడ నున్నాడవు ముద్దుమూర్తి !
శరణు వేడెద శ్రీరామ ! సత్యపాల ! ౫౨

సీ॥ శ్రీధామమైన, మూలాధార చక్రంబు
నందు, హుతవహాను దధివసించు;
నందుండెడి, త్రికోణ యంత్రంబు నఁజ కుండ
లీ రూపముగ, జానకీరమణుఁడు
హాయిగాఁదాసుషుప్త్యవస్థ నుండి, శ్రీ
పాశాంకుశములతోఁ బరగుచుండు,
భూతంబులకు నెల్ల ముఖ్యాశ్రియంబౌచు
నాదిమ పురుషుఁడై యలరు చుండు

గీ॥ నభయ హస్తముల్ గల్గి, బాలార్క తేజుఁ
డై, భవరహితుఁడై, పుణ్యుడై, వెలుంగు
చుండు, వాసాంత వర్ణాశ్రయుండు, రామ
చంద్రుఁ డాతని సేవింతు సంతతంబు. ౫౩

సీ॥ ధీవృద్ధిఁజేయు స్వాధిష్ఠాన చక్రంబు
నందు, 'బాలాంత' వర్ణాశ్రయంబ
పగుచుఁజెల్వారు బ్రహ్మ గ్రంథిచే, నున్న
తంబయి నట్టి, హస్తంబు నందు
కుండిక మాలికఁజ గొమరొప్పగా దాల్చి
రత్న పీఠంబున రమణనెగడి
సాధు వాక్యములతో. సాత్త్వక తత్త్వబో
ధనలతో, భక్తుల దన్పిఁగొల్పి

గీ॥ అభయ మొసఁగి దివ్య శుభములఁజేకూర్చు
రామభద్ర ! వరద ! ప్రణుతిఁజేతు
ధరణి భక్తతతికిఁ దారకరాముండ
వీవు ! శరణుగొంటిఁ బ్రోవుమయ్య ! ౫౪

సీ॥ పదిరేకు లొప్పిన - పంకజం బొక్కటి
శ్రీవిష్ణు గ్రంథియై - చెలువొసంగు
'ద'కారము మొదలు - 'పా'కారపర్యంత
మక్షరరూపమై - యలరు నట్టి
చక్రంబునఁ నీవు - శంఖ చక్రములతో
సూర్యుని కాంతితో - సొబగు మీఱి
పీతాంబరము దాల్చి - ప్రియమైన కౌస్తుభ
మణిబూని, సీతా రమణిని గూడి

గీ॥ వాస మొనరించు చున్నావు ! వరద ! రామ
భద్ర ! తారక నాముఁడై - భక్తతతికి
వరము లొసఁగెద వీవు ! సర్వస్వరూప !
నిన్ను సేవింతు; రక్షింపు - నిగము చరిత ! ౫౫

సీ॥ 'కాతాంత'వర్ణముల్ - కమలాక్ష ! నీ రూప
మై, యొప్పుచుందు; మహాత్మ ! సూర్య
రూపుండవై, హంస - రూపుండవై, దివ్య
భవుని రూపంబవై, భవ్యమైన
మోక్ష లక్ష్మినికూడి - భూరి ధనుర్విద్య
గురుఁడవై, శ్రీరామ ! పరగి నావు;
ఓంకార మధ్యమందుజ్జ్వలంబుగఁ బ్రకా
శించి, తారకనామ ! చెలగినావు;

గీ॥ ప్రాణ వాయువు లందొప్పి - పరగినావు.
ప్రళయ సూర్యులతో సాటి వచ్చు నట్టి

రూపమును దాల్చినావు; నీ కోప మడచి
భక్తజనుల రక్షింపుము పరమ పురుష। ౨౬

సీ॥ జీవాత్మ కనయంబు శ్రీకర స్థానమై
షోడశ దళపద్మ శోభితుఁడయి
రక్తి మీఁఱంగ, రుద్రగ్రంథి రూపమై
యమృతంబు వర్షించ జల్లనై, చెలంగి
భవ్యమైనట్టి, శుభ్రజ్యోతివై, దివ్య
దేహంబుతో గూడి - దివ్యుఁడగుచు
తలపోసిచూడ, శబ్దబ్రహ్మ మందు ని
వాసుఁడై, శ్రీరామ। వాసుదేవ।

గీ॥ శ్రీమనోన్మని పథమందు - జెల్ఁగి, శ్రీ ము
కుంద। జాలంధ్ర పీఠంబు - నందు వెలసి
భక్తజనముల బ్రోచెడి - ముక్తివరద!
భజన సేతును రక్షింపు పావనాత్మ। ౨౭

సీ॥ జ్యోతి స్వరూపుఁడై, సీతా సమేతుఁడై
వేదశాస్త్రములచే, వేద్యుఁడగుచు
చంద్రస్వరూపుఁడై సచ్చిదానందుఁడై
సుఖదుఃఖములులేక, సూక్ష్ముఁడగుచు
నిఖిలార్థతత్త్వుఁడై, నిర్మల హృదయుఁడై
భ్రూమధ్యమున, వాసమును, సలుపుచు
శ్రీసుషుమ్న స్థాన వాసంబుఁగైకొని
ప్రళయ సూర్యుని భంగి, ప్రభల నెల్ల

గీ॥ దిశల వెల్గొందఁ జేయుచు, దీన జనుల
బ్రోచి, శరణన్నఁగాచి, సంపూర్ణ కరుణ
జూపు తారక రామ! సంస్తుతు లొనర్తు
దుఃఖములఁబాపి రక్షింపు తోయజాక్ష! ౨౮

సీ॥ పదియాఱు రేకుల - పద్మకర్ణిక నొందు
శీర్షమున, ధరించి - వెలగి నావు;
పద్మకర్ణికనుండి - ప్రవహించు నమృత, ల
హరి; మోక్ష పీఠమం దలరుచుందు;
శ్రీ శబ్ద బ్రహ్మంబు చెలువారు; స్థావర
జంగమ గురుడీవు! శాశ్వతుడవు
సచ్చిదానందుడై - స్వప్రకాశంబుతో
వెలుగొందు చుండెడి విభుడవీవు.

గీ॥ పరగ నుత్కృష్ట తేజస్సు - పఱలజేసి
నేత్రములు, కగోచరుడయి - నీలవేణి
సీతతోఁగూడి, శోభిల్లు శ్రీశుభాంగ!
ప్రార్థన మొనర్తు; రక్షింపు - రాఘవేంద్ర! ౬౦

సీ॥ తారాగ్రహాక్రాంత - ధవళ శృంగ నితాంత
దివ్యోన్నతంబైన - నవ్యసౌధ
మొందు, విరాజిల్లు; నిండు పున్నమ కోటి
చంద్రకాంతులచేఁ బ్రకాశమైన
సౌధాంతరంబున - సరసిజంబున నీవు
సుఖముగాఁ గూర్చుండి సుందరాంగ!
వాల్మీకి మునియు దుర్వాసాదిమునులు, సం
సేవింపగా నిన్ను శ్రీశుభాంగి

గీ॥ సీత, యెడమ ప్రక్కఁ జెలువారు చుండంగ
వెలయు చుందు వీవు వేదవేద్య!
తారకాభిరామ! ధర్మాత్మ! శ్రీరామ!
నీదు సేవజేతు - నిశ్చలముగ. ౬౧

సీ॥ శ్రీ పురాణ పురుష! సీతా మనోహరా!
వందనంబులు నీకు సుందరాంగ!

ఇంద్ర నీలశ్యామ ! ఇనకుల భూషణా !
వందనంబులు నీకు వనరుహాక్ష !
హారకిరీటంబుఁ జారు కుండలములు
ధరియించు రామ ! వందనము నీకు !
దశరథాత్మజ ! జగదాధార ! గురువర !
కై మోడ్పు లర్పింతుఁ గమల నాథ !

గీ॥ ధనువు బాణంబుఁబట్టి, కోదండరామ !
సర్వ జగముల రక్షించు సార్వభౌమ !
పాపములఁద్రోలు శ్రీరామ ! భవ్యనామ !
వంద నంబులు సచ్చిదానందమూర్తి ! ౬౨

సీ॥ శౌనకాది మునుల, సంస్తోత్రములఁజెందు
శుభగుణ భూషణా ! స్తుతులునీకు !
తారక పీఠ మధ్య విలయుఁడై, జగ
న్నాయకుఁడగు రామ ! నతులునీకు !
భక్తుల కెల్లఁగల్పకమవై, కోదండ
ధారియౌ రామ ! వందనమునీకు !
నీలమేఘశ్యామ ! నిగమ గోచర రామ !
శ్రీకర ! మూర్తి ! జేజేలు నీకు !

గీ॥ ఆర్య ! "తత్త్వమసీతి" వాక్యజనకుండ
వై, సదా భక్తులను బ్రోచు నబ్జనేత్ర !
సతము సద్భక్తిధ్యానించి, సంస్తుతింతు
వందనంబులు సచ్చిదానందమూర్తి ౬౩

సీ॥ రాఘవేంద్రుఁడ ! సహస్రార పద్మమునందు
వసియించి యున్నావు - వందనములు !
ముక్కంటి కిష్టుఁడై - రక్కసులను ద్రుంచి
బహుకీర్తిఁగొన్నావు - వందనములు !

అమృతము వలె చల్లనైనావు; దేవతల్
వానరుల్ స్తుతియింతురి - వందనములు!
చంద్రసూర్యులు నీకుఁ జక్షుర్యుగంబగు
భద్ర గుణోన్నత! వందనములు

గీ॥ శ్రీజగత్పావనుండవై చెలఁగినావు ।
పావనికి నీవు నిండు దీవన లొసంగి
ప్రోచినాఁడవు; శ్రీరామ పుణ్యపురుష!
వందనంబులు - సచ్చిదానందమూర్తి ౬౪

సీ॥ సాగర గర్వంబు - సమయఁజేసితి వీవు
వందనంబులు నీకు - సుందరాంగ।
కౌశికయాగ రక్షణము జేసితి వీవు
వందన శతము - ముకుంద। నీకు
శ్రీ ధనుర్బాణముల్ - జేధరించితి వీవు!
వందనంబులు - రామభద్ర నీకు
నారచీరలు జడల్ - నయమునఁదాల్చితి
వందంబుగా, రామ। వందనములు।

గీ॥ సీతయును, లక్ష్మణుండు నేసేవ సలుప
దండకారణ్య భూము లుద్దండగతిని
దిరిగి నాఁడవు। గురువుల గురుఁడ వీవు।
వందనంబులు; సచ్చిదానందమూర్తి!

సీ॥ పుండరీకంబులఁబోలు నేత్రంబులు,
పూర్ణచంద్రుని వంటి మోము, శంఖ
మునుబోలు కంఠంబు - వనజంబులనుబోలు
హస్తద్వయంబుల - నమరు రామ!
పీతాంబరము గట్టి - సీతాసతీమణి
సేవింప ముగ్ధుఁడౌ - శ్రీనివాస।

కారణదేహా ! జగన్మోహనాకార !
భద్రాద్రి రాఘవా ! వందనములు !

గీ॥ ఉజ్జ్వల లలాట భాగంబు నొప్పువాఁడ !
ఆర్య ! శ్రీరామభద్ర ! దయాసముద్ర !
అంబుదాకార ! రాఘవా ! అభయ మిమ్ము
వందనంబులు సచ్చిదానందమూర్తి ! ౬౬

సీ॥ సూర్య కులాబ్ధిఁ గౌస్తుభ మణియై వెల్గు
భద్రాద్రి రామ ! తుభ్యం నమోస్తు !
నీలోత్పలశ్యామ ! నిఖిల మహాపాప
పంచక హరణ ! తుభ్యం నమోస్తు !
తలఁప, షడ్వింశతి - తత్త్వభాసితుఁడవై
పరగెడి రామ ! తుభ్యం నమోస్తు !
త్రిజగంబు, నిను సంస్తుతింపంగ వెలిఁగెడి
ప్రహ్లాదవరద ! తుభ్యం నమోస్తు !

గీ॥ అభయ మొసఁగెడి దేవ ! తుభ్యం నమోస్తు !
అవనిజా పతి ! రామ ! తుభ్యం నమోస్తు !
అఖిల సురముని వినుత ! తుభ్యం నమోస్తు !
భవ్య సుగుణ సమేత ! తుభ్యం నమోస్తు ! ౬౭

సీ॥ రుద్ర విష్ణు బ్రహ్మ - రూపుఁడై, ధర్మార్థ
కామ రూపుండైన - కమల నయన !
మౌని వర్యులకెల్ల - మందార వృక్షమై
పరగెడి శ్రీరామ ! పంకజాక్ష !
పూర్ణ దయామృతంబునకు, సముద్రుఁడై
రఘువంశ పూజ్యుఁడౌ రామచంద్ర !
వైరాగ్య చిత్తుల - భక్తి భావమునకు
వశుఁడ వైనట్టి యో - భవ్యచరిత !

గీ॥ నాద గణమగు స్థలము - సమ్మోదముగను
పొంది యుండెదు శ్రీరామ। పుణ్యపురుష।
శ్రీ మనోహర। రాఘవా। చిత్ప్రకాశ।
వందనంబులు - సచ్చిదానంద మూర్తి। ౭౮

సీ॥ సాత్త్వికతత్త్వ విస్తార ముద్రిత భావ
హృదయంబు గలవారి నెఱిఁగి నావు
బ్రహ్మపిపీలికా - పర్యంతమౌ, జీవ
గణముల వసియించి గ్రాలినావు
ఆది విరాట్స్వరూపావతారము దాల్చి
శేషశయ్యఁబరుండి చెలఁగినావు
అమృత దాయివగుచు, నానంద రూపుఁడై
యారు చక్రంబుల - నడఁగి నావు

గీ॥ నాల్గు భుజముల తోడ విన్నాణముగను
ప్రభల వెలుగొందు చున్నావు; రామరత్న
మా। వరద। భజియింతు నేమముగ నిన్ను
వందనంబులు - సచ్చిదానందమూర్తి। ౭౯

గీ॥ సూర్యసుతుఁడు విభీషణ శూరవర్యుఁడు
భరత లక్ష్మణ శత్రుఘ్న భ్రాతృవరులు
సతము నిసుభక్తి సేవల సలుపుచుండ
భవ్య సాకేత పురములో దివ్యపీఠ
మందు, సీతసేవింప నానంద మొందు
శుక, వశిష్ఠాది మౌని సంస్తుత చరిత్ర।
ప్రణవ బీజ సారాత్మకా। రామచంద్ర,
వందనంబులు సచ్చిదానంద మూర్తి। ౮౦

సీ॥ చంద్ర మొగము వంటి-చారు మొగము వాఁడు
రత్న కుండలముల - ప్రభల వాఁడు

దశకంఠు దునిమిన - దర్పంబు గలవాఁడు
శ్రీ విభీషణుని, బోషించువాఁడు
విజయంబు సాధించి - ప్రియము గొల్పెడివాఁడు
లక్ష్మితో సతము వెలసెడు వాఁడు
మూడు లోకములకు ముద్దుగూర్చెడి వాడు
తామర పత్ర నేత్రముల వాఁడు

గీ॥ గొప్పవగు ధనుర్బాణముల్ గూర్చి శత్రు
నాశనము జేయ గలవాఁడు; నంద నంద
నుండు, దామోదరుండు, విష్ణుండు, రామ
చంద్రుఁడతని సేవింతు రక్షణము కొఱకు ౭౧

సీ॥ కనక కుండలముల కాంతిఁ బ్రకాశించు
చెక్కిళ్ల గల్గిన శ్రీయుతుండు
స్థావర జంగమాత్మక జగద్రూపుఁడై
యఖిలాస్పదుండైన యవ్యయుండు
జ్ఞానాంశ రూపుఁడై మౌని వర్యుల కెల్ల
బోధించునట్టి సద్బుధ వరుండు
పాదపద్మంబుల - భాగీరథీదేవి
జన్మింపజేసిన సత్ప్రభుండు

గీ॥ రమణ ధర్మార్థ కామ మోక్షము లనియెడు
నాల్గు పురుషార్థముల నిచ్చు నాథుఁడతని
చరమ పీఠ మధ్యస్థుని చారు చరిత
దాశరథి ధ్యాన మొనరింతు తప్పకెపుడు. ౭౨

సీ॥ శ్రీ సనందనముని - శ్రేష్ఠుని కిష్టుఁడై
దశరథ పుత్రుఁడై దనరు రామ!
దేవేంద్రుఁడాదిగా దేవసమూహముల్
సేవింపఁజాలు నొందు శ్రీశుభాంగ!

వేద స్వరూపుఁడై విజ్ఞాన జలధియై
సీతాసమేతుఁడై వెలఁగురామ!
వైకుంఠ నగరాధి - పతియయు తత్త్వసిం
హాసనస్థుఁడగు బ్రహ్మర్షివినుత!

గీ॥ రామభద్రనిన్ను - రక్తితోధ్యానించి
నిగ్రహించి మనసు - నిష్ఠతోడ
నేక దీక్షతోడ - లోర్తికమూర్తి నీ
జింతసేతు నభవ! చిత్తశుద్ధి. ౨౩

సీ॥ 'మణిపూరకం'బను - మహిత చక్రంబందు
గొప్పతేజముతోడఁ గొమరు మిగిలి
చక్క ''ననాహత'' చక్ర - మధ్యన హంస
మంత్ర నాదముతోడ మహిమఁగూడి
సార 'సహస్రార' చక్రంబు నందున్న
చంద్రబింబామృత సారమందు
ప్లుతమైన దేహంబు భూషణంబుగఁగల్గి
యఖిలంబునకు, మూలమగుచు వెలిగి

గీ॥ దశరథాత్మజుండు, తత్త్వ విచారుఁడై
వెలయు చున్నవాఁడు; విశ్వజనుల
రక్షణంబుసేయ దక్షుఁడై యున్నాడు;
అతని నాశ్రయింతు ననుదినంబు. ౨౪

సీ॥ కమలలోచనుఁడ జాగ్రిత్స్వప్న సుప్తుల
యందుఁబ్రకాశించు నట్టి జ్ఞాన
తత్త్వ రూపుండవై ధాత్ర్యాది. పంచ, భూ
తాత్మకుండగుచుఁ గోదండరామ!
శాంభవి మొదలు ప్రశస్త యోగములతో
గూడుకొన్నావు; మిక్కుటము గాగ

సాంఖ్య తత్త్వములకు - జాల దూరంబీవు
సత్యంబు శబ్ద గోచరుడు గావు

గీ॥ జన్మ నాశనములు లేవు ; సతము చేత
నస్వరూపుడై నట్టి యానందుఁడీవు ?
ఆధియును, వ్యాధియును లేని యమరుఁడీవు !
శరణువేడెద శ్రీరామ చంద్ర ! నిన్ను. ౭౫

సీ॥ కేకి పించాళులు - నీకలంకారముల్
ముక్కున ముత్యంబు - ముద్దు నీకు
పీతాంబరము నీకు - ప్రియమైన పుట్టంబు
కౌస్తుభ మణియు, చక్కందనమ్ము
గద, పాశ, వేణువుల్ - కమ్మని యిక్షుచా
పము పుష్ప బాణముల్ - బరగగల్గి
నవ, మన్మథుండవై - నందనందనుఁడవై
శ్రీరామమూర్తి వై చెలఁగినావు

గీ॥ క్రొత్త పపడంబురీతిఁ దళ్కొత్తుచుండు
దేహమును దాల్చి నాఁడవు ; మోహనాంగ !
కమల నయన ! షట్కోణ చక్రంబునందు
వాస మొనరించు చున్నావు - వందనములు. ౭౬

సీ॥ సాకేత పురమందు - సర్వ జగన్మోహ
నా కారుఁడైన శ్రీనాథమూర్తి !
రత్నాంకిత స్తంభ రాజసహస్ర మం
టప, మహాసింహాసనమునఁ బద్మ
చక్రంబు నందధి - ష్ఠితలై, వ్యాస, గౌ
తమ, వశిష్ఠాదులు, దన్నుఁగొలువ
దిక్పాలకులు, బ్రహ్మదేవుండు, రుద్రుండు
లక్ష్మణానుజుడుఁ, సలక్షణముగఁ

గీ॥ దన్నుసేవింప, సీతతోఁజెన్నుమీఱి
చిరతరానంద మగ్నుఁడౌ - శ్రీ విలాసు
రామభద్రుని సతతంబు రక్షకొఱకు
ప్రార్థన మొనర్చి సేవింతు భక్తితోడ ౭౩

సీ॥ హృదయ పద్మమునందుఁ బొదలియున్నావు; చం
ద్రాకృతి తోడ, శ్రీరామచంద్ర !
సూర్య చంద్రాగ్నులఁ జుట్టి, పైభాగంబు
నందు, షోడశ చక్రమందు, నీవు
తారకరామ ! నాదబ్రహ్మమధ్యంబు
నందు, జానకిగూడి, సుందరముగ
వెలయు చున్నావు; విశ్వేశ ! నక్షత్ర
మంటపమందు, సూక్ష్మకృతివి, ధ

గీ॥ రించియున్నావు ! నీదు చరిత్ర మరపి
తత్త్వ సూక్ష్మంబుఁదెలిపిన తజ్ఞ లోకరె
వారు నీ భక్తవర్యులు ప్రభువరేణ్య !
దాశరథి ! కరుణానిధీ దండమిదిగో ! ౭౪

సీ॥ శ్రీయయోధ్య కలదాశ్రిత జన, మందార
మచట బుష్పయుతమై - హర్ష మొసఁగు
నందుండు నొక్కయష్టాక్షర పత్రంబు ;
పత్రంబు నందు నక్షత్ర నామ
కర్ణిక శోభించు, గమనీయ మాణిక్య
మంటప మందులో మహిమ వెలయు
నాల్గు వేదంబులు నాల్గు కుండలముల
కరణి, శోభించుచుఁ గ్రాలుచుండు

గీ॥ మహితమైన నాదబ్రహ్మ మధ్యమందు
శయ్య ధ్రువమండలోద్భవ చారు సుధల

దడుపఁబడి, శయనించు కోదండరామ !
నిన్ను సేవింతు రక్షింపు సీరజాక్ష ! ౭౯

సీ॥ శంఖచక్రములు, హస్తమునందుఁదాల్చి పీ
తాంబరము, ధరించి - దార తోడ
గూడి, కిరీటంబు కొమరైన హారముల్
భుజకీర్తులనుగల్గి - పొలుపుమీఱ
కౌస్తుభ మణిఁదాల్చి - కమల మందాసీనుఁ
డై, సూర్య తేజంబు వాసిఁగాంచి
పాపముల హరించి - పావుకోళ్ళ ధరించి
శశివలెఁ దెల్లనై - చారునేత్ర.

గీ॥ న్యాయగుణశీల ! రామ ! స్వర్ణప్రభలను
మించు మీసముల్ముంగురుల్మేలి గోళ్ల
కలిగి వెలయుచు నున్నావు; కలుష హరణ !
రామచంద్ర ! రక్షింపుమా ! రాజవదన ! ౮౦

సీ॥ శ్రీ, వసాంతాక్షర - చెలువంబుఁగల్గిన
నాల్గు పత్రముల, కోణమున, యంత్ర
మందు, భూతత్త్వంబునంది, చెలంగు, ప
ద్మంబున శ్రీరామ ! దంబుగాగ
కరి, తురగములపై - సురుచిరానందుఁడై
కూర్చున్న వాఁడవు కోమలాంగ !
అభయంబు, పాశంబు, నంకుశమును గల్గి
పవడంపుకాంతిచేఁ బ్రభలఁజెంది

గీ॥ రామ ! శోభించు చున్నావు; రక్తితోడ
నిన్ను ధ్యానించు వారికి నెమ్మనమున
చింతలుండవు; సర్వేశ ! శ్రీనివాస !
రక్షణము సేయుమయ్య ! శ్రీరామచంద్ర ! ౮౧

సీ॥ శ్రీ బలాంతాక్షర శ్రీ వైభవము గల్గు
నాలురేకుల పద్మమందు రామ।
యుదక తత్త్వము నొంది - యొప్పారి యున్నావు।
అభయ హస్తము గల్గి యమల చరిత!
జపమాలికయుగల్గి, సచ్చిదానంద! క
మండలమును దాల్చి - మహిమ తోడ
నాల్గు మోములుఁ బూని - నటనా విశారద।
విశ్వరూపము జూపు వేదవేద్య।

గీ॥ రామచంద్ర! నిన్ను రక్తితో భజియింతు
నన్నుఁగాపుమయ్య! సన్నుతాంగ।
సతము నీదు చింత సల్పుచుందును రామ।
భద్రగుణ సముద్ర! పంకజాక్ష। ౮౨

సీ॥ శ్రీ డఫాంతాక్షర - శ్రీవైభవముగల్గి
అగ్నితత్త్వముతోడ - నలరునట్టి
మణిపూరకంబను - మహిత చక్రము నందు
కూర్చున్నవాడవు - కోమలాంగ!
ఇంద్ర నీలశ్యామ! ఇన కులాభరణ! సీ
తా మనోహరుడ। శ్రీరామచంద్ర!
కౌస్తుభాలంకృత। కామిత మందార!
శంఖ చక్రముల, ప్రశస్త హస్త!

గీ॥ శ్రీమహావిష్ణు రూపుడై వెలగినావు
అలముకొన్న, యజ్ఞానంబు నణచి నీవు
విమల విజ్ఞాన తేజంబు - వెలయజేసి
రామచంద్ర! రక్షింపుమా - ప్రేమమూర్తి ౮౩

సీ॥ శ్రీకఠాంతాక్షర - శ్రీవైభవము గల్గి
వాయు తత్త్వంబునఁ బరిఢవిల్లి

ఆజ్ఞారి ఖండంబు - నొదలఁదాల్చి, య
నాహత చక్రింబు నందు, వాస
మొనరించియుఁ ద్రిశూలమును, ధరించి, యభయ
హస్తుఁడై, శివరూపుఁడైన, రామ!
దర్పరూపముతోడఁదాండవకేళి, వి
నోద, నృత్యములు, సమ్మోదముగను

గీ॥ నల్పు చున్నావు; భక్తులు సన్నుతింప
రిపులు భయమొందఁబార్వతి ప్రీతి నొంద
జనకజ ముదంబుఁ బొందంగ - సాంత్వమందు
వరద! శ్రీరామ శివరూప! వందనములు ౭౪

సీ॥ శ్రీ సురూపుండవు - చింతింప రూప, వ
ర్జితుఁడవు; సకలాత్మ గతుఁడ వీవు!
అద్వితీయుండవు - అఖిల వస్తువులందు
దాండవమాడెదు - తజ్ఞుఁడీవు!
జీవ, జీవాత్ముఁడై - చేతనా ధీనుఁడై
యాకాశతత్త్వంబు నందుదీవు!
శుభ గుణరామ! విశుద్ధ పంకజమును
స్థానంబుగా, గొన్న - చతురుఁడీవు!

గీ॥ కారణములేని. జీవావతారుఁడగుచు
నధికుఁడై, సీతతోఁగూడి యలరుచుండు
రఘుపతీ! చిన్మయానంద! ప్రార్థనంబు
సలిపి, భజియించి సేవింతు జలజనయన! ౭౫

సీ॥ సీతామనోహరా! జ్యోతిస్స్వరూపుఁడై
ఆనందరూపుఁడై - యలరినావు!
శ్రీ ద్వీపత్రింబ్జంబుఁజేరి, మధ్యము నందు
వసియించి యున్నావు - పంకజాక్ష!

పరమాత్మ రూపుఁడై - భావంబునఁ బరం
జ్యోతివై, వెల్గు - ప్రఖ్యాతమూర్తి !
జగములఁ బుట్టించి - తగఁబెంచి, లయమొన
ర్చెడి, త్రిమూర్త్యాత్మక - సిద్ధపురుష !

గీ॥ భావములయందు, వ్యాపించి - బరగెదీవు !
తత్త్వ ! మర్మంబు తెలిసిన - తత్త్వమూర్తి !
రామచంద్ర ! నిన్నసేవింతు - రక్తితోడ
రక్షణము సేయు మభవ ! ప్రహ్లాదవరద ! రాఽ

గీ॥ శశి, యమృతధారలవి, సహస్రారపద్మ
మందుఁబడుమంద దడిసి, యానందమూర్తి
వగుచు నున్నావు శ్రీ రామ ! అఘవినాశ !
తలఁపఁబరదైవముల, నిన్నె కొలుతు సతము. రాః

గీ॥ క్షీరసాగర ద్వీపంబులో - రమేశ !
లక్ష్మి తొడమీద వసియింప, రాజితముగ
గల్పకంబుల క్రింద, బంగారు మంట
పమున, శేషశయ్యఁ బరున్నవాఁడవీవు !
రామ ! వేరు దైవముల, మఱచినవాఁడ
సతము, నిన్నె సేవింతును, సంస్మరింతు. రారా

గీ॥ జ్ఞాన రూపుండవు, సుషుమ్ననాడి యొక్క
మధ్యమున, హంస రూపుఁడై - మాధవుండ !
వెలుఁగుచున్నావు ; చక్రంబుఁ జేతఁబట్టి
శంఖము ధరించి యున్నావు ! సారసాక్ష !

రామ ! పీతాంబరము గట్టి రమణి సీత
సేవ సలుపగఁ జెలువారు - శ్రీ శుభాంగ !
ఇతర దైవంబు నెఱుగ నే నెఱుఁగ నెఱుఁగ
నిన్నె సతతంబు సేవింతు - నిశ్చయముగ రాగా

గీ॥ కల్ప తరువుల క్రిందఁ బ్రకాశ మైన
స్వర్ణ పీఠంబు నందు, భూజాత యుక్త
వై, యధివసించి పూవుల వాన దడిసి
మునులు వానరుల్ నీసేవ లొనరసలుప
సంతసంబున నున్నావు - సారసాక్ష !
ముదమలర నిన్నె ధ్యానింతు హృదయమందు

గీ॥ చక్ర మొకచేత మఱొక హస్తంబునందు
శంఖము ధరించి, గళమునఁ జారు తార
హారము, నుదుటి యందుఁ గస్తూరి బొట్టు
దాల్చి, శేషశయ్యఁ బరుండి, తన్వి సీత
తోడ, నానందరూపుఁడై వేడ్కలలర
రామ ; చెలువొందు చున్నావు; ప్రార్థనంబు
సల్పి. వినుతింతు నీ గుణజాలములను
నన్ను రక్షింపు రామ ! ఆనందపురుష !

గీ॥ ఉపనిషత్తుల శ్రీరామ ! యున్న వాఁడ
వరయ గారణ నామంబుఁ బరగఁ దాల్చి
దివ్యమగు విమానంబున - నవ్య శేష
శయ్యయందుఁ గూర్చున్నట్టి సారసాక్ష
శ్రీ పరంధామ మూర్తివై నెలఁగి నావు ;
ఇతర దైవంబు సేవింప కేను సతము
నిన్నె సేవింతు సేవింతు నిశ్చయముగ
నన్ను రక్షింపు శ్రీరామ ! నాగశయన !

గీ॥ పరఁగ శేషాచలమునందు, పర విమాన
మున, సుయోగ పీఠంబున - ముదము జెలఁగ
వాస మొనరించి, మౌని హృత్పద్మములకు
సంతసంబు జేకూర్చెడి సత్ప్రభుండు

వెపుడు, భూజాత సేవల నింపుగాగ
గొంచు, నోంకార రూపుఁడై కొమరుమీఱు
రామ! నిన్నె ధ్యానింతును రక్తితోడ
నన్ను రక్షింపు శ్రీరామ! సన్నుతాంగ! ౯౩

సీ॥ మనసు సంధున్నావు - మహనీయ చరిత! మ
నోవాసియగుచు నున్నావు రామ!
ఆద్యంత రూపుఁడై - యఖిలంబును, బ్రకాశ
వంతంబుగాఁజేయు ప్రభువరేణ్య!
నీరూపుఁజింతింప నేరము! మధ్యస్థుఁ
డై, ఈశ్వరుండైన - యఖిల వేద్య!
బుద్ధికి, మానసమునకుఁజిత్తమున, క
హంకార మనెడి జాడ్యంబునకును

గీ॥ సాక్షియైనట్టి శ్రీరామ! సార్వభౌమ!
భజన సల్పెద సతతంబుఁ బరమ భక్తి
నాదు లోపంబులను బాపి సాదరమున
రక్ష సలుపుము దేవ! శ్రీరామచంద్ర! ౯౪

సీ॥ ఆనందుఁడై పరమానంద రూపంబు
లకు మేటిసాక్షివై - లలిత చరిత!
రామచంద్రుఁడ! పరబ్రహ్మరూపుండవై
జ్యోతిస్స్వరూపుఁడై - సుందరాంగ;
పార్వతీ ప్రియుఁడయి - బరగు నీశ్వరునిచే
సేవింపఁబడుచున్న శ్రీవిలాస!
శ్రీ పరంధామ! భజింతును సతతంబు
నిర్మల భక్తిచే నీరజాక్ష!

గీ॥ కలుష మెల్లఁద్రుంచి కష్టముల్ దొలగించి
శిష్ట సేవ సలుపు చిత్త మొసగి

రామచంద్రా! నన్ను రక్షింపు మయ్య, నీ
పాద పద్మములకుఁ బ్రణుతిసేతు. ౯౫

గీ॥ వాసుదేవ! పరాత్పర! భవ్యనామ!
సర్వ కారణభూత! తేజస్స్వరూప!
పరమ పావన! సర్వేశ! పంకజాక్ష!
త్రిగుణముల చేత బూజ లందెదు, ముకుంద!
తామస గుణంబున, కతీతుఁడై, మహాత్మ!
వెలుఁగు చున్నావు రామ! సేవింతు నిన్ను ౯౬

## శ్రీ తా ర క రా ము ని వ ర్ణ న

సీ॥ సాకేత పురములో - సౌవర్ణసింహాస
నంబుందు; నయ్యది యగరు గంధ
ధూపంబు లన్నిండి - తోరంబు గాగ - మా
ణిక్య దీపములచే నెగడు చుండు
ఘనసార, కుంకుమ - కస్తూరి వాసనల్
వెదజల్లు పుష్పముల్ వేనవేలు
వివిధ విధంబులు విలసిల్లు నా పీఠ
మందుఁగూర్చున్నావు సుందరాంగ!

గీ॥ మన్మథునకు, మన్మథుఁడవై - మహిమ మీఱి
నీలమేఘ శరీర! శ్రీ నిగమవేద్య!
ప్రభల వెలుఁగొందుచుండు శ్రీరామభద్ర!
శ్రీశ తారక రామ! భజింతు నిన్ను. ౯౭ (అ)

సీ॥ అమృత సాగరమది, యధికోన్నత, తరంగ
యుక్తంబు శ్రీకర ముక్తిదంబు;
తన్మధ్యమందు, శ్వేతద్వీపమొందు, క
ల్పకములచే జుట్టబడి, వెలుఁగు

కర్పూర దీపప్రకాశ మానంబైన
యోంకార గృహమందు నొప్పుచున్న
శేష పర్యంకాన, శ్రీలక్ష్మితోఁగూడి
చెలువొందు చున్నావు శ్రీ రమేశ !

గీ॥ సారమైన, విజ్ఞాన విస్తారజలధి
కాటపట్టయి యున్నావు; ఆదిదేవ !
శ్రీ విరాట్స్వరూపుండయి - చెలగి నావు
శ్రీశ ! తారకరామ ! భజింతు నిన్ను. కాలా (అ)

సీ॥ వైకుంఠ పురములో, శ్రీ కాంత ! కల్ప వృ
క్షస్థలమొండు, శృంగారమైన
బహురత్న మయములౌ ప్రాకారముల చేత
జుట్టఁబడియు నుండు సొబగు మీఱి
చంద్రికాంత మణుల సొరుతోఁదన్మధ్య
సౌధంబు దనరారు సలలితముగ
బూ బాన్పుమంచంబు పొందిగా విలసిల్లు
నందుండు శేషశయ్యను, ముకుంద !

గీ॥ లక్ష్మి మొదలగు వారిచే లాలితముగఁ
బూజ లందుకొని, పరుండి మోహనాంగ !
శ్రీకరంబుగ, విశ్రాంతి జెందినావు
శ్రీశ ! తారకరామ ! భజింతు నిన్ను ! కానా (ఇ)

సీ॥ వైకుంఠ పురములో పటలు; మాణిక్య, వి
రాజితంబైనట్టి ప్రాంత మొండు
చంద్ర పీఠంబందు సొరుగా వెల్గు; నం
దక్షాంత పద్మంబునందు, చంద్ర
బింబంబు నందుండి వెడలెడి యమృత ప్ర
వాహ మొక్కటి యందు పరలుచుండు

నా మధ్య - సూర్యచంద్రాగ్నిమండల ముందు
మండలాంతరమున - మహిమమైన

గీ॥ శేష శయ్యపైన బరుండి - శ్రీనివాస।
ఇంద్ర నీల శోభిత దేహ। జనకులేశ।
శ్రీకరంబుగ, విశ్రాంతి జెందినావు
శ్రీశ, తారకరామ। భజింతు నిన్ను. ౧౦౦ (ఈ)

సీ॥ పాల సముద్రంబు పరగు। నా మధ్యలో
చంద్రి ఖండంబుల సౌరు గల్గు
ముత్తెంపు దీవి - సముద్రమున శోభించు
నందు 'సుధర్మ' యనం - దనరెడి
సభయుండు; తన్మధ్య సార్థకమౌ, బిందు
వొకటి ప్రకాశించు నొప్పుగాగ
నాది శేషుండందు మోదంబుగా నుండు
సతనిపై, శ్రీరామ। యధివసించి

గీ॥ కుండల, కిరీట హారముల్ - నిండుగ, భుజ
కీర్తులనుగల్గి, శ్రీరామ। కీర్తిసాంద్ర।
అలరినావు - శ్రీవత్స చిహ్నంబు దాల్చి
శ్రీశ। తారకరామ। భజింతు నిన్ను. ౧౦౧ (ఉ)

సీ॥ సూర్య చంద్రాగ్నుల - శోభించు జ్ఞాన చ
క్రిమమోధ్యలోనుండు గ్రిమముగాగ
నా చక్రబిందువు నందు బాలార్క తే
జస్స్వరూపుఁడగుచు సారసాక్ష।
తారకరామ। హస్తములందు పాశాంకు
శములు, బాణములు పసందు విల్లు
ధరియించి చెఱునవ్వు దాండవం బాడు, నె
మ్మోముతో, మోహనమూర్తి వగుచు

గీ॥ స్త్రీ పురుష రూపము ధరించి చెలువుగా, వి
లాసముల కెల్ల స్థానమై - లాలితముగ
వెలుఁగు చున్నావు; శ్రీరామ వేడ్కతోడ
శ్రీశ! తారకరామ! భజింతు నిన్ను. ౧౦౨

సీ॥ రత్నకిరీటంబు - రత్నకుండలములు
కర్ణభూషణములు గ్రాలుచుండ
ధనువు, శంఖంబును ధరియించి, పాశాంకు
శంబులు, బాణహస్తమును గల్గి
చక్రి గదా పద్మ చారురేఖలు గల్గు
కరముల వెలయుచు హరుఁడు పూజ
రక్తిని సల్పంగ, రక్తపదాబ్జుఁడై
విష్ణురూపము తోడ వెలసినావు

గీ॥ ధరణిజాత సీతనుగూడి ధన్యుఁడగుచు
సతము చిఱునవ్వుతోఁ బ్రకాశంబుగాగ
వెలుఁగుచున్నావు శ్రీరామ! వేదవేద్య!
శ్రీశ! తారకరామ! భజింతు నిన్ను. ౧౦౩

గీ॥ భాసిలెడి యాసహస్రార పద్మమందు
కర్ణికా మధ్యముననను, ప్రకాశరూపు
డై, వెలుంగుచు, జన్మజరా విహీను
డగుచు, తేజస్స్వరూపుఁడై - యాదిమూల
కారణుండయి, నిత్యుఁడై కమల నాథ!
రామ! చెల్వొందు చున్నావు రమణిఁగూడి
కారణమునకుఁగారణ కర్త వీవు!
నిన్నె స్మరియించి భజియింతు నీరజాక్ష! ౧౦౪

## శ్రీ రా మ ర త్న వ ర్ణ న ము

సీ॥ నిఖిల లోకంబుల - నిర్మల రత్నంబు
సచ్చిదానందమౌ సత్యరత్న

మర్కటబింబాంతర మండలి రత్నంబు
పురహర జపరత్న మరయ, సకల
హృదయాంతరంబుల మెదలెడిరత్నంబు
వైకుంఠ రత్నంబు ; భాగ్య రత్న
మరయగా, వేదవేదాంత రత్నంబు ; శ్రీ
రామరత్నము; పుత్రిరత్న మవని

గీ॥ జాత యౌవన రత్నంబు ; చారు రత్న
మవని, నిక్ష్వాకు వంశాబ్ధి యందుఁబుట్టి
నట్టి, రామరత్నమును, చేబట్టి నేను
శీర్షమున భక్తిధరియింతు హర్షమలర, ౧౦౫

సీ॥ దశరథ వంశరత్నము ; నిర్మలానంద
రత్నంబు ! వైకుంఠ రత్నమరయ
మునిజన జపముల ముఖ్యరత్నము ; నీర
జాంతస్థరత్నంబు సాటిలేని
గుణరత్న మిందుగ్రిందు గోరిస్తుతించెడు
పావనరత్నంబు ; భవుడుఁ జపము
సేయు రత్నము ; సదా చిన్మయానందమౌ
ద్వాదశాంతస్థ రత్నంబు ; రామ

గీ॥ రత్నమిఁది, పరమపదవి రత్నమరయ
నాద నాదాంత రత్నంబు మోదమొసఁగు
నట్టి, షోడశదళ పద్మమందు మెలఁగు
రామ రత్నంబు నన్ను సంరక్ష సల్పు. ౧౦౬

గీ॥ సకల సుకృత రత్నము ! సత్య శాంతి శమద
మాది గుణరత్న మానందమైన శాశ్వ
తంబయిన రత్న మరయ సౌఖ్యంబొసంగు
ప్రణయ నిలయరత్నంబు ; శ్రీరామనామ
రత్నము, పరమ పదవిని రక్తినొసఁగు

రత్న మూహింప స్ఫుటమైన రాజరత్న
మవని శ్రీరామ రత్నంబు నలవియగునె
పొగడ నట్టి నామము నన్నుఁబ్రోచుగాత! ౧౦౭

## శ్రీ రా మ మం త్ర వ ర్ణ న

సీ॥ నిత్యతత్త్వంబిచ్చు - నత్య మంత్రము రామ
మంత్రంబు సాటి యీ మహిని గలదె?
సంసార దుఃఖంబు సమయఁజేసెడునట్టి
రామ మంత్రము సాటి భూమిఁగలదె?
పార్వతీ శంకరుల్ భక్తిని స్తుతియించు
రామ మంత్రము సాటి భూమిఁగలదె?
జానకీదేవి సంస్మరణ మొనర్చు, శ్రీ
రామ మంత్రము సాటి భూమిగలదె?

గీ॥ ఆంజనేయుండు నుతియించు నమలమంత్ర
మఖిల దురితంబులను బాపు నట్టి మంత్ర
మఖిల నిలయ మంత్రంబు, రామాఖ్యమంత్ర
మట్టి మంత్రంబు - పఠియింతు - ననుదినంబు. ౧౦౮

సీ॥ అతిశయ పాపంబు లడఁచి, రాగద్వేష-
ముల, నాశనముసేయు ముఖ్యమంత్ర
మోంకార నిలయమై యొప్పెడి మంత్రంబు
అజ హరుల్ జపియించు నట్టి మంత్ర
మఖిల మునిగణము లాశ్రయించెడి మంత్ర
మఖిల విశ్వముల, విఖ్యాతమైన
రామ మంత్ర మఖిల ప్రాణుల నిర్వాణ
మంత్రంబు; రఘుపతి! మంత్రమరయ

గీ॥ ముక్తి మార్గైక మంత్రంబు; భక్త సులభ
మంత్ర మారాధనులద్రుంపు మంత్ర మమరు

లహరహము జపించెడు మంత్ర మవనినేను
సతము బఠియింతు స్థిరతర శాంతికొఱకు. ౧౦౯

సీ॥ సంసార భయముల సంహారమొనరించు
మంత్రంబు; మౌనుల మాన్యమంత్ర
మఖిల శాస్త్రములందు నానందకరముగా
వరలెడి మంత్రంబు; భర్గుఁడెప్పుడు
జపియించు మంత్రంబు; జన్మ సాఫల్యంబు
నలిపెడి మంత్రంబు; జనన మరణ
బాధల మాన్పు, దివ్యంబైన మంత్రంబు
సర్వ వేదంబుల సార మంత్ర

గీ॥ మభయ మొసఁగెడి మంత్రంబు; శుభము లంద
జేయు కైవల్య మంత్రంబు చిత్త శుద్ధి
నంద జేసెడు మంత్రమహర్నిశంబు
స్మరణనల్పెద; స్థిరతర శాంతి కొఱకు. ౧౧౦

సీ॥ అజ్ఞాన జనితమైనట్టి, సంసార మ
హా సముద్రము, బడబాగ్నిచేత
గాల్చెదు శ్రీరామ! కరుణ నాపై జూపు
మభవ! ముకుంద! ప్రహ్లాద వరద!
అవ్యక్త తత్త్వ నిత్యప్రణవాది, రూ
ఢుఁడయిన, శ్రీరామ; జడ మతులయి
తాపత్రయంబులఁ దపియించు వారము
మృత్యువాసన్నమై - మించు తఱిని

గీ॥ లక్ష్మణునితోడ, నీభార్య లలిత సీత
తోడ, ప్రత్యక్షమై, నాకు తోషమిమ్ము;
ఇతర చింతలు బెట్టకు మిందిరేశ!
రమ్యగుణసాంద్ర! రామచంద్రా! మురారి. ౧౧౧

గీ॥ నాకు పాఠంబు రామకర్ణామృతంబు
ఏబదేండ్లుగ, పఠియించి తెంపుమీఱ
వ్రాసి నాడను; నా నేర్పు భంగి దీని
రామచంద్ర। కానుక గొమ్ము - ప్రేమతోడ ౧౧౨

గీ॥ 'దేశభాసలందు - తెలుగు, 'లెస్స'యటంచు
'తీపి' యంచు, కృష్ణదేవరాయ
డెంతొ ముద్దుగాగ - నింపారఁబల్కెను
ఆదరింపుడయ్య ఆంధ్రులార ! ౧౧౩

గీ॥ కీలు బొమ్మగ నన్నుంచి కృపదలిర్ప
నిన, కులాభరణుండు, వ్రాయించినాడు
రెండవది, ప్రకరణము - ధన్యుండనైతి;
దండమర్పింతు నీకు - కోదండరామ। ౧౧౪

సీ॥ నాభార్య సీతాంబ - సచ్చరితురాలు
భక్తితో, కమ్మగాఁ బాడగలదు.
దంపతులకు మాకు - నింపార నార్వురు
పుత్రులు, ముగ్గురు పుత్రికలును
కలిగిరి; క్షేమంబుగా, నున్నవారెల్ల
వారు; శేషగిరియు, నారసింహ,
సూర్యనారాయణ, సుందరరాజు, జా
నకిరామరా వైదవ కొమరుండు,

గీ॥ రాఘవేంద్రు డారవవాడు - రక్తిమీఱ
నంద రారోగ్యవంతులై - యాంధ్రతోడ,
బుత్రులును, పుత్రికలతోఁ బవిత్రులగుచు,
ప్రేమ నిన్ను ధ్యానింత్రు। శ్రీరామచంద్ర. ౧౧౫

మాలిని: నిరుపమ గుణరాశీ - నిశ్చలానందమూర్తీ !
భరిత భువన పాలా - భవ్య సౌజన్యకీర్తీ।
సరస చతుర భాషా - సత్యవాక్య ప్రవీణా।
కరుణ, సుజన రక్షా - క్రమ సంగీతలోలా।

గద్యము

ఇది, శ్రీమదఖిల కవిమిత్ర, వాగీశ్వరీ దయావిధేయ, శ్రీరామ
చంద్ర, చరణారవింద సంసేవిత, శ్రీమత్కాశ్యపసగోత్ర
పవిత్ర, బడగనాటి, గూళూరు అశ్వత్థమాంబా
కృష్ణార్య, తనూభవ, కవిభూషణ, కవితిలక
బిరుదాన్వయ, కల్లూరు శ్రీ అహోబల
రాయ, ప్రణీతంబైన ఆంధ్ర
శ్రీరామ కర్ణామృతమను
పద్యకావ్యము, ద్వితీ
యాశ్వాసము
సంపూర్ణము

ఓం తత్సత్



# శ్రీ రామ కర్ణామృతము

## తృతీయాశ్వాసము

సీ॥ శ్రీరామ। గుణధామ। సీతాంగనావల్ల
భా। దయాగుణనిధీ! వందనములు
నీ పాద పద్మముల్ - నెమ్మి దేవేంద్రుండు
పూజించు సతతంబుఁ బూర్ణభక్తి
చందన కర్పూర చర్చిత శుభదేహ।
శివధనుర్భంగ। కేశవ। ముకుంద!
నీలమేఘశ్యామ। నీరజాప్తనిశా
నేత్ర ద్వయంబుగా - నెగడువాఁడ।

గీ॥ కల్పకంబుల క్రిందఁ బ్రకాశమైన
పైడి సింహాసనంబున - వేడు కలర
నధివసించితి; శ్రీరామ। యప్రమేయ।
శరణు జొచ్చితి రక్షింపు కరుణ తోడ.

సీ॥ శివ ధనుర్భంగంబు జేసి, శ్రీరామ। కాం
చనగాత్రి - భూపుత్రిఁ జారునేత్ర
జానకిఁ బెండ్లాడి - చారు రత్నాంకిత
భూషణంబులచేతఁ బొలుపుమీఱు
సీతా మహాలక్ష్మి - సిగ్గుచేఁదలవంచి
వామాంకమున భక్తి వఱలు చుండ
నామోఁ గాంచుచు, బహుంశార్క చంద్రులమేటి
ప్రభల వెలింగెడు రామచంద్ర।

గీ॥ ధీరపురుష! సింహాసనాధిష్ఠుఁ డగుచు
ముద్దు లొలికించు చున్నావు; ముదము తోడ

నిన్ను స్మరియించు భక్తుల నీరజాక్ష।
కావగదవయ్య। శ్రీరామ! కరుణతోడ, ౭

సీ॥ భువనైక సుందర। పూర్ణచంద్రాస్య। రా
జీవనేత్ర। ముకుంద। నీవె శరణు!
ధారాధరశ్యామ। ధరణి పుత్రీనాథ।
భక్త మందారమా। ప్రణుతిసేతు
శ్రీరామ! రఘువరా। చిన్మయాకార। త్రై
మోడ్పు లివే నీకు మోహనాంగ
శరచాపములతోడఁ జక్రాయుధము తోడ
భుజ బలంబునవెల్గు - ముద్దురామ।

గీ॥ భక్త జనముల రక్షించు వరద! ఈశ;
చిన్మయాకార। శుభకరా। శ్రీసమేత!
భజన సేతును సతతంబు భక్తితోడ
సభయ మొసఁగి రక్షింపుము శుభ చరిత్ర।

సీ॥ హార, కేయూర, విహార। హాసోల్లాస।
వైభవారామ। సంపద్విశేష।
మణి కిరీటము గల్గి - మంగళస్థానమై
శోభించు శ్రీరామ। సుందరాంగ।
కమనీయమైనట్టి కల్పవృక్షారామ
మణిగృహంబందు నెమ్మది వసించి
శిష్టులు సేవింప - సీతా సమేతుఁడై
యోగ్యసంభాషణా భాగ్యుఁడగుచు

గీ॥ మునిగినాడ వానంద సముద్రమందు
సతము సత్పథగామినై - సరసచతుర
వచనములఁ గుతూహలివయి - వజలు నట్టి
నిన్ను నుతియింతు; శ్రీరామ। సన్నుతాంగ। ౮

సీ॥ రాజశిఖామణీ! రఘువరా! శ్రీరామ!
పూర్ణ చంద్రాస్య! సంపుల్లహృదయ!
పద్మపత్రాక్ష! శ్రీ పద్మావతీ స్తన
కుంకుమాంకితగాత్ర! కోమలాంగ!
ఆహవభూమి, మదాంధ రాక్షసుల, జం
పినయట్టి శ్రీరామ! వీరపురుష!
గండమండలము, ప్రకాశింపఁ గుండల
యుగళంబు ధరియించు నిగమవినుత!

గీ॥ శుభము లొసఁగెడి శ్రీరామ! శుభ్రతేజ!
సుందరుండవు! శ్రీనంద నందనుఁడవు!
నిన్ను సేవింతు, సతతంబు నిశ్చయముగ
నా మనోదుఃఖముల, బాపుమా! ముకుంద! ౫

సీ॥ నిధి వీవు! కోమల నీలమేఘ శరీర!
ప్రతివారు కోరెడి వరము లొసఁగ
పాపముల్ సమయించు పతిత పావనుఁడీవు
కరుణా కరుండయి గ్రాలుదీవు!
సౌమిత్రి సేవింప భూమిజతోఁగూడి
మునివరుల్ స్తుతియింప మురిసెదీవు!
కాకుత్స్థ! దశకంఠ - కంఠవిచ్ఛేదనా
రౌద్రస్వరూప! శ్రీరామభద్ర!

గీ॥ భక్తజనముల రోగంబు బాపఁజేయు
నట్టి దివ్యౌషధము గల్గినట్టివాఁడ!
పద్మ ముఖముతోడ వెలుంగు పంకజాక్ష!
నిన్నె సేవింతు సతము, మన్నింపవయ్య! ౬

సీ॥ పూర్ణచంద్రునిబోలు - ముద్దుమోము గలాడు
పద్మనేత్రుండయి - పలులువాఁడు

సుగ్రీవుఁడనయంబు కుద్గమానసమున
సేవింప, ముగ్ధుఁడై చెలఁగువాఁడు
రాజుల శ్రేష్ఠుఁడై - రాక్షసులను గొట్టి
వీరాధివీరుఁడై - వెలయువాఁడు
జగముల మోహింపజాలు, దేహముతోడ
మనుజ మాత్రుఁడుగాని మాన్యవరుఁడు

గీ॥ రణబలోదగ్రు ఘనమాన రత్నకుండ
లములు గల్గినవాఁడు; శ్రీలక్ష్మియందు
నగ్రహము గల్గు రాముండు; నిగ్రహుండు
నన్నుఁ బ్రోచెడుగాక యనారతంబు. ౭

— స్వస్తి వాచకము —

సీ॥ రమ్యగుణోపేత! రమణీయరూప! వి
శ్వస్తోత్రపాత్రి! సుస్వస్తి నీకు,
రాకాశశాంక శుభ్రాస్య, రమాపద
న్యస్త హస్త కమల, స్వస్తి నీకు,
రాజార్చిత చరణ - రాజీవయుగళ; ప్ర
శస్త దివ్యశరీర; స్వస్తి నీకు!
సజ్జనసుత; చిత్యనారిత్ర; మతిపాత్రి
సత్యదయాసింధు; స్వస్తి నీకు;

గీ॥ రాజరాజులలోన విరాజమాన!
స్వర్భువన మర్త్య పాతాళవాసి స్వస్తి
నీకు! జయజయ రఘువరా! నీకుస్వస్తి
స్వస్తి దశరథ కులచంద్రి! స్వస్తి నీకు! ౮

సీ॥ పతితపావనుఁడ! విశ్వామిత్ర గౌతమ
ప్రియుఁడవై, శ్రీరామ - వెలసినావు
వనవాస మొనరించి - దనుజుల సమయించి
విఘ్నముల్, హరియించి - వెలసినావు

గుణముల కిక్కయై - కోదండ ధారియై
సీతాసమేతుఁడై - చెలగినావు
రావణకుంభ కర్ణాదుల, నెదిరించి
యావిభీషణుఁడు నిన్నాశ్రయింప

గీ॥ చెలగి, రక్షించినావు! లక్ష్మివినోద!
లక్ష్మణుండు, సుగ్రీవుండు - లలితభక్తి
నిన్నుసేవింతు; భక్తులు నిన్నుఁజింత
నంటొనర్తు! రక్షింపుమా - నాగశయన! ౯

సీ॥ మొలయందు, పైడిగంటలు, గల్లుమని మ్రోయ
పులిగోరు, మెడయందు బొలుపొసంగ
నల్లని ముంగురుల్ - నాట్యమాడుచు నుండ
చిఱునవ్వుమోమునఁజెంగలింప
భుజకీర్తులు, గిరీటము, మొదలుగాఁబలు
తెలుగుల సొమ్ములు - మురుపొసంగ
నీరజంబులవంటి - నేత్ర ద్వయంబుతో
శ్యామలదేహంబు - సొరు లీన

గీ॥ బాలరామ! శోభించెదు - లీలతోడఁ
బద్మకాంతిఁబ్రకాశించు - పద్మనాభ!
స్మరణ మొనరింతు సతతంబు మమతతోడ
నీదు లీలలఁజూపి, సమ్మోదమిమ్ము ౧౦

సీ॥ శ్రీవత్స చిహ్నంబుచేఁ గుండలములచే
సుప్రకాశంబిచ్చు సుందరాంగ!
శతసూర్యులను మించు - ద్యుతి కల్గి వెల్గెదు
శ్రీరామ! గుణధామ! శ్రీనివాస!
సీతామనోహరా! చిఱునవ్వు శోభించు
ముద్దుమొగము గల్గు మోహనాంగ!
భూషణములతోడ, మురువు దేహమునొప్పి
స్తుతశ్రీ దేవేంద్రుఁడై శుభములందు

గీ॥ రామ! నీలమేఘశ్యామ! రక్తితోడ
సురతరులక్రింద వెలుగొందు శుద్ధరత్న
పీఠమందుఁ గూర్చున్నావు; వేదవేద్య
రామచంద్రప్రభూ! కావవే - మహాత్మ!

సీ॥ కపికుల బలగంబు - కడలికి సేతువు
గట్టగా శ్రీరామ! కడకతోడ
లంకాపురముఁజొచ్చి - రావణాదిగ, రాక్ష
స, కులంబు మడియించి సాహసమున
సీతనుగైకొన్న - సీతా మనోహరా!
అమరుల కానంద మమరె; ముని, జ
నంబులకెల్ల మోక్షంబుఁ బ్రసాదించి
సర్వసుఖంబులఁ బర్వఁజేసి

గీ॥ ధర్మరక్షణ మొనరించి దనరినావు
ప్రతిభ వచ్చెను శ్రీ రఘువంశమునకు
గాన మొనరింతు నీ రమ్య కథలు; తప్పు
బట్టి కాలింపు శ్రీరామ! భక్తవరద! ౧౨

సీ॥ యోగీశ్వరులు నిన్ను - రాగంబుతో, స్తోత్ర
ములు సేయుచున్నారు ముక్తివరద!
అఖిల గుణంబుల కాధారమైనావు
సుర విమానముతోడ బరగినావు
ముక్కంటి పూజింప ముదము నందెద వీవు!
సీతామనోహరా! శ్రీనివాస!
హృదయ పద్మంబున కినుఁడవై, యద్దాని
వికసింపఁజేసెడి విమలచరిత?

గీ॥ సుందరులలోన మన్మథ సుందరుఁడవు!
రామ! రఘుపతీ! శ్రీపరబ్రహ్మ వీవు!
నిన్ను స్మరియించువారికి సన్నుతాంగ!
ముక్తి చేకూరకుండునే భక్తసులభ! ౧౩

సీ॥ వర గుణమణులకు - వనధివి శ్రీరామ!
వసుధాత్మజకుఁ బ్రాణబంధు వీవు!
మేరు పర్వతమును - మించు ధైర్యము గల్గి
దనుజాలఁ జెండాడి దనరితీవు।
దశరథునకు ముద్దు తనయుఁడ వైనావు
భువన భద్రఖ్యాతిఁ బొందినావు
సురముఖ కమలముల్ శోభింపఁజేసెడి
కరుణాళుఁడైన, భాస్కరుఁడ వీవు!

గీ॥ భూతలాబ్జమరయ - రాతిరి ముకుళించి
పొద్దు పొడువ సుఖము బొందురీతి
నీదు రాక మాదు నెమ్మనాబ్జంబులు
వికసనంబు లంది - వేడ్కలందు. ౧౪

సీ॥ సుర కుముదాళి, సంబరమునఁ దేల్చెడి
చంద్రుండు; దానవ సరసిజముల
చంద్రుండు; యోగుల జ్ఞాన చంద్రుఁడు; పాప
తమములఁ బోకార్చి - తనరునట్టి
చంద్రుండు; జానకీసతి నేత్రకైరవ
ములకుఁ జంద్రుండును - మొనసి, భక్తు
లయినట్టి వారి - నయన కుముదాళికి
జంద్రుండు; దశకంఠ సరసిజముల

గీ॥ నడఁచు చంద్రుండు; శ్రీరాముఁడనఘమూర్తి
చంద్రువలె వెల్గు శ్రీరామచంద్రమూర్తి
యట్టి శ్రీరామచంద్రుఁడిక్కట్టుమాన్పి
హర్షమొనగూర్చి రక్షించు - ననుదినంబు ౧౫

సీ॥ బంధు దుగ్ధాబ్ధికిఁ బావన చంద్రుండు
సజ్జన కుముదాళి చంద్రిముండు

జానకీ స్తనయుగ్మ చంద్రుండు; శత్రుల
ముఖపద్మ చంద్రుండు; ముద్దుగాగ
సత్కీర్తి చంద్రుండు; సకల లోకపత్రికా
శమొసఁగు చంద్రుండు; సంతతంబు
వేల్పులఁ దనియింప వెల్గెడు చంద్రుండు
రామచంద్రుఁడు, యోగిరాజ మనము

గీ॥ లనెడు కలువల వికసింప గనెడు చంద్రు
డుండు; దశరథేశ్వరుకొమ - రుండు నిండు
చందురుండు; శ్రీరాముండు సంతసమున
నాదుసేవలఁ గొనుగాత ఖేదముడిపి. ౧౬

సీ॥ రాక్షసప్రముఖుల ప్రాణముల్ హరియించు
శరములఁ బ్రత్యువసంహరణము
సల్పుచు, ధనువున సంధించి హస్తముల్
వీరప్రతాపుఁడై వెలసినావు;
దశకంఠు కంఠముల్ తగినట్లు గదశికా
కాండముల్ ద్రుంచిన కరణి ద్రుంచి
యంగజుదర్పంబు హరియించినట్టి ఈ
శ్వరుని రూపంబుతోఁ బ్రజ్వరిల్లి

గీ॥ రామ! మునులసంస్తుతులంది ప్రబలినావు,
శిష్టజన రక్షణంబును దుష్టశిక్ష
ణంబు, నీ యవతారఫలంబుగాదె।
రక్షణము, సేయుమయ్య! ప్రహ్లాదవరద; ౧౭

సీ॥ నారి బాణమును, కర్ణాంత పర్యంతంబు
లాగుచుఁ బ్రళయకాలస్వరూపుఁ
డైన, యముండవై, యక్షి పద్మప్రాంత
మెఱుపు, వహింపగా - నినకులేశ

పౌలస్త్య రాక్షస ప్రభ లడగింపగా
    బహువిచిత్రభంగిని బాణములను
హస్తనైపుణ్య ప్రశస్త భావముతోడ
    సంధించి విడిచి, రాక్షసులఁజంపి

గీ॥ దేవతాళికి ముదమిచ్చి దివ్యుఁడగుచు
వెలుగుచున్నావు శ్రీరామ! వీరుఁడగుచు
నిన్ను భజియింతు నిత్యంబు నేమముగను
నన్ను రక్షింపుమయ్య! సంపన్నచరిత!

గీ॥ మిత్తి వెన్నంటి, దగ్గఱి మిఱ్ఱింగ, రాఁగ
దల్లిలేదు, పుత్రులులేరు, తండ్రిలేడు,
తోడఁబుట్టినవారు, బంధువులులేరు;
రాముఁడే, నన్ను రక్షించు రక్షకుండు.

సీ॥ ఇంద్రరథంబెక్కి, హితమతి నాతఁడొ
    సంగిన ఖడ్గంబు సరగఁబూని
రథము నారోహించి - రణ పరాక్రమముతో
    భుజముల్ల జఱచి, తన్నోపమల విఱిచి
సాహసంబున, ధనుష్టంకార మొనరించి
    శత్రుభయమొనర్చి, సరసలీల
తూణీరబాణముల్ దొరఁగించి, రావణ
    సంహారము నొనర్చి, శౌర్యధుర్య!

గీ॥ రామ! వీరప్రతాపుఁడై - రణమునందుఁ
గానబడినావు; నీ రూపుఁగాంచవశమె?
బ్రహ్మ రుద్రాదులకునేని! భక్తవరద!
శాంత రూపంబుతోడఁ బ్రసన్నుడగుము

గీ॥ కనక రుచిర చేలముగల్గి, కర్ణకుండ
లములచేత బ్రకాశించి యమిలి రుచిర

మణికిరీటముఁదాల్చి, సొంపారు, భ్రూ,ల
లాటమునుగల్గి, విమల జలదముఁబోలు
నీల దేహంబుతోడ వన్నియకు నెక్కు-
రామ ! శేషశాయి ! రఘుకుల ప్రదీప !
నిన్నెధ్యానింతు సతతంబు నెమ్మనమున
నన్ను రక్షింపు శ్రీరామ ! నాగశయన ! ౨౧

సీ॥ శ్రీవత్స చిహ్నంబుచేఁ గౌస్తుభముచేత
పీతాంబరముచేత వెలసినావు
బహురత్నములచేత - భాసిల్లు చున్నట్టి
మకుటంబు, మందార మాలికయును
దాల్చితివీవు; కోదండధారి ! ముకుంద !
కోటిమన్మథ తేజ ! కువలయేశ !
నీలమేఘశ్యామ ! నిగమ వందితపాద !
సీతతోఁగూడిన - శ్రీశుభాంగ !

గీ॥ సారకస్తూరి ఘనసార చర్చితాంగ !
నిత్యశోభిత ! శ్రీరామ ! సత్యచరిత !
నిన్ను సతతంబు సేవింతు నీరజాక్ష !
నన్ను మన్నించి రక్షింపు నాగశయన ! ౨౨

సీ॥ రామ ! నీ నామంబు - రాక్షస స్త్రీగర్భ
విచ్ఛేదన మొనర్చు; వినుతశీల !
స్మరణచేసిన నిన్ను - చండాలుఁడేనియు
ముక్తిఁగాంచునుకాదె ? భక్తసులభ !
వేద సన్నిభమైన - విఖ్యాతి నార్జించె
రామ ! నీ నామ మీ భూమియందు
ఇతరముల్ వేలుగా నింపారు నామంబు
లెన్నిపఠించిన నేమి ? రామ !

గీ॥ నీదు నామంబునకు సాటిరాదు, రామ

యనుచు నొక్క సారి పఠింప నఘము లుడుగు
రామ ! నీదు నామామృత సోమపాన
మబ్బఁజేయుము; ప్రార్థింతు ననుదినంబు. ౨౩

సీ॥ రాక్షస మర్దనా ! రఘువంశ తిలకమా !
దితిపుత్ర నాశనా ! ధీర ! రామ !
భయమును హరియించి - భక్తుల కభయంబు
చేకూర్చుచున్నట్టి శ్రీశుభాంగ !
ఇంద్రుభయము, హరియించి, సుగ్రీవుని
కిష్టుఁడై, ఘనరాజ్య మిచ్చినావు
పాపరాసులనెల్ల - ధ్వంసంబొనర్చుచు
నాంజనేయుని స్తోత్ర మందినావు

గీ॥ శార్ఙ్గధారివి, శ్రీరామ చంద్ర ! భక్త
వరద ! సీతాసమేతుఁడై వఱలునిన్ను
భజనసేతును సతతంబుఁ బరమభక్తి
మానసానంద మిమ్ము; రమావినోద ! ౨౪

సీ॥ కౌసల్యనేత్ర వికాసంబుఁ జేకూర్చు
రక్తాబ్జనేత్ర ! శ్రీరామచంద్ర !
రావణ సంహార ! రఘుపతీ ! రఘువరా !
శేషశాయి ! ముకుంద ! శ్రీశుభాంగ !
అవనిజాకుచకుంకు మాంకిత సద్వక్ష !
మాయా మనుజదేహ ! మా ప్రియుండ !
శ్రీ విష్ణురూపుఁడై - సీతతోఁ గూడిన
రఘునాథ ! వరద ! శ్రీరామభద్ర;

గీ॥ నిర్మలాకార ! శుభశరీరా ; నిగమవేద్య !
భక్తజన పారిజాతమా ! పరమపురుష !
నిన్ను సేవింతు భజియింతు; సన్నుతాంగ !
నన్ను రక్షింపవయ్య ! సంపన్న చరిత ! ౨౫

సీ॥ కాంచనాంబరధారి! కమనీయమౌ, ఇంద్రని
 నీలకాంతి శరీర! నీరజాక్ష!
మధురాక్షసుని నేలమట్టంబు కావించి
 స్తుత్య చరిత్రుఁడౌ - సుందరాంగ!
వానరవరులు, విశ్వామిత్ర, శ్రీ వశి
 ష్ఠాది మునిగణంబు - మోదమలర
నీ సేవ సతతంబు - నెఱపుచు నున్నారు
 సీతా సమేతుఁడౌ - శ్రీ శుభాంగ!

గీ॥ కోటి భాస్కర చంద్రుల మేటి తేజ!
మీవు; పీఠాసనమునందు మెలగి భక్త
జనుల రక్షించుచున్నావు సరసిజాక్ష!
నన్ను రక్షింపు శ్రీరామ! నాగశయన! ౨౮

సీ॥ వింజామరలబూని - వేడ్క శత్రుఘ్నుండు
 భరతుండు నీ సేవఁ జరగసల్ప
శ్వేతాత పత్రంబుఁ బ్రియమున లక్ష్మణ
 స్వామి పట్టియు సేవ సల్పుచుండ
కల్పవృక్షముక్రింద - కమనీయమైనట్టి
 మణిపీఠమందు, సంబరము మెఱయ
నాసీనుఁడై నట్టి - యజ్ఞాక్ష! శ్రీరామ!
 ముని జనార్చిత పాద వనజ యుగళ!

గీ॥ సీతతోఁగూడి యున్నట్టి శ్రీ శుభాంగ!
రఘుపతీ! రామచంద్ర! గారవముతోడ
నిన్ను సేవింతు, భజియింతు; నిర్మలాత్మ!
నన్ను రక్షింపుమయ్యా! సంపన్న చరిత! ౨౯

సీ॥ నరులు, రాక్షసులు వానరులు నిజ సేవింత్రు
 ఇంద్రాది దేవత లెపుడు నీదు

పాద పద్మంబులు - భక్తితో పూజింతుర్రి
శ్రీ రామ ! రఘుపతీ ! శ్రీనివాస !
పరితప్త కాంచన ప్రభతోడఁ దుల్యమౌ
మేని కాంతులుగల్గు జానకమ్మ
వామాంకమందు సంవాసంబు సేయంగ
నామె నాలోకించు చనవరతము

గీ॥ ఛత్రచామరములను హస్తమునఁదాల్చి
లక్ష్మణుడు నిన్ను సేవింప లలిత భంగి
మదు మోహన మూర్తివై మురిసినావు ;
రామ ! నీ సేవ లొనరింతు ; రక్తితోడ ౨౮

సీ॥ కస్తూరి బొట్టుచేఁ గమనీయుఁడెవ్వాఁడు ?
వాలిని మర్దించి ప్రబలె నెవడు ?
కరుణాసముద్రుఁడై, కమలాస్య కమల, మ
ధుపమై వెలసిన సంతోషకరుఁడు
కల్యాణ సంపత్తుఁ గల్గఁజేసెడు వాఁడు
కౌసల్యకును, ముద్దు గల్గువాఁడు
సుగ్రీవు రక్షించి - శుభము గూర్చిన వాఁడు
ఘనపరాక్రమముతోఁ దనరువాఁడు

ఆ॥ అర్కకోటి సదృశుఁడాజానుబాహుండు
సీతతోడఁగూడి చెలఁగువాఁడు
కాంచనాంబరములఁ గౌమార రూపుఁడౌ
రాముఁ దలఁతు సతము నేమముగను.

సీ॥ కోటి దివాకరుల్ కోటివిద్యుల్లతల్
నీ కాంతి సరిరావు నిగమవేద్య !
కౌస్తుభాలంకార ! కైలాసవాసప్రి
యా ! సనకాది సంయమి గణంబు

పరివారమై, నీదు పాదపద్మంబుల
సేవింపు చున్నారు శ్రీ విలాస !
ముత్తెముల్ రత్నముల్ బొదివి నట్టి, కిరీట
కుండల ధారివై - కువలయేశ !

గీ॥ రామచంద్ర ! గ్రైవేయ హారములతోడ
వెలయు చున్నావు; వైదేహి వీడకెపుడు
నామె కుచకుంకుమాంకితం బందినావు ;
రామ ! నీ సేవ సల్పెద - రక్షకొఱకు. ౩౦

సీ॥ అంగద సుగ్రీవ హనుమదాదులు, నిన్ను
సేవింపు చున్నారు ; శ్రీ రమేశ !
బ్రహ్మ శంకరుఁడు, దేవతలు నిన్ సతతంబు
వినుతింపు చున్నారు వేదవేద్య !
కల్పవృక్షముక్రిందఁ గమనీయ మాణిక్య
సింహాసనస్థుఁడౌ - చిద్విలాస !
గుణనిధి రఘువీర ! కోటి విద్యుత్కాంతి
సదృశశరీర ! విచారధీర !

గీ॥ రామ ! తేజస్స్వరూపుఁడవై - ప్రబలినావు,
రూఢిగాఁజూడఁ బరమేశ్వరుఁడవు నీవ !
సీతతోఁగూడి యున్నట్టి శ్రీ శుభాంగ !
సేవ లొనరింతు ; నన్ను రక్షింపుమయ్య ! ౩౧

సీ॥ ఇందీవరాక్ష ! నీ సుందర గాత్రంబు
బోలు దేహముఁగల్గు పురుషులెవరు
ముల్లోకముల లేరు; మురహర ! కమలాక్ష !
శ్రీ ధనుర్బాణముల్ - చేతియందు
బ్రీతిఁ దాల్చితివీవు ; విస్తీర్ణ వక్షస్థ
లముగల్గి, వివిధ రత్నములచేత

బొలుపారెడి విచిత్రభూషణ తతులచేఁ
జెలువారు చున్నావు; శ్రీ శుభాంగ!

గీ॥ రామ! అజాను బాహుండవై; మనోహ
రాననము కలిగినావు; శోణాంఘ్రిపద్మ
ములతొ, నీలమేఘశ్యామ! మోదమలరఁ ౩౨
గులుకు చున్నావు; శ్రీ పతీ! కొనుననమస్సు.

సీ॥ ఆనందమైన, దివ్యారణ్యమందు, 'య
తీంద్ర' పట్టణ మొందు తేజరిల్లు
పదునాలుగువేలు సువర్ణపు స్తంభముల్
గల్గు మంటప మందు గ్రాలుచుండు
మందార వృక్షంబు - మధ్యమందుండు; నా
నా రత్న ఖచితమౌ - నాణ్యమైన
సింహాసనంబందు చెలువారు; దానిపై
సంస్థితుండైనావు; జానకియును

గీ॥ లక్ష్మణుండు, నీ సేవల - లలితభక్తి
సేయుచున్నారు; శ్రీరామ! చిద్విలాస!
పూతచారిత్ర! సీతా సమేత! నిన్ను
భజన చేసెద సతతంబు - విజయమిమ్ము; ౩౩

సీ॥ ముక్కంటి భార్యయై - ముక్తినిచ్చునదియై
భగవత్స్వరూపయై - పరగెనెద్ది!
సారస్వతి యయి, భగీరథు కూతురై
మందాకినీ నామ మొందెనెద్ది!
లోక కిల్బిషములఁ బోకార్చి, సురనది
యై, పావనంబైన యట్టిదెద్ది!
ఇందు కాంతిప్రభ నొంది, లోకమునందు
కీర్తి కరంబయి, గెరలునెద్ది!

గీ॥ అట్టి గంగ, పాదములందుఁ బుట్టె, నే-మ
హాత్మునకు ? విష్ణురూపుఁడై యలరు నెవఁడు ?
అట్టి రఘువీరు శ్రీరాము ననఘ చరితు
నాశ్రయించి, సేవించెద నహరహంబు, ౩౪

సీ॥ ఏపాద ధూళిచే - శాప విమోచన
మందిన దానా డహల్యకాంత ?
మూడులో కంబుల పీడ నడంచెడు
శ్రీ నామ మెయ్యది చింత సలుప ౩
పూర్ణచంద్రునివంటి - పొలుపారు, మందహా
సముతోడ దీపించు సరసుఁడెవఁడు ?
పద్మనేత్రములతో, పరమ పావనుఁడౌచు
తేజస్స్వరూపుఁడౌ - ధీరుఁడెవఁడు ?

గీ॥ అట్టి రఘువంశ దీపకుండమలచరితు
డార్యుఁడుర్వీజనాథుఁ డహరహము, కరు
ణాంత రంగుడై మము బ్రోచు-సంతసమున
నతని చింతింతు సేవింతు; మతిఁదలంతు. ౩౬

సీ॥ కరకంకణంబులు, కాలి కడియములు
భుజకీర్తులనుగల్గి - పొలుపుగాగ
మాణిక్యకుండల మండితుండై, హార
ములు, గొప్ప భూషణములు, సహస్ర
ములతోడ ముద్దుగాఁ గులుకు చున్నాఁడపు
శ్రీరామ ! రఘురామ ! శ్రీ శుభాంగ !
రత్నప్రభలతోడ రాజిల్లు నీ హస్త
ములు, జానకీ స్తనములనుమోద

గీ॥ మలరదాక, గగుర్పాటు లావహించె
సీత చిఱునవ్వుతోడఁ గాంచెను; ముకుంద !

వరద! రఘువంశ తిలకమా! భక్తసులభ!
గుణనిధీ! నిన్ను సేవింతు; కుతుకమలర. ౩౬

సీ॥ కోటి మన్మథతేజ! కువలయశ్యామ! శ్రీ
రామ! సీతాపతీ! రమ్యతేజ!
పూర్ణచంద్రాస్య! సొంపులుగుల్కు జలధర
కోమలదేహ! అక్రూరవరద!
రవివంశభూషణా! రమ్య చరిత్ర! శృం
గారలోల! ముకుంద! కాంతసీత
స్తనయుగ్మమందు రత్నప్రభల్ చిమ్మెడి
మణిహార పంక్తుల మధ్య నీవు

గీ॥ రామ! వెలుగొందుచున్నావు రమ్యఫణితి
నీదు శృంగారచేష్ట వర్ణింపఁదరమె!
జానకీనాథ! రఘువరా! సరసిజాక్ష!
సంస్తుతించెద; దుఃఖముల్ సంహరింపు. ౩౭

సీ॥ అవనిజాస్తన కుంకుమాంకితంబై నట్టి
గొప్ప వక్షస్థలి మొప్పె నీకు
వందారు మందార! బృందారకస్తుత!
సుందర శుభగాత్ర! శుభ్రతేజ!
జానకీప్రియ! ఘనచ్ఛాయ నీలశరీర!
భూషణ తతులచే మోదమంది
వామభాగంబున - భూమిపుత్రిక, కూరు
చుండంగ, ముదమున నొప్పినావు;

గీ॥ ఉపనిషత్తులెప్డు డుజ్జ్వలంబుగ నిన్ను
స్తోత్ర మొనరసల్పు - శుభ్ర తేజ!
నీదు సామ్యమెవరు నిక్కంబుగా లేరు
నీదు సేవసేతు - నీరజాక్ష! ౩౮

సీ॥ అవనిజాస్తన కలశాలింగనంబున
మోదంబునొందుచు మురియువాఁడు
పూర్ణ చంద్రునిబోలు, ముద్దు మోమునుగల్గి
క్షీరాబ్ధి శయనుఁడై వెలుగువాఁడు
హారపంక్తులతోడ నలరారి, చిఱునవ్వు
జిలుకుచు నానంద మొలుకువాఁడు
రఘువరా ! పద్మాక్ష ! రమ్యమేఘ శరీర !
శ్రీరామచంద్ర! పక్షీంద్ర గమన !

గీ॥ భక్త చింతామణీ ! రాఘవా ! ముకుంద !
శ్రీశ ! సీతాపతీ ! నరసింహరూప !
నా మనోవీథి వసియించి రామ ! నన్ను
రక్షసేయుము ; భజియింతు రక్తితోడ. ౩౯

సీ॥ సురనుతిపాత్ర ! సుందరమేఘ సమగాత్ర !
బ్రాహ్మణ వంశ సంరక్షకుండ !
లోకపాలక ! బుధలోక మోదిత గుణ
చారిత్ర ! శ్రీరామ ! చారునేత్ర !
ఆదినారాయణా ! అఖిలవిద్యాస్థాన !
వైదేహిరమణ ! శ్రీ వాసుదేవ !
నిఖిలాయుధములందు - నేర్పరి యైనావు
వర్ధిష్ణుఁడై, నీవు వఱలినావు

గీ॥ సీత బంగారు బొట్టుగాఁ జెలగుచుండ
మెఱపు ప్రతగల వజ్రముల్ - మేనఁదాల్చి
దివ్య శృంగార రసికుఁడై - నీరజాక్ష !
పరగుచున్నావు; శ్రీరామ! వందనములు ౪౦

సీ॥ రఘుపతీ ! శ్రీరామ ! రావణ మర్దనా !
రత్నాకరనివాస ! రమ్యహృదయ !

రణజిత దశకంఠ ! రాజీవలోచన!
　　　　కోటి భాస్కరతేజ ! కువలయేశ !
నీలమేఘశ్యామ ! నిత్యవిజయకామ !
　　　　వ్యాపకభావ ! శౌర్యప్రతాప !
రత్న భూషణదేహ ! నూత్న కాంతి విలాస
　　　　శ్రీపతీ ! భూపతీ ! చిద్విలాస !

గీ॥ సీత వశవర్తి యైనావు ; శ్రీ రమేశ !
ఇంక మా కేమి కొదువ ? శ్రీ పంకజాక్ష
భక్తి భజియింతు నెప్పుడు పరమపురుష !
చిరశుభాకార ! నిత్యలక్ష్మీ విహార! ౪౧

సీ॥ తాటక మర్దించి, తపసి యజ్ఞము గాచి
　　　　ముక్కంటి ధనువును జక్క విఱచి
దేవతా హితకాంక్ష - దివ్య దశావతా
　　　　రంబులఁ దాల్చి, శ్రీరామచంద్ర !
దుష్టసంహరణంబు - శిష్టరక్షణము, స
　　　　ల్పినయట్టి జగజెట్టి - యనఘమూర్తి
పాదధూళి నహల్య పాపంబుఁ బోకార్చి
　　　　మంగళరూపుఁడై - మహిమఁ జెంది

గీ॥ గొప్ప బలము గల్గి - కోదండమును దాల్చి
రాక్షసాళి నెల్ల - లయమొనర్చి
మునుల సాధుజనుల - ఘనముగ రక్షించి
బరగినావు ; రామ ! వందనములు, ౪౨

గీ॥ నీలగాత్రుండ ; రాజీవ నేత్రయుగళ !
రామచంద్ర ! రఘుశ్రేష్ఠ ! రామభద్ర !
పూర్ణచంద్రాస్య ! సౌందర్య భూషణుండ !
ప్రీతి పెంపార, నాకుఁ జేయూతనిమ్ము. ౪౩

సీ॥ నిక్కుటద్దముబోలు - చెక్కుటద్దముగలవాఁడు
పద్మ ముఖుండయి, పలుకువాఁడు
గజతుండముల వంటి - భుజదండములవాఁడు
గుణ సమూహమునకుఁ గోవిదుండు
అధిక తేజస్సున కగ్నికుండమువాఁడు
తీక్ష్ణరూపుండైన ధీరగుణుడు
ముల్లోకముల యొక్క - మ్రొక్కు లందినవాడు
అరుల రూపడగించి, యలరువాఁడు

గీ॥ రామచంద్రుండు నా మనోరాజ్యమందు
స్థిరనివాసంబుఁ జేకొని, చిత్తశుద్ధి
నిర్మలంబుగ నాకిచ్చి నెగడుగాక।
యతని భజియించి, సేవింతు ననుదినంబు. ౪౪

సీ॥ కోదండమును, నీ భుజాదండమునఁబట్టి
శత్రుల ఛేదించు సమయమందు
భూధూళి నీ దేహమునుగ్రమ్మె; రణరంగ
మల్లకల్లోలమై - యావహించె
శ్రీరామ। ఇంద్రాది బృందారకులు నిన్ను
బొగడంగ వర్షించెఁ బూలవాన
మలిన దేహముమీద మందార పుష్పముల్
వర్షింప నీ లాభ్ర పథమునందు

ఆ॥ చుక్కలట్లుతోచె; సుందరాకార। గ
గన, సదృశ శరీర। కమలనయన।
బలముగల్గి శత్రు భంజన మొనరించి
నావు; రామభద్ర। కావుమయ్య। ౪౫

సీ॥ శ్రీరామ మంత్రంబు చెవుల కామోదంబు
సేవ్యంబు భాగ్యంబు; శ్రీకరంబు

శ్రీరామ మంత్రంబు శ్రీ మోక్ష నిలయంబు
దురితాళి సంహార కరము నిజము
శ్రీరామ మంత్రింబు క్షేమంకరంబు, సం
సార మహావార్ధి తారణంబు
శ్రీరామ మంత్రంబు శ్రేష్ఠసుజ్ఞానంబు
మాన్యంబు దివ్యంబు మంగళంబు

గీ॥ శ్రీశుభంబు పూజ్య శ్రీరామ మంత్రంబు
మనుజ దివిజ తతుల మంతనంబు
భవ్యరామ మంత్ర పఠనంబు సతతంబు
సలుప వలయుగాదె జనములకును ౪౬

సీ॥ జనకజాముఖ పద్మ - ఘనమధువానెడి
మత్త భృంగంబ నీవు - మాన్యచరిత।
రాజులనెల్లర - రణమందు గెల్చి, నె
య్యంబుఁజే కొన్న, రాజాధిరాజ।
పాపాంధ కారంబుఁ బాఱఁద్రోలగ, సూర్య
భగవానుఁడైనట్టి - పాపరహిత।
ఆజాను బాహుఁడై - యరవింద నేత్రుఁడై
శ్రీ శుభాంగము తోడఁజెలఁగువాఁడ।

గీ॥ జానకీ నాథ। శ్రీరామ! సదయ హృదయ।
మౌని మానస హంసమా। మాదు నిత్య
చింతలన్బాపి రక్షింపు శ్రీవిలాస!
రమ్యగుణధామ। శ్రీ రఘురామచంద్ర! ౪౭

గీ॥ ఒక్కచేత బాణంబు, వేఱొక్కచేత
ధనువుదాల్చియు శ్రీ జటాధారివగుచు
సోదరుని తోడ, భార్యతో మోదమలర
దిరుగు శ్రీరామ! జోహారు! పరమపురుష ౪౮

గీ॥ చారు గుణసాంద్ర! శ్రీరామచంద్ర! నిన్ను
గాంచ రావణాసురు, ముఖ కమల మడఁగు
జానకీ నేత్రకుముదముల్ సంతసించు ;
సకల జీవచకోరంబు సహజముగను
చెందు నానందమో రామ ! శ్రీశుభాంగ !
నాదు మనమున విహరింపు మాదరమున ౪౯

గీ॥ రమ్యవేష, సునేత్ర, పురాణపురుష
జానకీనాథు, జగముల శౌర్యధీరు ;
నఖిల చక్రవర్తుల మకుటాళి, చేత
వంద్యమౌ పాదపద్మ, శ్రీ వరు నుతింతు. ౫౦

గీ॥ రాజ సింహాసనస్థుని, రత్నములను
భాసిలెడు పాదకమలు, సీతాసమేతు,
దేవతాసేవ్యు, శశిసూర్య దివ్య నేత్రు,
రామచంద్రుని, రఘురాము, రక్తిఁగొలుతు. ౫౧

గీ॥ వరవిశాలాక్షు, రాక్షస వంశనాశు
శిష్ట జనసౌమ్యు, సుగ్రీవు నిష్టసఖుని
ఘనుని, వేదాశ్రయాంగుని, దనుజనాశు
రామచంద్రుని, రఘురాము రక్తిఁదలతు. ౫౨

గీ॥ వరదుఁ బద్మాసనస్థుని, భక్తజనుల
పారిజాతంబును, ప్రసన్ను, భానువంశ
తిలకు, రాజాధిరాజుఁ గీర్తిప్రకీర్ణు
రామచంద్రుని సేవింతు ప్రేమ తోడ. ౫౩

సీ॥ విద్యాధరులు నిన్ను - వినుతించు చున్నారు
సేవించు చున్నారు దేవతాళి

గంధర్వులెల్ల నీగానమొనర్తురు
పుణ్యస్వరూపుఁడౌ - భూరితేజ!
అద్వైతమానంద మవ్యక్త రూపముల్
పురుషోత్తమా! నిన్నుఁబొంది యుండు
కడగంటి చూపులఁ గమల, ముదముతోడ
నినుఁగాంచుచున్నది నీరజాక్ష!

గీ॥ రామ! పద్మాసనమున, విరాజిలెదవు;
ఆది మధ్యాంతములులేని యచ్యుతా! ము
కుంద! నినుఁజింత సేయ, మాకుఁదరంబె?
రక్షసేయుము సతము శ్రీరామ చంద్ర! ౫౪-౫౫

గీ॥ మకర కుండల సద్భూషు - మందహాసు,
జగతిమిత్రు, నిందీవరశ్యాము, పీత
వస్త్రధారు, భూషితదేహు, భాసమాను
రామచంద్రుని, రఘురాము, రక్తిగొలుతు ౫౬

గీ॥ పరగఁ గోదండమును దాల్చి, యరులనెల్ల
భుజ పరాక్రమోద్ధతి, రణభూమియందు
నేల మట్టంబు గానించి నెగడు చుండు
రామ! శౌర్యధైర్యోపేత! రామచంద్ర!
చారు కుండల కర్ణ! డిండీరహాస!
ధరణినాథేంద్ర! ధీర! వేదండయాన!
రాఘవా! రామభద్ర! ప్రహ్లాదవరద
నిన్ను భజియించి సేవింతు; సన్నుతాంగ! ౫౭

సీ॥ హరిహయస్వాంత మం - దావిర్భవంబాయె
ఘోర భయంబొందు - తోరముగను
సప్తలోకములందు - శబ్దంబు వ్యాపించి
వణకు పుట్టించె నవ్యాజముగను

సప్త సముద్రముల్ - స్తంభించె; పాతాళ
లోక నివాసులు - వ్యాకులమున
గలఁగఁజొచ్చిరి; సప్త కుల పర్వతంబులు
కదలి, యల్లాడె, నక్కజముగాగ

గీ॥ రామ! నీ బాహు బలమున - బ్రద్దలైన
హరుని కోదండమునఁబుట్టినట్టి, తీక్ష్ణ
మైన, శబ్దంబుచే, వింతలైన వింత
లుదయమయ్యెను; శ్రీరామ! సదయగనుమ! ౩౮

సీ॥ బ్రహ్మాండ ఖాండంబు - బ్రద్దలై పోయెను
ఖండంబులై పోయె గగనవీధి
ఆదిశేషుఁడు, భయమంది, వడంకెను
అల్ల కల్లోలమై యాడె వనధి
దిక్పతుల్ క్షోభించి - దిశలను వీడిరి
కుల పర్వతంబులు గ్రుంగె భువిని
చుక్కలన్నియు రాలెఁ జూర్ణ చూర్ణంబులై
గ్రహము లన్నియుఁదమ గతులఁదప్పె

గీ॥ శ్రీరమేశ! నీవింటిదౌ - నారియొక్క
ధ్వని. దశదిశలక్షానిండి, విధ్వంసకాండ
జరిపెనీరీతి; శ్రీరామచంద్ర! శాంత
మూర్తిని, ధరించి, కావుమా - భువనములను ౩౯

గీ॥ సత్యమూర్తివి! చండప్రచండమైన
నిండు కోదండమును దాల్చి - నిత్యజయము
గొన్నవాఁడవు; భూమాత పున్నెమెంతొ
పుణ్య రామావతారంబు బొందినావు;
ఇంద్రుఁడాది, దేవతలతో - నెపుడు సేవ
గొనుచునున్నావు! రామ! మాకొలము దైవ

తమవునీవ ! నీ ధ్యానంబె - తపసు మాకు
దండములఁ గొనుమయ్య ! కోదండపాణి ! ౬౦

సీ|| మందారముల తోటయందుండు, చంద్రకాం
తగృహంబు; దాని యంతరమునందు
బంగారు పీఠంబు - రంగారు; దానిపై
సీతాసమేతుఁడై - శ్రీశుభాంగ
కూర్చున్నవాఁడవు; కొలువగా భరత, ల
క్ష్మణులు, మారుతియును - మమతతోడ
ఇందీవరశ్యామ ! ఇనకుల భూషణా !
శ్రీరామచంద్రుఁడా - శేషశాయి !

గీ|| నీరదశ్యామ ! రఘువరా ! నిత్యమంద
హాస భూషిత వదన ! జోహారునీకు
నాదు తాపత్రయంబు, బోనాడఁజేసి
చిత్తశాంతిఁజేకూర్చుమా ! శ్రీరమేశ ! ౬౧

సీ|| రత్నకంకణ హస్త ! రామచంద్రప్రభూ !
మందార వనములో, సుందరాంగి
భూజాత యొడలిపై - పులకాంకురము లంకు
రింప, నామెను కౌగిలించినావు
మణిపాదుకాద్యుతి మహిమతో, నీ పాద
నఖములు గాంతితో నాట్యమాడె
నట్టి పాదములతో - యానంద రూపుఁడై
సంచారమును సల్పు సార్వభౌమ !

గీ|| రామచంద్ర ! దయాసాంద్ర ! రక్తితోడ
దర్శనంబిమ్ము ; శ్రీవాక్సుధారసమ్ము
కొంత నాపైనఁజిల్కుము ! శాంతమిమ్ము ;
అచ్యుతానంద ! శ్రీరామ ! హరి ! ముకుంద ! ౬౨

సీ॥ సీతా కుచద్వంద్వ సీమలో శ్రీరామ!
  సతము, నీహస్తముల్ - సంచరించు,
భూజాత ముఖపద్మమును, నీదు కెమ్మోవి
  భృంగంబు తమిని - చుంబించుచుండు
కంకణ ధ్వనులతో - 'నోంకార' శబ్దంబు
  హెచ్చు ప్రతిధ్వని నిచ్చుచుండు,
రామచంద్రుండ! శరత్కాల చంద్రిక
  బురుడించు నీనవ్వు పుణ్యపురుష!

గీ॥ రామ! తారక మంత్రమై - రక్తితోడఁ
జెలఁగె నీ ముద్దు నామంబు; చిత్త శుద్ధి
నిన్ను సేవించు భక్తుల కెన్నడేని
భయము గల్గునె? శ్రీరామ! భద్రమూర్తి! ౬౩

సీ॥ భరత శత్రుఘ్నులు - భక్తితో సేవింప
  లక్ష్మణుండు, గరంబు రక్తిఁ గొలువ
నీల, నలాంగదుల్ - నిష్ఠ మ్రొక్కుచు నుండ
  రావణానుజుఁడు, గరములు మోడ్వ
సుగ్రీవుఁ డనయంబు - జోహారు లర్పింప
  శ్రీ భరద్వాజు లాశీర్వదింప
గాధేయుఁడు, వశిష్ఠ గౌతమ మునివరుల్
  నిను సదా ప్రార్థింప - నెమ్మితోడ

గీ॥ రామ! సీతాసమేతుఁడై - రక్తి చెలఁగ
అమర సామ్రాజ్య పీఠస్థుఁడైన తరుణ
మందు, నన్నొకింతగఁ జిత్తమందుఁ దలఁచి
ననుఁ గృతార్థుని సల్పుమా - నాగశయన! ౬౪

సీ॥ ఛత్రచామరములు - సౌమిత్రి సోదరుల్
  బట్టి, శుశ్రూషలు - భక్తి సలుప

సామీరియును, విభీషణుఁడు, సుగ్రీవ న
　　　　లాంగదాదులు, సేవ లందజేయ
డా తొడపైనున్న - సీతా మహాదేవి
　　　　గౌరవించుచు, సహకార మొసఁగి
జ్ఞానముద్రికను, హస్తంబునఁ దరియించి
　　　　పరతత్త్వ బోధల బరగఁదెల్పి

గీ॥ నవ్య సామ్రాజ్య సింహాసనమున, ముదము
తెలఁగ వసియించి యున్నావు; శ్రీ సమేత!
వరద! శ్రీరామచంద్ర! నాపైయొకింత
కరుణఁగల్గి రక్షింపుము; శరణు! శరణు 　ఓ౨

సీ॥ ప్రియులగు చెలికాండ్ర వేడుకఁగూడుచు
　　　　బాల్యంబు గడపిన వాఁడ వీవు
పూర్ణ చంద్రుని వంటి ముద్దుమోమును గల్గి
　　　　పీతాంబరంబును ప్రీతిఁదాల్చి
నీల మేఘశ్యామ! నిఖిల చరాచరం
　　　　బులకు, గురుండవై - ముద్దుగాగ
సోదరుల్ భృత్యులై - సుఖముగా నీసేవ
　　　　సలుపు చుండంగ, నాజాను బాహు

గీ॥ యుగళ మొప్పఁగ శ్రీరామ! నిగమవినుత
వెలయు చున్నావు భక్తి సేవింతు నిన్ను
పాప సంసార భయముల బాయఁజేసి!
చిత్త శాంతి నొసంగుమా! శ్రీనివాస!

సీ॥ జానకీ మానస సరసిజంబునకు,
　　　　ద్యోతుఁడై గ్రాలితి [illegible] వాతతముగ
రత్న దీపములచే - రంజితంబై [illegible] N.
　　　　శీ గృహంబున నీవు లీలతోడ

పరిమళ పుష్పసంభరితమౌ పాన్పుపై
 శయనించి భార్యతో సౌఖ్యమంది
రఘువంశజలనిధి - రత్నమై శ్రీ రామ!
 సుపరిశోభముతోడ - సుందరాంగ!

గీ॥ వెలయు చున్నావు; రఘుపతీ! విష్ణురూప!
చిన్మయానంద! గోవింద! శ్రీముకుంద!
నిన్ను సేవింతు. భజియింతు, నిర్మలాత్మ!
నన్ను రక్షింపుమయ్య! సంపన్న చరిత! ౬౭

సీ॥ వారిధి బంధించి - వనచరులను గూడి
 లంకాపురముఁజొచ్చి శంకలేక
కుంభ కర్ణాదులఁ గూల్చి, రాక్షసులను
 నేల పట్టమొనర్చి, నిగమవినుత
రావణుఁబరిమార్చి యావిభీషణుని, లం
 కా రాజ్యమునసనిల్పి, కాంత సీత
తోఁబుష్పకమునెక్కి, తోషంబుతోడ, న
 యోధ్యను పేంచేసి యోగి వినుత!

గీ॥ రామ! భూరాజ్యము వహించి, సేమముగను
ప్రజలఁ బాలించి నావు, సంబరముతోడ
నిన్నుఁ బ్రార్థించి సేవింతు. సన్నుతాంగ!
చిన్మయానందమొసఁగుమా శ్రీరమేశ! ౬౮

గీ॥ రత్న కుండల కాంతిచే - రమ్యమైన
గండ భాగముల్ గల్గి, కోదండరామ!
నుదుటఁగస్తూరి బొట్టు సంపదను దాల్చి
విమల, కర్ణాంత దీర్ఘ నేత్రములతోడ
సొగసు గుల్కెడి శ్రీరామ! సుందరాంగ!
వరద! కరుణా కటాక్షముల్ ప్రసరజేసి
నాహృదయమందు వసియించి నాగశయన!
నిత్య సంతోష మొసఁగుమా నీరజాక్ష! ౬౯

సీ॥ శివ ధనుర్భంగంబుఁ జేసిన వాఁడవు
నిఖిల రాజులు నిన్ను నెమ్మిఁజేరి
మణికిరీటములచే - మానితంబైనట్టి
శీర్ష భాగములతో - హర్షమలర
నిను మ్రొక్కుచున్నారు నీరజ లోచనా!
ఇనకులదీపకా! ఇందిరేశ!
లాలితంబైన, కల్యాణ లీలోత్సవ
ములచేత సతతంబు ముదము తోడ

గీ॥ వెలఁగుచున్నావు సీతతో శ్రీశుభాంగ!
గొప్ప వైభవ మూర్తివై - కొమరు మీఱి
యున్న వాఁడవు - భజియింతు, సన్నుతింతు.
చిత్త శాంతి నొసంగి రక్షింపుమభవ. ౨౦

మెఱుపు కరణిఁ బ్రకాశించు, మేటి మకర
కుండలములచే, శోభిల్లు - గండభాగ
ములఁ బ్రకాశించు శ్రీరామ! ముద్దుగులుకు
రతన మకుటంబుచేత, విరాజమాను
డగుచుఁ బీతాంబరముఁ దాల్చి. నిగమవినుత!
జలద నీలశరీర! శ్రీ జానకీ, మ
నోహరా! గొప్పశాంతితో, మోహనుండ
వగుచు నున్నావు; సేవింతు నభయమిమ్ము. ౨౧

పద్మ దళనేత్రములవాఁడు, భద్రమూర్తి
చాపహస్తుండు, చారు హాసంబు వాఁడు
నీల నీరద రూపుండు, నిర్మలుండు
జానకీ ప్రాణనాథుండు, కాననముల
సంచరించిన ధీరుండు, సాహసము, ప
రాక్రమము గల్గువాఁడు శ్రీరామ చంద్ర

మూర్తి; సౌందర్యగాత్రుండు, ముదము చెలఁగ
మన్మనో వీధి విహరించి - మనుచుగాత! ౬౨

సీ॥ భూభారమును, మాన్పగా, భక్తియుక్తులై
దేవతల్ నిన్నుఁ బ్రార్థింప, సూర్య
వంశంబునఁ బుట్టి - వర్ధిల్లి నాఁడవు
మాయా మనుష్యుఁడై, మహిమతోడ
రాక్షసులను ద్రుంచి, రామచంద్రా! నీవు
జనముల పాపముల్ - సంహరించి
బ్రహ్మస్వరూపంబు బడసిన వాఁడవు
స్థిరమైన సత్కీర్తిఁ జెందినావు

గీ॥ జానకీనాథ! కెందమ్మి చంద చొప్పు
చరణ యుగములు గల్గిన - సార్వభౌమ!
నిన్ను సేవింతు, భజియింతు నిష్ఠతోడ
నన్ను రక్షింపు మభవ! సంపన్న చరిత! ౬౩

సీ॥ మా కాశ్రయుండవై - మాయాశ్రయుండవై
మాయఁ బోనడచెడు - మహితుఁడీవు;
ఉద్భవంబు, స్థితి లయోత్పాతములకెల్ల
గారణ భూతుఁడై గ్రాలు దీవు;
ఆనంద సాంద్రుఁడై - యమలుఁడై, జ్ఞానస్వ
రూపుఁడై - వెలుగొందు రూపు దీవు!
తత్త్వవిదుఁడయి సీతా మనోనాథుఁడై
అద్వితీయుండయి - యలరు దీవు!

గీ॥ రామచంద్ర! నీవె! రక్షకుండైనావు
నిన్నునమ్మినట్టి - నిర్మలులకు
భయములేదు, రాగ బంధము గనరాదు
అభయమిచ్చి, ప్రోవుమయ్య! వరద! ౬౪

సీ॥ కోటిభాస్కరతేజ। కువలయాలంకార।
రత్నకుండల ధారి। రామచంద్ర।
కీర్తిలక్ష్మికినీవు - మూర్తిస్వరూపుఁడ్తై
అభయ మొసఁగునట్టి యాదిదేవ !
అవతారమూర్తివి। రవివంశదీపకా।
ముక్తిఁజే కూర్చెడి శక్తి నీవె।
శిష్టుల రక్షించి, దుష్టుల శిక్షించు
రక్షామణివి నీవు రామచంద్ర।

గీ॥ శ్రీ శుభాంగ! వరద। చిన్మయ। రఘురామ
అచ్యుతా। ముకుంద। హరి। మురారి।
సారసాక్ష! జానకీరమణా! నీదు
స్మరణ నాకొసంగుమా - సతంబు ౭౫

సీ॥ మానస భృంగమా। మందార సుమములో
మకరంద రసమొండె ప్రకటితంబు;
దాన, నేమి ఫలము? ధర్మార్థ కామమో
క్షములనెడు, పురుషార్థములు నాల్గు
రసములు శ్రీరాము - ల, సదంఘ్రి కమల, యు
గ్మమునందు రోయిల్లు। మధుపమా? చ
పలమేల? శ్రీరామ పాద పద్మంబుల
జేరి, మధువు మనసార గ్రోల్లు

గీ॥ మా। విచారమేల। మానస దుఃఖంబు
లడఁగు। ముదముగల్గు వెదరు మాను;
భృంగ జన్మమదితరించు। నిక్కంబిద్ది
మనర। వేరు తలప జనదు నీకు. ౭౬

సీ॥ రాముండు సతతంబు రక్షించు, శత్రుభ
యంబును బోనాడి యధికరక్తి

రాముని ధ్యానింతు; రామునిచే గొప్ప
యజ్ఞాన తిమిర సంహరణమాయె
రామునికై, యహరహము నేఁగాంక్షింతు
రామునికంటె, పరంబులేదు
రామునకు నమస్సు భక్తితో జేయుదు
రాముని యందు విశ్రాంతి నాకు

గీ॥ ఓయి! శ్రీరామ! వేగరావోయి! నీదు
ముద్దు నెమ్మోము జూడంగ ముదముగల్గె;
నీ చరణ సేవనాకిమ్ము; నీరజాక్ష!
జానకీనాథ! శ్రీరామ! జాగు వలదు.

గీ॥ నల్ల కలువఁబోలు - నలుపు దేహమువాఁడు
కమల లోచనుండు - కమల హితుఁడు
భక్తినొక్కమాఱు ప్రార్థించినఁ జాలు
రక్ష సేయఁగల్గు రాఘవుండు.

గీ॥ జ్యా వినాదమింత శ్రవణ గోచరమైన
జాలు, రాక్షసాళి సమయుచుండు
నట్టి చాప మూనినట్టి, శ్రీరఘురాము
నాశ్రయింతు సతము నధికభక్తి.

సీ॥ దివ్యధనువు చేతఁ దేజస్స్వరూపుఁడై
భుజబలంబున, రౌద్రము, గనబఱచి
భ్రూకుటిలాస్యుఁడై - రోష కషాయిత
నేత్రుఁడై, సిద్ధ తూణీరమందు
నిర్విరామంబుగా - నిగనిగల్ మెఱయుచు
వచ్చు బాణంబులఁబట్టి, శత్రు
నివహంబు మర్దించి, రవివంశ తిలకమా!
దశకంఠుఁద్రుంచిన దాశరథివి!

గీ॥ వీర లక్ష్మీమనోహరాకార ! శూర !
ఇంద్రుఁడెప్పుడు నిను, స్తుతి యించుచుండు
వీరరాఘవ ! శ్రీపతీ ! వినుతిసేతు
రక్షసలుపుము ; శ్రీరామ రాఘ వేంద్ర ! ౭౯

సీ॥ త్రిభువన శత్రువై - తిరిగిన రావణు
దెగటార్చి, శ్రీరామ ! ధీసమేత !
వామహస్తమునఁ జాపము, భూమిపై నిల్వ
బాణంబుఁ గుడిచేతఁబట్టి, త్రిప్పు
చున్నావు - ముదముతో నున్నావు ; నీ కన్ను
లెఱుపుకాంతి వహించె నిందిరేశ !
కాయంబు నందెన్నొ - గాయముల్ గన్పడె,
కోటి భాస్కర తేజ ! కువలయేశ !

గీ॥ వీరలక్ష్మీమనోహరాకార ! శూర !
ఇంద్రుడెప్పుడు నినుస్తుతియించు చుండు
వీరరాఘవ ! శ్రీ పతీ ! వినుతిసేతు ;
రక్షసలుపుము ; శ్రీరామ ! రాఘవేశ ! ౮౦

సీ॥ శస్త్రాస్త్రముల తోడ సన్నద్ధుఁడై, వీర
వానరావళి కెల్ల భయముగొల్పి
క్రోధస్వరూపుఁడై - రూక్షవీక్షణములు
నిప్పులు గురియంగ నేలమీద
నట్టహాసము తోడ నరుదెంచు, కుంభక
ర్ణుని, నేక బాణంబునను వధించి
సుర, కపిసంఘంబు శోభిల్ల, ముదముతో
మునులు నిన్బూజింప ముద్దుగాగ

గీ॥ వీరరాఘవ ! శ్రీ పతీ ! వెలసినావు
వీరలక్ష్మీ మనోహరాకార ! శూర !

ఇంద్రుఁడెప్పుడు నిన్ను స్తుతించుచుండు
రక్షసలుపుము, శ్రీరామ ! రాఘవేశ ! ౮౧

సీ॥ రాక్షసోన్నతుడయి - రూక్ష బాణాగ్నిచే
భీషణ మూర్తియై - వెలయువాఁడు
సేవకావళిచేత - సేవింప బడువాడు
ఘోర నాదము సేయు క్రూరుఁడెల్ల
దిక్పాలకాళి వేధించు కఠోరుండు
లంకాధినాథుండు - రావణుండు
శ్రీరామ ! నీ చేత శివసన్నిధిని జేరె
మిత్రాప్త బంధు సమేతుఁడగుచు

గీ॥ దిక్పతులు, భోగభాగ్యమందిరి; దివిజులు
నుతులు సల్పిరి; శ్రీపతీ! స్తుతినొనర్తు ;
వీరలక్ష్మి మనోహరాకార ! శూర !
రక్ష సలుపుము; శ్రీరామ ; రాఘవేశ ! ౮౨

సీ॥ కౌసల్య శ్రీమాత గర్భాబ్ధిలో నీవు
పూర్ణచంద్రుండవై - పొడమినావు
మౌనివి నిర్మల - మానసాంభోజముల్
వికసింప సూర్యుఁడై - వెలసినావు.
ధార్మిక గుణములో - ధర్మరాజును బోలి
ధర్మాత్ముఁడై నీవు - దనరి నావు
మారీచు, బాణాగ్నిచే రూపు మాపిన
శౌర్య ధనుండవు - సచ్చరిత్ర !

గీ॥ వీరలక్ష్మీమనోహరాకార ! శూర !
ఇంద్రుఁడెప్పుడు నినుఁ స్తుతియించుచుండు
వీరరాఘవ ! శ్రీ పతి ! వినుతిసేతు
రక్షసలుపుము ; శ్రీరామ ! రాఘవేశ ! ౮౩

గీ॥ దండకారణ్యమందు, కోదండరామ!
తిరిగి రాకాసి మూకల తీక్ష్ణ బాణ
తతుల సంహార మొనరించి - వెతల మాన్పి
నావు ; గజతుండములఁబోలి - చేవ గల్గి
నట్టి - నీభుజ దండము లట్టెగాంచి
శత్రువుల మూక - జడిసి నాశనముఁబొందె
వీరలక్ష్మీమనోహరాకార ! శూర !
శ్రీ పతీ! రామచంద్ర ! రక్షింపు మభవ! ౬౪

సీ॥ సుకుమారదేహులు - సుందరాకారులు
బల పరాక్రమములఁబరగువారు
పుండరీకంబులఁబోలు గన్నులవారు
శాంతులు ధర్మ విచారపరులు
ఫలమూల భోజనుల్ - వల్కలధారులు
తరుణులు, దైత్యమర్దనులు ఘనులు
వీరులు, శ్రీధనుర్ధారులు, దశరథ
పుత్రులు, సుగుణ పవిత్రులమర

గీ॥ సంస్తుతులు, వేదవేద్యులు - సారమతులు
మానసీయులు, రామలక్ష్మణులపూర్వ
సోదరులు, భక్తజనులకు శుభములొసఁగి
విజయు లగుదురు ; వారల వినుతిసేతు, ౬౫

సీ॥ పాపాటవిని, రూపుమాపెడి దహనంబు
పావనంబుల మేటి పావనంబు
ధర్మవృక్షమునకు ధరణిలో బీజంబు
జీవనంబులకెల్ల జీవనంబు
అఖిల శుభంబుల కాదికారణము, మో
క్షస్థానమును జూపు కలిమి బాట
పాంథావళికి దారి బత్తెంబు ; కవివరుల్
స్తుతియింపఁజాలెదు పతితమంత్ర

గీ॥ మరయ శ్రీరామ నామంబు దురితహరము
చింత సల్పెడువారికి శ్రీకరంబు
బుద్ధి మాంద్యంబుఁ బోగొట్టు శుద్ధిమంత్ర
మట్టి మంత్రంబుఁ బ్రార్థింతు నహరహంబు. రాగా

సీ॥ దశరథు ముఖపద్మ దళము విచ్చఁగఁజేయు
సప్తాశ్వమూర్తి ; కౌసల్యమాత
కలువ కన్నుల విప్పు చలువలఱేడు , శ్రీ
జానకీ మానస సరసునందు
విహరించు హంసంబు ; వినుత యశోమూర్తి
నేత్రపద్మంబుల నీటుకాఁడు
ఆజానుబాహుండు - సకలలోకంబుల
రక్షణ సలిపెడు దీక్షవాఁడు

గీ॥ దీనవత్సలుండు - దిక్కులేనట్టి వా
రలకు దిక్కు ; ప్రేమ గలుగువాఁడు
దశరథాత్మజుండు ధర్మాత్ముఁడనయంబు
మమ్ముఁ బ్రోచుగాత ; మమతతోడ. లా౭

సీ॥ సత్యంబుచే, లోకజాలముల్ వదునాల్గు,
దానంబుచే. దీనమానవులను,
చిత్తశుద్ధిగలట్టి - సేవచే గురువుల,
ధనువుచే, శత్రుల - ధాత్రి నీవు
ఇక్ష్వాకురామ ! జయించిన వాఁడవు ;
'రామ - రామ' యన్న - నామమొండె
భవబీజములనెల్ల - భర్జించి, సౌఖ్యంబు
లర్పించు, సంపదలర్థి నొసగు ;

గీ॥ రామ ! నీనామకీర్తన - రక్తిసలుపు
వారలకు యమదూతల - భయములేదు ;

మృత్యుభీతి తొలంగు; సమృద్ధి కలుగు
రామ! శ్రీరామ! రఘురామ! రామచంద్ర! రాగా

మం॥ అన్నకు మదిరోసి - యాశ్రయింపంగ
శ్రీ విభీషణుని, రక్షించితి వీవు!
శ్రీరామ! నీనామ చింతనంబందు
ఎట్టి సామర్థ్యంబు - గుట్టుగా గలదొ?
సర్వేశు డొక్కండు-శాంభవి యొకతె
బ్రహ్మదేవుఁ డొకండు - భారతియొకతె
వాల్మీకి యొకరుండు - వ్యాసుఁడొకండు
సద్భక్తుఁడొక్కండు - శబరి యొకర్తె
యెఱుఁగుదురో? లేదొ? యెఱిగి రెవ్వారు!
మొఱటు మానిసినేను - మొదలె యెఱుంగ
శ్రీరామ! రఘురామ! చిన్మయాకార!
రక్షించి కావవే - రఘుపతీ! రామ! రాగా

మం॥ కృత్య మీకార్య - మకృత్య మీ విధము
సత్య మియ్యదియు - యసత్యం బియ్యదియ
యను, వివేచన లేని - మనుజులు ధాత్రి
గలరు; గో శిశుహత్య లెలమిని, బ్రహ్మ
హత్యల జేతురు - హంతలై యొసఁగి
నిత్యంబు వారొక్క నిమిషమేనియును
ధ్యానించి నజాలు దద్దయుభక్తి
వారొనరించిన పాపజాలముల
పరిహరించెద వీవు! పద్మాక్ష! రామ!
మురహరీ! శ్రీరామ! మోక్షప్రదాత!
అత్యంత దుఃఖంబు - లణచి పై చెదపు;
తారకరామ! సత్యానందరూప!
సర్వ వేదంబుల - సారమై నీవు
వానిచే స్తోత్రముల్ - పడయుచున్నావు

సంపదలకు నెల్ల - స్థాన మైనావు;
నిర్మల మైనట్టి - నీనామ మెవఁడు
నిత్యంబు స్మరియించు - నిష్ఠ నాతనికి
మోక్ష సామ్రాజ్యంబు - మునుమున్నఁగల్గు ౬౦

సీ॥ సాకేత పురములో - స్వగృహంబునఁగల్ప
కముక్రింద, మిగుల శృంగార మైన
వేదికపై నీవు వెలసియున్నావు; ర
త్నవికారమైన పద్మంబు, నొక్క
కరమున ధరియించి, మఱియొక్క హస్తంబు
మోకాలిపై నుంచి, శ్రీ కరముగ
విద్యున్నిభశరీర ! విమల కమల హస్త !
సీత పార్శ్వంబునఁ జెలఁగుచుండ

గీ॥ నా మెఁగాంచుచు, పూర్ణచంద్రాస్యరామ !
ముద్దు మణి కిరీటముచేత - మఱసినావు ;
భజన సల్పెద సతతంబు భక్త వరద !
నాదు తాపత్రయంబుఁబోనాడు మభవ ! ౬౧

సీ॥ విద్యున్నిభాంగివి ! వికచ పరముఖివి,
విద్రుమోష్ఠి వమర వినుత వీవు !
ఫుల్లపద్మంబులఁ బోలు కన్నులతోడ
చారు నాసికను, యొప్పారెదీవు !
గజకుంభములను, ధిక్కారంబు సల్పెడు
పాలిండ్లు గల్గిన పడతి వీవు !
యజ్ఞవేదిక కినయగు, మధ్యమును గల్గి
స్త్రీ శిరోమణియయి, చెలఁగెదీవు !

గీ॥ శ్రితజనులకెల్ల వరములిచ్చెదవు నీవు !
సుందరంబైన చిఱునవ్వు జూపెదీవు !

జానకీదేవి! భూజాత! సరసిజాక్షి!
ధ్యాన మొనరింతుఁ బ్రోవగదమ్మ! నన్ను ౼౨

మం॥ శ్రీ గుణోపేత! ఆశ్రిత జనమాత!
సీత! మాణిక్యమంజీర పదార
విందముల్ మ్రోయ నానందంబు జిలుకు
సుందరి; భక్తులఁజూచి, దయార్ద్ర
దృష్టితో, వరములఁ దుష్టితో నొసఁగి
రక్షించు మాత - శ్రీరాముని కాంత
సేవించు చున్నాను, చిత్తశుద్ధిగను
రక్షింపు మమ్మరో! రాజీవనయన! ౼౩

గీ॥ జయము నొసఁగు వాఁడు - జానకీ మానస
మునకు ముదమొసంగు మోహనుండు
అర్కకుల విహారి - హాస ముఖమువాఁడు
రామచంద్రు డతనిఁ బ్రస్తుతింతు. ౼౪

గీ॥ దండకారణ్య సంచారి - దైత్యకుల, వి
నాశకారి, సంకటహారి - నాణ్యమైన
మణి, కిరీట ధారి, ప్రచండ మైన చాప
ధారి, రావణారి, సతంబుఁదలచుచుందు. ౼౪(అ)

గీ॥ చిత్తమందుండి, భక్తులు చింతసేయ
చింత లుడిపెడి ధీరుండు; శ్రీధరుండు
కామితములకుఁ గల్పవృక్షంబు; యూహ
సేయగా రానివాఁడు; మాసేమ మరయు
వాఁడు, శ్రీ మనోహర రూపుకాఁడు; లోక
ములను మోహింపఁజేసెడి ముద్దు వాఁడు
రామభద్రుండు సతతంబు రక్తితోడ
నరసి, రక్షించు నన్ను నహర్నిశంబు. ౼౫

సీ॥ సాకేత పురమందు - శరదిందు చంద్రికా
ధవళంబు మించు, సౌధంబు లోన
నగరు ధూపములచేఁ బొగలు నిండిన, మంట
పంబొండు చెలువారు డంబుమీఱి
కర్పూర దీప ప్రకాశ మానంబైన
యా మంటపములోన - నంగదుండు
సుగ్రీవుఁడు పవనజుఁడు, లక్ష్మణుఁడు, నిన్ను
సేవింప, శ్రీరామ! సీత తోడ

గీ॥ ముదియు చున్నావు! రఘుపతీ మోహనాంగ!
శ్యామలాకార! చింతింతు సతము నిన్ను
వరద! లీలా మనుజరూప! ప్రణుతి గొనుము
రక్ష సేయుము; రామచంద్రా ముకుంద! ౯౬

గీ॥ తండ్రి రాముండు, తల్లి కోదండధారి
ఇష్టమిత్రుండు, రాముండు, కష్టములను
బాపు చుట్టంబు రాముండు; భవ్య గురుడు
రామచంద్రుండు, దేవుండు రామవిభుఁడు
రామ! నిను దక్క నన్యుల నామములను
స్మరణ నొనరింప; కాపాడుమా - బిరాన ౯౭

గీ॥ ఎట్టి దయతోడ, మునుల, లాలించినావొ?
ఎట్టి కరుణతో, సుగ్రీవు నేలినావొ?
ఎట్టి పేర్మి, విభీషణు బట్టినావొ?
అట్టి కనికరమున బ్రోవు మధవ నన్ను.

గీ॥ ఓ! దయానిధి! రాఘవా! యోయి రామ!
నాదు పాపంబు లెల్లఁబోనాడఁ జేసి
రక్తి సేవింప, దృఢమైన భక్తి నిమ్ము;
దాస, నాయభీష్టము దీరు; దాసవారి! ౯౯

గీ॥ నిత్యుఁడక్షీణబాణ తూణీరుఁడెక్కు-
వెట్టఁబడినట్టి ధనువు జేఁబట్టువాఁడు
రావణాంతకుఁ డర్క కులావతంసు
డనఘుఁడా రామచంద్రుఁ డాతనిఁదలంతు;
నతఁడె నాతల్లి దండ్రి సుమ్మతఁడె, స్నేహి
తుండు, జుట్టంబు నతఁడె, యతండెగురువు,
గోష్ఠియు నతండె। యాతని కూర్మితోడ
బ్రార్థన మొనర్తు; సతతంబు భక్తి తోడ.

గీ॥ మేఘ గంభీర శబ్దంబు మేటిగాగ
వచ్చు కోదండమును బూని వాయువేగ
ధాటి మించెడు నట్టి యస్త్రంబు దొడిగి
రాక్షసశ్రేష్ఠులను జంపి రణమునందు
సాధు జనముల కభయప్రసాద మొసఁగి
సానుజుండయి శ్రీరామ! సకల భూత
కోటి రక్షించు చున్నావు; కువలయేశ।
ఇంక భయమేమి నాకు? శ్రీ యినకులేశ। ౧౦౧

సీ॥ కౌసల్య గర్భముక్తాఫలంబై, నీవు
జన్మించి, దశరథ సార్వభౌము
దక్కఱ నినుఁబెంప - నవనిజయను, తీగ
నాలింగన మొనర్చి। లీలతోడ
శాఖోపశాఖలుగా - ఖగ మార్గంబు
నావరించి, పెఱిగినావు; కల్ప
తరువుగా, నీదు సోదరులే, మహాశాఖ
లై, దట్టముగ ఛాయ అందజేయ

గీ॥ రాక్షసుల వేడి తగ్గె; శ్రీరామచంద్ర!
కల్పకంబీవు; మాకోర్కె లల్పమనక

స్వాదురసముల నిండిన ఫలము లొసఁగి
నాల్కఁ(దుప్పుడు డుల్పవే ! నరవరేశ ! ౧౦౩

సీ॥ వేదాంతముల కెల్ల - విఖ్యాత రత్నంబు
జన నుతుండై నట్టి సార్వ భౌమ
రత్నంబు ! భూసుతా రత్నంబు; భువనైక
రత్నంబు ; రఘుకుల రత్న మరయ
భక్త కోటులకెల్ల పావన రత్నంబు
రాజులలో ముఖ్యరత్న మవని
శ్రీరామ రత్నమాశ్రితుల మందారంబు
జానకి మోదంబు - సమ్మతంబు

గీ॥ రామరత్న రహస్యంబు - రసికవరులు
భక్త జనము తెలియంగగా వలయుఁగాక
పరులెఱుంగ శక్యముకాదు భక్త వరద !
రామ రత్నమ ! నాకిమ్ము రతనమొండు. ౧౦౪

గీ॥ శ్రీ విశాలనేత్ర - సీతాకళత్ర ! కా
రుణ్య పాత్ర ! దివ్య పుణ్యగాత్ర !
త్రిజగతీపవిత్ర ! శ్రీరామ సన్మిత్ర !
దేవతారి జైత్ర ! సేవ గొనుమ ! ౧౦౫

సీ॥ ఆశ్రిత మందార ! ఆనంద సంచార !
అఖిల గుణోదార ! అప్రమేయ !
పుండరీకాక్ష ! కోదండ తూణీరముల్
ధరియించి నట్టి కంధర శరీర !
కల్యాణ గుణధామ ! కారుణ్యసీమ ! వి
ఖ్యాతనామ ! మునీంద్ర పూతనామ !
సీతాముఖాబ్జ సంజాత సుధాస్వాద
నమొనర్చు భృంగమైనావు ; రామ !

॥గీ॥ మాకుఁగొదువ కలదె? ప్రాకటశుభముల
నిమ్మభయము నిమ్మ; ఇందిరేశ
నీవె గతియటంచు - నిక్కంబుగా నమ్మి
నాము; రఘుకులేంద్ర! రామభద్ర! ౧౦౫

సీ॥ శ్రీ మహాబాహు, రఘువీరు, శ్రీ శుభాంగు
భద్ర దంతావళము నెక్కివచ్చు వరదు
రామ చంద్రు, ఛత్రావృత సోమ వదను
గనుల గానంగ వాంఛింతుఁ గఱపు దీఅ ౧౦౬

మం. శ్రీ రామచంద్ర! ఆశ్రితుల మందార!
కరుణాసముద్ర! భక్తజన - సుభద్ర!
భవబంధ నాశనా! ప్రహ్లాద వరద!
పన్నగశయన! ఆపన్న శరణ్య!
నాథ! రమానాథ! ననుఁ గరుణింపు
దీనుండ. నజ్ఞాన తిమిరంబు గప్పె;
భయములు గ్రమ్మె; నభయ మొసంగ గడు
వినయంబుచే నిన్ను వేడుచు నుందు. ౧౦౭

గీ॥ వసుధ నీ చరితామృతా స్వాదనంబు
పెక్కు సోమ పానములకు నిక్కువముగ
సాటి; యా సోమపానంబు జన్మదుఃఖ
భరము ఁజేకూర్చు; శ్రీరామభద్ర! నీదు
విమల నామామృతము గ్రోలు విబుధవరులు
జన్మదుఃఖంబు బడయరు సత్యమిద్ది;
అనఘ! రఘురామ! నీదు, నామామృతంబు
సతము నన్ గ్రోలఁ జేయుము; సత్యచరిత! ౧౦౮

గీ॥ శ్రీరామచంద్ర! దయాసాంద్ర! రావణాంత
కా! విభీషణ రక్షకా! కమలనయన!

జన్మజన్మంబు లందు నిన్ స్మరణ సల్పు
జ్ఞానమును భక్తి నాకిమ్ము ; మౌని వినుత ! ౧౦౯

మ॥ శ్రీరామచంద్ర ! రాజీవనయన ! ర
మాపతీ ! రాఘవా ! భూపాల తిలక !
రావణ సంహార ! రఘునాయకా ! ము
కుంద ! రక్షింపుము ; గోవింద ; వరద ! ౧౧౦

గీ॥ వేదము, లెఱుంగఁజాలవు; నీదు పాద
పద్మ ధూళి, రహస్యంబు - పావనాత్మ !
శ్రీరమానాథ ! రామ ! విరించి నీదు
నాభి పద్మంబునను బుట్టె - నాగశయన !
శివుడు నీనామసారంబు - జిహ్వాగ్రోలె
పద్మనేత్రుండ ; నీపాద పద్మధూళి
భక్తు లకుఁగొంత దయచేసి ప్రాపునొసఁగి
కరుణ రక్షింపు రఘురామ ! కంసహరణ ౧౧౧

గీ॥ బ్రహ్మలోకంబునందు, శ్రీరామచంద్ర !
అజుఁడు, నీయవతార కథామృతంబు
త్రాగుచుండు ; నీచరితంబు - రమణివాణి
సరస వీణాస్వరంబుల - చతురగతిని
బాడుచుండు; మహానంద - బాష్పకణ, ప
రంపరార్ద్రికుచాగ్రయై రామ ! నిన్ను
నారదాదులు స్తుతియింత్రు నాతెముగను
భవుడు నిన్స్మరియించు పార్వతినిగూడి
అట్టి శ్రీరామ ! భక్తిఁజేబట్టి నిన్ను
సతము ప్రార్థింతు రక్షింపు జలజ నయన ! ౧౧౨

సీ॥ పాపాత్ముఁడు, పరుల భాగ్యాపహారి, కు
లభ్రష్టుఁడితరుల లలన లందు

మగ్నచిత్తుఁడు, దొంగ, మాతృ పితృహంతుడును
　　బహ్మహత్య నొనర్చు, రాక్షసుఁడును
మౌనుల బాధించు - మనుజుండు, దుర్మార్గ
　　డాతతాయియు, మొదలైన వార
లెవ్వరేనియు, భక్తి యేపార సతత మీ
　　కర్ణామృతంబుఁ జక్కఁగఁబఠింప

గీ॥ గల్గిరేవి ముక్తికాంత సిద్ధంబగు,
మౌని జనుల కందరాని పదవి
ప్రాప్తియగును; భోగ భాగ్యంబు సిద్ధించు
ననఁగ భక్త జనుల కలతియగునె ? ౧౧౩

సీ॥ శివుని స్వరూపమై - చెన్నారు శంకర
　　స్వామి, గీర్వాణభాషను, లిఖించె
'రామ కర్ణామృత' రసకావ్య మాదిలో
　　నంతఁ జేకూరు వంశాబ్ధి వెలసి
నట్టి, సిద్ధ కవీశ్వరాహ్వయుం డనుపమ
　　శ్రద్ధఁ దెనింగించి రామచరిత
పూదండగాగ, సంపూర్ణ భక్తి ప్రేమ
　　నర్పించినాడు, నీ కతఁడు మున్ను

గీ॥ అతని పూదండ, కోదండ మర్పణంబు
చేసి, నాభక్తి తెలుఁగునఁ జిన్ని పూల
మాల నర్పించినాడ। రమావినోద!
త్రై కొనుము నాదు కానుక లోకనాథ। ౧౧౪

గీ॥ శ్రీరమాపతీ నాకిచ్చి చిత్త శుద్ధి
మూడవపరికరణము, సమ్మదము తోడ
నింపు సొంపుగ భక్తి వ్రాయించినాడు
నా జోహారుల నర్పింతు, మోజుతోడ. ౧౧౫

గీ॥ పుణ్యజనులార । భక్తాగ్ర గణ్యులార ।
రామ కర్ణామృతము, దినం బేమరకను

సుప్రభాత వేళలయందు, శుచిగ, రుచిగ
పఠన, మొనరింప శ్రీరామభద్రు డెపుడు
మంగళంబులు మీకిచ్చి, మమతఁబ్రోచు
మానసానంద మబ్బ, సంపదలు గలుగు. ౧౧౬

సీ॥ నాజ్యేష్ఠ పుత్రిక, జ్ఞానాంబ, సుజ్ఞాన
వరమతి, సంతాన వంతురాలు
రెండవ కూతురై యుండు, సరోజమ్మ
ముఁగురు బిడ్డల తల్లి ముద్ద రాలు
మూఁడవ కొమరిత - ముద్దుగా విజయమ్మ
బిడ్డ లిద్దరితోడ - వెలయుచుండు
జ్యేష్ఠకొమారుని, జ్యేష్ఠ పుత్రుఁడు, నాగ
రాజాతనికిఁగల్గె - రతనమునకు

గీ॥ సాటియగు ముద్దు సూనుండు - చందమామ
'కిరణబాబ'ని పిల్త్రు; సంబరముతోడ
ముని మనుమడు, జనించె; సమ్మదముజెలఁగ
రక్ష నొసగుము వీరికి రామచంద్ర। ౧౧౭

గీ॥ సంగ్రహముగాగ, వంశంపు చరిత వ్రాసి
నాడ; వంశవృక్షపుకథ, పిదకెల్ల
వారు వ్రాసిపెట్టిన. బంధువర్గమునకు
సంతసముకాదె? బుధుల హర్షంబు కాదె! ౧౧౮

మానిని: మునిజన, సువిచారా - మోక్ష లక్ష్మివిహారా।
ఇనకుల, పరితోషా - ఇందిరేశా! మహేశా।
దనుజ గణ వినాశా - ధాత్రిజా - చిత్త చోరా।
వినుతి గొనుము రామా - విశ్రుతానంద సోమా। ౧౧౯

## తృతీయాశ్వాసము

### గద్యము

ఇది, శ్రీమదఖిల కవిమిత్ర, వాగీశ్వరీ దయావిధేయ, (
చంద్ర, చరణారవింద సంసేవిత, శ్రీమత్కాశ్యపస
పవిత్ర, బడగనాటి, గూళూరు అశ్వత్థమాంబా
కృష్ణార్య, తనూభవ, కవిభూషణ, కవితిలక
బిరుదాన్వయ, కల్లూరు శ్రీ అహోబల
రాయ, ప్రణీతంబైన ఆంధ్ర
శ్రీరామ కర్ణామృతమను
పద్యకావ్యము, తృతీ
యాశ్వాసము
సంపూర్ణము

ఓం తత్సత్



# శ్రీ రామ కర్ణామృతము

చతుర్థాశ్వాసము

సీ॥ శ్రీ కుచకుంభ చర్చిత - చందనాలంకృ
తంబగు, వక్షస్థలంబుఁ గల్గి
బ్రహ్మాండ భాండమల్ పాలించు దశుండ
వంబుధి గర్వాపహారి వీవు।
ఆశ్రిత మునుల, ప్రత్యక్షకల్పక మీవు
బ్రహ్మయు, శివుడు, దేవతలు, నిన్ను
స్తుతియింప, శ్రీరామ। సుందరాకారుఁడై
పుట్టువు లేనట్టి జెట్టివీవు।

గీ॥ ముద్దు మోహన మూర్తియై - మరిసెదీవు।
దాత వీవు। కౌసల్య నందనుడ వీవు।
రామ। సుగుణాభిరామ। సీతామనోహ
రా! అభయమిచ్చి రక్షింపు; రామచంద్ర।

సీ॥ సాకేతపుర, మహాసౌధంబు లెల్లెడ
మణినిర్మితంబొక్క- మందిరాంత
రంబు, పతాకోజ్జ్వలంబందు, సూర్యకా
న్తి, చౌబదు; ఘణఘణ నిస్వనముల
బంగారు గంటలు రంగారు; డోలికా
శయ్యపై, శ్రీరామచంద్ర। నీవు
సీతాసమేతుఁడై - చెలువొందుచున్నావు
ముద్దులఁగూర్చెడి మోహనాంగ।

గీ॥ రఘుపతీ। నిన్ను భజియింత - నఘనుఁబాపి
పుణ్యకార్యంబు లొనగూర్చు బుద్ధినిచ్చి

కుమతుల, నెదుర్కొనియెదు, ధైర్యము, నొసంగి
కావుమా! రామచంద్ర! విఖ్యాత పురుష. ౨

సీ॥ సాకేతపుర మహాసౌధాంతరంబుల
రాజ మార్గంబుల, రమ్యముగను
ధ్వజ తోరణములు సంబరముగా వర్ధిల్లె
ఘంటల ధ్వనులు, బ్రికాశ పటుప
మందయానంబున, మదపు ఉనుగు వచ్చె
దానిపై, స్వర్ణ కుతంబు నందు
వస్త్రభూషణ, విభవంబుల, శృంగార
దేహుండై, శ్రీరామ! దివ్యముగను
అధివసించివి; శ్వేతాత పత్రిము క్రింద
రథ గజ తురగ సంరంభ మతుల
తీవితో, జయజయ రావముల్ సేయుచు
వెనువెంట వేంచేయ, విభవ గరిమ

గీ॥ వెలయ, నూరేగు చున్నావు విమలచరిత!
రమ్యగుణసాంద్ర! రఘువీర! రామచంద్రి!
అంతరంగంబు నందు నిజాజింతసేతు
నింపుగా, మమ్ము సతము రక్షింపు మభవ! ౩

సీ॥ బంగారు స్తంభముల్ - రంగారు సౌధంబు
తారాపథంబును దాకుచుండు
దివ్యాంబరములచే - నవ్యంబుగాగ, న
లంకృతమై, ప్రభలజా వెలార్చు
బహురత్నములచేత భాసిల్లి, సౌందర్య
నిధియయి, పైడివన్నియలఁ గూర్చు
చిత్రివిచిత్ర, పవిత్ర గృహంబందు
సీతాసమేతుఁడై, చెలువుగాగ

గీ॥ రఘుపతీ! నవ్వు ముఖముతో - రమ్యముగను
వెలయు చున్నావయోధ్యలో వేదవేద్య!
నిన్ను భజియింతు సతతంబు నీరజాక్ష! ౪
నన్ను రక్షింపు మభవ! సంపన్న చరిత!

సీ॥ శ్రీయయోధ్యపుర, మాశ్రితుల కల్పకము; శృం
గారంబు; మణి బహిర్ద్వారయుతము
తోరణాంచితము వీథులు; ప్రాంగణము లెల్ల
రమ్యంబు లందు, శ్రీరామ! నీవు
భరతాది సహచర వరులతో మెలఁగుచు
రత్నపు బంతుల రమ్యముగను
క్రీడలాడుచు, నున్నవాఁడవు; స్త్రీలకు
నేత్రోత్సవముల, పున్నెము లొసంగి

గీ॥ డెంద మానందమున నింపి - సుందరాంగ!
చిందుద్రొక్కుచున్నావు; ముకుంద! వరద!
మా మనములందుఁ గుందుల మాన్పుమభవ!
చిరతరానంద! గోవింద! శ్రీరమేశ! ౫

సీ॥ వైఢూర్య మణుల ప్రభా భాసమానమై
దేవేంద్ర నీలకాంతిని, వహించు
రత్నగృహంబొందు రంజిల్లు, సాకేత
పురమందు; మందార భూజములు,
శేషంబు, మాణిక్య సింహాసనం బాగృ
హంబున శోభిల్లు హనుమతోడ
మదన మోహనులైన - మన్మథ సుందరుల్
కుశలవుల్ శ్రీరామ కుతుక మలర

గీ॥ నీదు చరణసేవ, సాదరంబునఁ జేయు
చున్నవారు సతము సన్నుతాంగ!

రఘుపతీ ! ముకుంద ! రాఘవా ! భజియింతు
నభయ మిచ్చి కావుమయ్య వరద! ౬

సీ॥ కౌసల్యమాత, శ్రీ కస్తూరిబొట్టు నీ
ఫాల భాగమునందు లీల నునిచె
బున్నమ చంద్రుని బోలు ముద్దు మొగంబు
గల్గిన శ్రీరామ ! కనకరత్న
హారముల్ నీవు శృంగారంబుగా, ధరి
యించినాడవు ; హరీ ! ఇనకులేశ !
సీతాసమేతుఁడై - చెలఁగు చున్నావు ! కౌ
సల్య వరకుమార ! సాధుశీల !

గీ॥ నిన్నుఁ బొగడుటకును నేనెంతవాడను ?
పొగడికలకు నుబ్బిపోవు నీవు !
భక్తి కలుగుచోట, ప్రాపు నీవై యుండు
రక్ష సలుపుమభవ! - రామచంద్ర! ౭

సీ॥ పుల్ల పద్మంబులఁ బొలుపారు చుండును
నిర్మల జలముల నెగడుచుండు
గంగోదకంబులఁ గమనీయమై యుండు
'సరయువు' నది, దాని దరమెః పొగడ
దేవతాస్త్రీలెల్ల దివ్యంబుగా స్నాన
మాచరించెదరు, నా యంబువులను
ఆనీట జలకంబు లాడుచున్నావు ! శ్రీ
రామ ! సీతను గూడి ప్రేమ తోడ

గీ॥ దేవవనిత లెల్ల - దివ్యంబుగాఁ గాంచు
చున్న వారు మిమ్ము - సన్ను తింగ !
రామ ! భక్తవరద ! రామామనోహర !
అభయమిచ్చి కావుమయ్య - వేగ. ౮

గీ॥ కల్పవృక్షప్రదేశమ్మ గల్గు; నచట
కనక మంటప మొక్కటి దనరు; నచట
అష్టదళపద్మ శోభితమైన - పుష్ప
కమున, శ్రేష్ఠ పీఠంబున కమలనయన!
అధివసించి నాఁడవు; హృదయారవింద
మునకు, జ్ఞానముద్రను దాల్చి ముద్దు కరము
దాఁకుచుండ, వీరాసనస్థానమొర్మి
దాల్చినాడవు; శ్రీరామ! దాశరథివి
నెమ్మి నిను నమ్మినాడ - భావమ్మునందు
చిత్తసంస్కార మొసఁగుమా శ్రీ రమేశ! ౯

గీ॥ మించు, బల్మిఁ బయోధి బంధించినావు
వినుత, సంక్రందనుండయి - వెలసినావు
యోగ్యులకు, గొప్ప ధనమీవు - యోగివంద్య!
సకల కామనిష్యందన చక్రవర్తి
వీవు! లోకతాపము హరియించినావు;
సత్య సంకల్ప! చందన చర్చితాంగ!
పవన నందనస్యందన! పరమపురుష!
రఘువరా! జానకీనాథ! రమ్యహృదయ!
నిన్ను భజియింతు సతతంబు నియతి తోడ
కష్టముల బాపి రక్షింపు కరుణతోడ ౧౦

సీ॥ ఇందీవరశ్యామ! ఇభరాజ వరద! శో
ణ, సరోజనేత్ర; శ్రీ నాథ! రామ!
మేటి బల్మిని, ధనుఃకోటినిఁ జేఁదాల్చి
కవచ, జటాదులుగల్గి, వీర
తేజ ముప్పొంగ వధించిన వాఁడవు
ఖరదూషణాది, రాక్షసులనెల్ల
తూణీర యుగధారి! దోర్బలశక్తి, నీ
కెవ్వరుందురు సాటి యీధరిత్రి?

గీ॥ ఉడుము తోలు ౹వేళ్ళతొడుగుల ధరియించి
వింటి నారి నీడ్చి - పెక్కు బాణ
తతుల విడిచి, శ౹తుతతి సంహరించిన
రామచంద్ర! కొనుము ప్రణుతి శతము. ౧౧

సీ॥ మందార వృక్షముల్ - మహనీయమై యుండు.
పుష్పక మనునొక్క - పొలుపుమీఱు
మండప మాచోటనుండు; దాని నడుము
యష్టపత్రింబుల - నమరినట్టి
సూర్యబింబద్యుతి శోభిల్లు పద్మంబు
చెలువారు! నందు శ్రీసీతతోడ
వెలయుచునున్నావు - వీరాంజనేయ, ల
క్ష్మణులు సుగ్రీవుడు - మమతనిన్ను

గీ॥ గొల్చుచున్నారు; శ్రీరామ! కువలయేశ!
రఘుపతీ! జానకీ నాథ! రామభద్ర!
నిత్యతాపత్రియమును, ఖండించి, చిత్త
శాంతి నొసంగి, రక్షింపు - వేదాంతవేద్య! ౧౨

సీ॥ నీలమేఘశ్యామ! నిర్మల చంద్రబిం
బాస్య! శ్రీ లోల! పద్మాక్ష! వరద!
మాణిక్య కుండల - మకుటాభిరామ! రా
వణ మర్దనా! విభీషణ, విచార
పరిహారకా! ధనుర్బాణ సంయుక్త! సీ
తాసమేత! ముకుంద! తాపసాళి
చిత్తాబ్జములందోచు శ్రీనాథ! రఘువరా!
నాగేంద్ర శయన! వినాశితాఘ

గీ॥ జాల! శ్రీరామ! జయరామ! జాలమేల!
చిన్మయానంద! గోవింద! శ్రీనివాస

భక్త రక్షణ నీ పరిపాటిగాదె?
అభయు మిచ్చి రక్షింపుము - హరి! ముకుంద! ౧౩

సీ॥ రాజీవనేత్రుండు - రఘువంశ ముఖ్యుండు
వామాంకమున సీతఁబరగు వాఁడు
వర ధనుర్బాణముల్ ధరియింప గలవాఁడు
శాంతుండు, మందహాసంబు వాఁడు
కుండల శోభిత - గండస్థలము వాఁడు
నీల దేహంబుతో - నెగడు వాఁడు
శత సూర్యకాంతుల స్వచ్ఛ దేహము వాఁడు
మణి కిరీటమువాడు - మాధవుండు

గీ॥ వజ్ర సింహాసనమునందు వరలువాఁడు
రాజ రాజా లకధి పతి - రామచంద్ర
మూర్తి, నాదేవు సతతంబు ముదముతోడ
స్తోత్ర మొనరించెదను; పరిశుద్ధుఁడగుచు ౧౪

సీ॥ కుడిచేత నుపదేశ ముద్రముద్ర ధరియించి
మౌనుల దీవించు మాన్యుఁడీవు!
యెడమ మోకాలిపై - నిడిన హస్తముగల్గి
శ్రీరామ! గుణధామ! శ్రీశుభాంగ!
స్తనభార వశ్యత దనువు వంగినయట్టి
భూషణతతులచే - బొలుపుఁగాంచి
యున్నట్టి, వైదేహి - నుజ్జ్వలదేహి, నా
సక్తిఁగాంచుచునున్న రక్తుఁడీవు!

గీ॥ రామ! నీలమేఘశ్యామ! సోమసూర్య
బింబముల, నేత్రములు గాగ వెలయుదీవు!
భక్త పరిరక్షణము - పరిపాటి నీకు
అభయమిచ్చి, రక్షింపుము హరి! ముకుంద! ౧౫

సీ॥ విబుధుల భరియించు విమల చిత్తము గల్గి
పుష్పోపహారంబు బొందినావు
జానకీ లక్ష్మణ - సహితుండవై, వాయు
వేగ బాణంబుల, జాగులేక
నందించు తూణీర మందంబుగాఁగల్గి
దుష్టుల శిక్షించి, దురితనాశ
నంబొనరించు, పుణ్యస్వరూప! కమల
నేత్ర! శ్రీరామ! తాపత్రియంబు

గీ॥ లడఁగఁజేయుము; సంసార మందు మునిగి
సారహీన సుఖంబుల, సారమంచె
చింగి, దిక్కుఁదెలియ; కీలెఱుంగఁదెల్పి
సత్పథంబున నడపుము. జలజనయన! ౧౬

గీ॥ రామ! నీతత్త్వమార్గంబు రక్తి నాంజ
నేయుఁడెఱుఁగు; సుగ్రీవుండు నెయ్యమెఱుఁగు,
యుద్ధమార్గంబు రావణుఁడొకఁడె యెఱుఁగు;
సత్యమార్గంబు శ్రీవిభీషణుఁడెఱుంగు. ౧౭

మం॥ శ్రీరామ! రఘుపతీ! చిన్మయాకార!
కారుణ్యసింధు! సంకట పరిహార!
జగదేక వీర! యోజానకీ రమణ!
జగదేకబంధు; సుచారిత్ర సుగుణ!
శ్రీరామ! అభిరామ! శ్రీనాథ! వరద!
ప్రారబ్ధ కర్మండ! పరమదీనుండ!
రక్షింపు కృపణుండ! రహిఁగృతఘ్నుండ!
పక్షివాహన! నిన్నుఁ బ్రార్థింతు సతము. ౧౮

మం॥ సీతామనోహరా! శ్రీరామచంద్ర!
పద్మనేత్రుండ! ఆపన్న శరణ్య!
శ్రీయయోధ్యానాథ! శ్రితజన వరద!

రాజేంద్ర ! జగదీశ్వరా ! రామభద్ర !
జేజేలు గొనుమయ్య ! శ్రీ రమాలోల !
రక్షింపు భక్తుల - రక్తితో సతము. ౧౯

గీ॥ కుడి, ధనుర్ధారియగు - లక్ష్మణుఁడు గొలువగ
మంగళాంగియౌ జానకి - రంగుగాగ
వామభాగంబు నందుండఁ బవనజుండు
ముందు నీయభయంబు - సానందమగును
బొందుచుండంగ, శ్రీరామ ! పొలుపుతోడ
వెలయుచున్నావు ! నాదు మ్రొక్కులను గొనుము. ౨౦

సీ॥ రాక్షస మర్దనా ! రఘునాథ ! శ్రీరామ !
రావణ సంహార ! రామభద్ర
వాలి విమర్దనా ! భక్తుల కభయంబు
జేకూర్చు శ్రీరామ ! శ్రీ శుభాంగ !
భయహరా ! మురహర ! పాపసంహార ! సీ
తామనోహర ! ముకుందా ! పరాత్ప
రా ! శార్ఙ్గధనువు - గరంబునఁ దాల్చిన
వీరాధివీర ! సంప్రీతి తోడ

గీ॥ జానకీదేవి నీ పాద జలజములను
సేవ యొనరించు చుండు; సుగ్రీవుఁడిష్ట
రాజ్యములఁబొంది, సుఖియించె ; రామ ! నన్ను
నీదరికిఁ బిల్చుకొంచు, సమ్మోదమిమ్ము. ౨౧

సీ॥ సంసార భయముల - సంహార మొనరించు
పద్మాక్ష ! శ్రీరామభద్ర ! వరద !
కోటి భాస్కరతేజ ! కువలయ రక్షకా !
నీల మేఘశ్యామ ! నిగమ వినుత !
కరధృతశరచాప ! కల్యాణగుణధామ !
కనక రుచిరవస్త్ర ! కమలనాథ !

రత్నకుండల ధారి। రాత్రించర విదారి।
పాపహారి। ముని జనోపకారి।

గీ॥ లక్ష్మణుని గూడి, సతతంబు లాలితముగ
వెలయు చున్నావు శ్రీరామ। వేదవేద్య।
జానకీ నాథ। శ్రీనాథ! సత్య చరిత।
స్తోత్రమొనరింతు। రక్షింపు - శుభవిలాస। ౨౨

గీ॥ నల్ల మేఘము వోలె - నల్లనైయున్నావు
నిర్మల పద్మాక్ష। నిగమ వినుత।
శాపమహల్యకు శాంతించె - నీపాద
ధూళి సోకినయంత తోయజాక్ష।
భూమీశ। శ్రీరామ। భువనమోహనరూప।
కోటి విద్యుత్ప్రభల్ - కొలది మీఱు
మకుటంబుఁ దాల్చిన - మహనీయ మూర్తివి
సంసార దుఃఖముల్ - సమయఁజేసి

గీ॥ జీవులకు ముక్తిఁజేకూర్చు శ్రీశుభాంగ।
రాక్షసధ్వంస। హరసఖా! రామభద్ర!
నన్ను ధ్యానింతు భజియంతు నేమముగను
ఇమ్ముగా నాకు, నారోగ్యమిమ్ము. దేవ। ౨౩

సీ॥ దశరథ వరపుత్ర: ధరణిజమిత్ర। దా
నవశత్రు। మేఘ సౌందర్యగాత్ర।
ఇంద్రనీలశ్యామ। ఇనకులాభరణ। సీ
తాప్రాణనాథ! వేదగణ వినుత।
సకల లోకాళిచే సంస్తుత్యుడైనావు
శ్రీరామభద్ర। విచారశీల!
శ్రీ సముద్రిందు, నిన్వాసిగా స్తుతియింప
భువన మోహన రూప! మురిసినావు.

గీ॥ దండకారణ్య సంచారి। దానవారి।
శ్రీరమేశ। సర్వేశ్వరా। శ్రీనివాస।
రామభద్ర। ధ్యానించెద - రక్తితోడ
రక్షణము సేయుమభవ। ప్రహ్లాదవరద। ౨౪

సీ॥ సరయూనదీతీర - పరిసరోద్యాన, ల
తాగృహసీమ, రతనపుటరుగు
నందుఁబువ్వుల శయ్యయందు, సీతారామ
దంపతుల్ గ్రీడింతు రింపుగాగ
కస్తూరి, కర్పూర - గంధ సమ్మిశితమౌ
పరిమళములచేత భాసమాన
మగు, శరీరములతో నమరవంద్యులుగ, నా
రాచ దంపతులుంద్రు రాచతీవి.

గీ॥ పావనులు, శోభనాకార పరమపూజ్య
లార్య లత్యుదారమతులత్యంత కరుణ
మమ్ము నెల్లప్పుడును, రక్షణమ్మొనర్ప
బ్రార్థన మొనర్తు సద్భావ పటిమతోడ ౨౫

సీ॥ వందారు మందారుఁడిందీవరశ్యాము
డానంద రూపుఁడై యలరువాఁడు
వాణి, సముద్రుండు - వానరుల్ మొదలగు
వారి, సంస్తోత్రిముల్ పడయువాఁడు
శ్రీ శివబ్రిహ్మ, వశిష్ఠ విశ్వామిత్రి
లెల్లప్పుడు, నుతింప నెసగువాఁడు
వినతాత్మజుని చేత - వినుతు లొందెడు వాడు
దేవతాధిపుఁడు, సీతావధూటి

గీ॥ మానసప్రియుండు - మారుతాత్మజు సేవ
లందు కొనెడు వాఁడు - సుందరుండు

మాదు మనములందు మమతతో మలయాడి
సంతసంబొసంగ - నెంతు మెపుదు. ౨౬

గీ॥ శ్రీ విశాల నేత్ర ! సీతాకళత్ర ! జ
గత్పవిత్ర ! పూర్ణగాత్ర ! రామ !
రాక్షసాళి జైత్ర ! రఘువీర ! పరమాత్మ !
తత్త్వవేత్త ! నిన్నుఁదలఁతు సభవ ! ౨౭

గీ॥ లక్ష్మణుని భావపాథోధి లలితభంగిఁ
బొలుపు వహియించు నట్టు లుబ్బొంగఁజేయు
పూర్ణచంద్రుండ వీవు ! భూపుత్రి నేత్ర
కుముదములకు, సంతోషంబుఁ గూర్చినట్టి
పూర్ణచంద్రుండవు ; ముకుంద ! భూరితేజ
రాక్షసుల నేత్రపద్మముల్ తక్షణంబు
ముకుళిత మొనర్పఁజేసెడి - పూర్ణచంద్రుఁ
డీవు ! శ్రీరామ ! రక్షింపు మిందిరేశ ! ౨౮

మం॥ నీ పూజ లొనరింప - నేనేర రామ !
నీయవతారముల్ - నేఁగొని యాడఁ
జాలను; సంసార జలధి దాటంగ
నీనామమేనావ ; నిను స్మరియింప
భవ బంధము తొలంగు - భద్రాద్రిరామ !
శరణువేడితి ; రామచంద్ర ! ముకుంద ! ౨౯

గీ॥ తుమ్మెదల బోలి నల్లనై - యిమ్ముగూర్చు
ముంగురులఁ గప్పఁబడినట్టి, మోముఁగల్గ
నల, గృహాంగణమందుఁ దారాడుచున్న
బాలరాముండు, దశరథ వర సుపుత్రుఁ
డెప్పు నశుభంబు లడఁచి, మాకిచ్చుగాత
శుభ పరంపర లేవేళ నింపుగాగ. ౩౦

సీ॥ రాక్షస తిమిరంబుఁ బ్రిధ్వంసన మొనర్చు
భాస్కరుండవు నీవు - పరమ పురుష ।
భక్తుల పాపముల్ పరిహరించెద వీవు
మునులు ధ్యానించెడు ఘనుఁడవీవు !
దుర్మార్గులకు నీవు - దూరస్థుఁడైనావు
శత్రుల శిక్షింపఁ జాలినావు
తాళవృక్షములేడు లీల బ్రద్దలుగాగ
చీల్చిన మేటివి శ్రీరమేశ ।

గీ॥ ఇంద్రుఁడెపుడు సేవ లింపార సల్పును
జలధరములఁ బోలు శ్యామలాంగ ।
రామ । నిన్ను సతముఁ బ్రార్థన మొనరింతు
రక్షణంబు సలుపు - రాఘవేశ । ౩౧

సీ॥ గోపాల । భూపాల । గోవర్ధనోద్ధార !
రాక్షసనాశనా । రాఘవేశ ।
సీతామనోనాథ । శ్రితజన మందార ।
ఓ । దయా సాగరా ! ఓ ముకుంద ।
ఓ । సద్గుణాంభోధి ! ఓ విభీషణపాల
నవపద్మనేత్ర ! పుణ్య శుభగాత్ర !
ఓ । కోటి శ్రీమన్మథాకార । శ్రీరామ !
శుభగుణచారిత్ర । సుందరాంగ ।

గీ॥ ప్రజలఁ బాలించుచున్నావు - రామచంద్ర ।
నిన్ను మించిన రక్షకుఁడున్నవాఁడె ?
చిత్త నైర్మల్య మొసఁగుము శ్రీనివాస !
రాఘవా । సదానిన్ను స్మరణ మొనర్తు. ౩౨

సీ॥ ప్రిణవాబ్జ రత్నప్రభల్ చిమ్ము సింహాస
నంబుఁ సాకేతపురంబు నందు

కోభిల్లు; శ్రీరామ! శుభగుణ ధామ! నీ
వందు, భూజాతతో నుందు వేపుడు
పేడ్కఁ బూఁబోఁడులు - వింజామరలఁ బూని
ఇరు పార్శ్వములను, సేవించు చంద్రు
వర మునీశ్వరులు, విశ్వామిత్రుఁ లాదిగా
నిను, నుతించును నుందురీ - నీరజాక్ష!

గీ॥ శిష్ట సంరక్షణ మొనర్చి - దుష్ట శిక్ష
సలుప, రామావతారంబు నెలమిఁదాల్చి
వచ్చినాడవు; జోహారు లిచ్చినాము;
రమ్యగుణసాంద్ర! రక్షింపు! రామచంద్ర! ౩౩

సీ॥ మందార మాలికానందమూర్తివి! నీవు
మెఱపు గుంపులఁ బోలు - మేటి వస్త్ర
ము, ధరించినాఁడవు; ముద్దుగా, సంపూర్ణ
చంద్రునిఁ బోలెడి చారు మొగము
గల్గినవాఁడవు! కమలంబులఁదెగడు
నేత్రంబు లొప్పారు నీర జాక్ష!
దిక్పతుల్ సేవింప - దివ్యుఁడై వెల్గెదు
శ్యామలాకార! శ్రీ రామచంద్ర!

గీ॥ అగరు కర్పూర శ్రీ చందనార్ద్ర హృదయ!
శ్రీ మనోహర! రఘువీర! చిత్ప్రకాశ!
సత్యసంకల్ప హృదయ! విచారశీల!
రక్షణ మొనర్పదగదె? శ్రీరామచంద్ర! ౩౪

సీ॥ రెండుబాణముల, దోర్దండులగు, సుబాహు
మారీచులఁ బరిమార్చి, నీవు
కౌశిక యజ్ఞంబు గాచిన వాఁడవు
నీలమేఘశ్యామ! నిగమవినుత!

లక్ష్మణ సన్నుత! రాజీవనయన! వ
ద్మాస్య! దయానిధి! మాప్రియుండ!
సొగసుగులుకు పిల్ల - జుట్లచే, సుందరా
కారుఁడౌ, శ్రీరామ! కలుష హరణ!

గీ॥ నిన్ను ధ్యానింతు, భజియింతు - నెమ్మనమున
నిశ్చల సమాధి (బరిశుభ్రి నిష్ఠ, నియతి
జపతపంబులు, యోగంబు చాలగూర్చి
సీదరికిఁ జేర్చుకొమ్మ! శ్రీసీరజాక్ష! 38

మం॥ ఆనంద రూప! దివ్య గుణసమేత!
సీలోత్పలాంగ! ఖండిత శత్రుజాల!
భువనైక మిత్ర! స్వర్గభువనాధికార!
రవికులభూషణా! రాజీవ నయన!
ఆశ్రితజన మందార! శ్రీనాథ! వరద!
పతిత పావనరామ! వరద! ప్రసన్న
సింహాసనాసీన! సీతాసమేత!
రాఘవా! భజియింతు - రక్షింపుదేవ! 39

మం॥ రణరంగ మందు, శ్రీరామ భద్రుండు
అసుర జాలమునెల్ల నాశ్చర్యభంగి
బాణ వర్షంబున ప్రహరించి తునిమి
శిష్టుల రక్షించె - శ్రీకరంబుగను
ఆ విభీషణుఁడు, దన్నాశ్రయింపంగ
రక్షించి, సింహళ రాజ్యంబొసంగి
పట్టాభిషేకంబు భాసురంబుగను
నల్పె; నాతనికి నా! శతవందనములు. 40

మం॥ గజ వాహనుండు. విఖ్యాత నాముండు
ఉపనిషత్తులకెల్ల - నోంకార పూజ్యుఁ
డభిమాన రహితుండు హరి ముకుందుండు

స్వకృతైక దానపూజ్యత నొంది యుండు
శ్రీరామచంద్రుండు - శ్రితజన భర్త
నాశన శూన్యుండు - న్యాయైకమూర్తి
దేవతారాధ్యుండు ! దివ్యవైభవుఁడు
నా మ్రొక్కులను గొంచు - నను రక్షసలుపు. ౩౮

మం॥ శ్రీ ధనుర్బాణముల్ - చే ధరియించి
శత్రుల మర్దిందు - శ్యామలాంగుండు
సీతా సమేతుండు శ్రిత రక్షకుండు
కమల లోచనుఁడు, సంకట నాశకుండు
లక్ష్మణ సేవ్యు, నీరజ పాద యుగ్ముఁ
డార్త బాంధవుఁడు, దయాంతరంగుడు
శ్రీరామ మూర్తి - రక్షించుత సతము. ౩౯

సీ॥ పాపార్తిభంజనా ! భద్రాద్రి రఘురామ !
దీనబాంధవ రామ ! మౌనివినుత !
సీతామనోనాథ ! శ్రితజనమందార !
భరతాగ్రజా ! శ్రీనివాస ! వరద !
రఘువంశ నాయకా ! రామచంద్రా ! కరు
ణాకరా ! శ్రీధర ! నాగశయన !
భయ, పీడితులయిన - భక్తుల దీనుల
నాప్త బాంధవు బట్టు లరయు వాఁడ !

గీ॥ కలుషమైన, సంసారాంధ కారమందు
మునిగి కనుఁగానకున్నాము ; వనజనేత్ర !
పాప సంద్రాన బడినట్టి పాపి నన్ను
పట్టి లేపుము శ్రీరామభద్ర శరణు !

గీ॥ బహుశరంధ్రయుతము - పొడగు యంత్రంబు
శిథిలమై, క్రమమునఁజెడి, శరీర

మపని నాశనంబు - నందుట సత్యంబు
దీనికౌషధంబు - దెలియవలయు.

గీ॥ మూఢ! దుర్మతీ! నీ వీనిగూఢమైన
మర్మము నెఱుంగు మెప్డు; రామ, సుకథామృ
తంబు పానమొనర్ప రోగంబు నడలు;
అతని నామౌషధంబె - దివ్యౌషధంబు. ౪౧ (అ)

సీ॥ దశకంఠ గజము, నుత్సాహంబుతోఁ జీల్చు
మృగరాజవై నావు - ఖగపతీశ!
భయద, హస్తములతో - ఖండనంబొనరించి
రాకాసి గర్వంబు ప్రక్కలించి
రంజిల్లు తారక బ్రహ్మ స్వరూపుఁడై
దశరథ వరపుత్ర! ధర్మహృదఁ
మణిఖచితకిరీట! మంజుల భాషణా!
శ్రీ రామ చంద్ర! యాశ్రితజనంబు

గీ॥ రక్షణ మొనర్చుచున్నావు - రాఘవేశ!
కమల లోచన ఇందిరా రమణ! నిన్ను
భక్తి సేవించి భజియించి పొడుకొందు
రక్షసేయుము; శ్రీరామ! రాఘవేంద్ర! ౪౨

మం॥ లంకా వినాశనా! రణరంగభీమ
రాజీవనేత్ర! ఓ రఘువంశ మిత్ర!
కారుణ్యమూర్తి ఓ! కరుణా పరిపూర్ణ;
రక్షింపు శరణిదే! రాఘవ చంద్ర! ౪౩

మం॥ రాకేందువదన! శ్రీరామచంద్రేంద!
వేదాంతములయందు - వెలసియున్నావు
బ్రహ్మ నిన్నీనుతించు భక్తుఁడై సతము

హృదయస్థుఁడై నీవు - మెదలు చున్నావు
భవవంద్య! శ్రీరామ! ప్రార్థింతు నిన్ను ౪౪

సీ॥ పద్మంబులను బోలు పాదయుగ్మముతోడ
భాసిల్ల జేతువీవసుధతలము
తల్లి ముదముసెంద దండ్రి యంకమునందుఁ
గూర్చున్నవాఁడవు కోమలాంగ!
కలువల బోలిన కన్నులు గలవాఁడ!
మరకత మాణిక్య మహితదేహ!
దేవతాతతి నిన్ను సేవించి స్తోత్రముల్
సల్పుచుందురు, రామచంద్ర! సతము

గీ॥ సకల భూషణాలంకార! సార్వభౌమ
మాయచే రాముఁడైన, యమాపహేళ!
నాదు మనమునఁ బొడగట్టి సాదరమున
రక్షణము సల్పుమభవ! శ్రీరామచంద్ర! ౪౫

గీ॥ కవచము ధరించి, చేఁబట్టి కత్తి, చాప
బాణముల, లక్ష్మణుని గూడి - ప్రమదమలర
నాకుఁగని పింపుమయ్య శ్రీ నాథ! రామ;
చిద్విలాస! శుభాకార! శ్రీనివాస! ౪౬

సీ॥ సుగ్రీవ మిత్రుండ! సుజనానురక్తుండ!
పరమ పవిత్రుండ! బాంధవుండ!
సీతాకళత్రుండ! శ్రీరామ చంద్రుండ!
నవహేమ సూత్రుండ! నటనచతుర!
కారుణ్య పాత్రుండ! కమనీయ గాత్రుండ!
శతపత్ర నేత్రుండ! సజ్జనుండ!
మహనీయ విభవుండ! మహిత గుణోపేత!
దేవతావంద్యుండ! దివ్యమూర్తి!

గీ॥ సాధు సంరక్షకా! శిరసానమామి,
మౌని జనవిధేయా! శిరసానమామి,
సత్య పరిపాలకా! శిరసానమామి,
సౌమ్యగుణచరితా! శిరసానమామి! ౪౭

సీ॥ శ్రీ రాఘవా, హరీ! శ్రీనాథ! సాకేత
పురనాథ! శ్రీమనోహర! ముకుంద!
రావణసంహార! రాఘవేశ్వర! రామ
చంద్రా! స్ఫురద్రూప! సార్వభౌమ!
వాసుదేవా! పరాత్పర! శ్రీనివాసా! ము
కుంద! దామోదరా! కువలయేశ!
గోవింద! శ్రీకృష్ణ! గోవర్ధనోద్ధార!
దాశరథీ! పవిత్రాత్మ! వరద!

గీ॥ రామ! శ్రీరామ! సీతాపతీ! మహేశ!
పాపసంహార! పతితపావన; మురారి!
యంచు నాజిహ్వసతతంబు మించుప్రేమ
నిన్ను భజియించు గాత! సంపన్న చరిత! ౪౮

గీ॥ జయము! జానకీ వల్లభా! జయము! జయము!
జయము! భవవంద్యచరణాబ్జ! జయము! జయము!
జయము! జలజాసనస్తుత! జయము! జయము!
జయము! శ్రీరామ! కరుణాబ్ధి! జయము! జయము! ౪౯

గీ॥ రామ! నీ పాదభక్తి నిరంతరంబు
నాకు దయసేయుమయ్య! శ్రీనాథ! భక్తి

యే కదా! ముక్తి మార్గంబు శ్రీకరముగ
భక్తిఁగూర్పుమా! పరాత్పర! ముకుంద! ౫౦

గీ॥ శ్రీ సముద్రుని గర్వంబు జెండియాడ
రామ! లోక భీకరభంగి - రౌద్రనేత్ర
ములను, విచ్చితి వాగంగ మోమువాల్చె
తనదు, మంగళసూత్ర విధ్వంసమగునొ!
యందుఁదలఁచెను; దివిజులుగాంచి, చింత
నల్పి రంత, సముద్రుఁడుత్సాహమతిని
శరణువేడ రక్షించితి - శాంతుఁడగుచు
రఘుకులానంద! శ్రీ రామ! ప్రణుతి శతము. ౫౧

సీ॥ ఆశ్రిత మందార! అంబుధి గర్వాప
హార! సీతాచిత్తచోర! రామ!
శ్రితజన రక్షణాయతచిత్త! దేవతా
రక్షణ తత్పర! రాఘవేశ!
కిర్ణకుండలధారి! కమనీయదేహ! శ్రి
లోక పూజిత కరుణాకటాక్ష
వీక్షణములు, భక్తరక్షణతత్పరుఁ
డయి, ప్రసరింపు నాపయి, ముకుంద!

గీ॥ జానకీ చిత్తపద్మ భాస్కరుఁడ వీవు!
లోకములకు, శుభంబిచ్చు - శ్రీకరుఁడవు!
చిన్మయానందమూర్తివి; చిత్తకమల
మున, వసింపుము; ప్రార్థనముల, నొసర్తు. ౫౨

సీ॥ శ్రీరామ! జనియించి - చెలువుగా బాల్యంబు
గడపి, కౌశికుని యజ్ఞంబుఁగాచి
శాపమహల్యకుఁబాపి, ముక్కంటి, ధ
నుర్భంగ మొనరించి, సుతులఁగొంచు

సీతను పెండ్లాడి - చేరి యరణ్యంబు
　　　సతినిఁగోల్పోయి, విచారమంది
హనుమంతునితో, లంకయంతయుఁజిచ్చొంద
　　　వారిధి దాటి, రావణునిగొట్టి

గీ॥ రక్కసుల, మూకఁజెండాడి - లక్ష్మణుండు
మూర్ఛఁగొనదేర్చి, జానకి ముదముతోడ
పుష్పక విమానమందు, సంపూజ్యముగను
తెచ్చినాడవయోధ్యకు సచ్చరిత్ర
ఇదియె, రామాయణంబాయె - వినకులేశ!

సీ॥ శ్రీరామ! జన్మించి - గారవంబునను, వి
　　　శ్వామిత్రు యజ్ఞరక్షణమొనర్చి
ముక్కంటి చాపంబు - ముక్కముక్కలొనర్చి
　　　జానకిఁబెండ్లాడి - సంబరమున
భక్తితో పితృవాక్య - పరిపాలన మొనర్ప
　　　విపిన సంచారంబు - వేడ్కసలిపి
ధనువుజేబూని, యుద్ధమున - ఖరాదుల
　　　సంహారమొనరించి - జాగులేక

గీ॥ మాయలేడిని మర్దించి - మగువ సీత
కొఱకు, లంకాపురముఁజొచ్చి - క్రూరుఁడైన
రావణుని, వధించితి వీర! రాఘవేశ!
మహి, నిదియకాదె; గొప్ప రామాయణంబు. ౨౪

సీ॥ భూనాథ! రామ! తపోవనమందు, బం
　　　గారు కురంగంబు గాఢ బాణ
తతులఁగొట్టితివి; సీతను, రావణుండు హ
　　　రించె; జటాయువుఁ దున్మించె; నంత
సుగ్రీవుతోమైత్రిఁ జూరగొంటివి; వాలి
　　　వధియించితివి। ప్రేమ పవనసుతుఁడు

నీ సేవలొనరించె; నీకధిదాటె; లం
కాదహనమొనర్చె; మీద నీవు

గీ॥ కపి బలంబున వారిధిఁగట్టి, లంకఁ
గుంభకర్ణ-రావణులను గూల్చి, సీత
తో నయోధ్యఁజేరితి వీవు। తోయజాక్ష!
ఇదియె - రామాయణంబందురెల్ల జనులు. ౨౫

సీ॥ రఘురత్నమ। బహుళరత్నాలచందుఁగిలఁ
బురుడించు నీ నవ్వుముద్దుమోము
చంద్ర సూర్యాగ్నుల సాటిఁ బ్రకాశించు
కుండల శోభితాంగుండ వీవు।
జపమాల, వీణ, పుస్తకము, జ్ఞానంపు, ము
ద్రయు, హస్తములయందుఁదాల్చితీవు।
దేవతాధిపుఁడవు। దివ్యస్వరూప। ల
క్ష్మణ, భరతాదులు - మమతతోడ

గీ॥ నీకు సేవసలుప నీల మేఘశ్యామ।
రామ చంద్ర। వరద। శ్రీ మహేశ!
పన్నెకెక్కినావు; భక్తి నిన్ భజియింతు
కావు మభవ! నన్నుఁగరుణతోడ. ౨౬

సీ॥ తపను గుఱ్ఱంబులు తప్పుతోవకువెళ్లె
ముక్కంటి శిరమూచె - ముగ్ధుఁడగుచు;
కులపర్వతములు, వ్యాకులములై చలియించె,
విస్మయంబొందెను వేధ యపుడు;
దిగ్గజంబుల కెల్ల దెలివితేటలు దప్పె,
తారంబుగాఁ గరగెతొట్రుపాటు;
సప్తసముద్రముల్ - స్తంభించి బెగ్గడె;
మూడు లోకంబులు - మూర్ఛమునిగె.

గీ॥ మద బలోద్ధతు లింకిరి ; ముదము నెందె
సీత ; శివధనుర్భంగంబు చేత పుట్టి
నట్టి శబ్దంబు శ్రోత్రేంద్రియములనొకి
నంత - శ్రీరామ ! నీచర్యలద్భుతములు ! ౫౭

మం॥ కర్ణకుండలధారు - కారుణ్యపాత్రు
నీరజదళనేత్రు - నీరదగాత్రు
ఇనవంశశోభితు - నిందిరారమణు
లక్ష్మణాన్వితు, రఘురాము నిదలంతు. ౫౮

మం॥ తళుకు మెఱుపులతోఁ దళతళల్ గొలుపు
నీలమేఘశ్యాము - నీరజనయను
విద్యాధరస్తుతు - వీరావతారు
శత్రుల మర్దించు సాహసోపేతు
లక్ష్మణాన్వితు, రఘురాముఁనిఁదలంతు. ౫౯

మం॥ దివ్యబాణములచే - దీపించు కార్ము
కంబును గల్గిన - కమనీయగాత్రుఁ
బాశోధి గర్వంబుఁ బాపినరాము
సుగ్రీవమిత్రుని, విశుద్ధచరిత్రు
రాక్షసజైత్రు, శ్రీరాజీవనేత్రుని
లక్ష్మణాన్వితు, రఘురామునిఁదలంతు. ౬౦

మం॥ అచ్యుతానందు, బీతాంబరధరుని
నింద్రామరస్తుతు - నిందీవరాక్షు
నా జానుబాహుని - నాదిత్యతేజు
లక్ష్మణాన్వితు, రఘురామునిఁదలంతు. ౬౧

మం॥ అఖిల ప్రజావంద్యు - నబ్జాక్షు, నీశుఁ
బూర్ణచంద్రనిభాస్యుఁ బుణ్యశరీరు

రఘువంశజాతు, స్వర్గాధిపు, వరదు
లక్ష్మణాన్వితు, రఘురామునిఁదలఁతు. ౬౨

ఆ॥ మూడు సంధ్యలందు - ముదముతో నెవ్వరీ
పంచరత్నములను - పఠనసేతు
రమలభక్తి, వారి యఖిల పాపంబులు
దొలఁగి మోక్షపదవి - దొఱకుచుండు. ౬౩

గీ॥ ముదమొసఁగు మందరము, రామమూర్తి నాకు;
ఆర్తి హరియించు సఖుడు, శ్రీమూర్తి నాకు;
భువన మోహనుఁడా రామమూర్తి నాకు;
అట్టి లోక సుందరమూర్తి - నాశ్రయింతు. ౬౪

గీ॥ సదయ చిత్తుండు; శ్రీ శేషశాయి, అతడు
సీత చిత్తోత్పలము వికసింపఁజేయు
చంద్రుఁడు; గుణసముద్రుండు - స్వాంతమునకు
ప్రభువు; శ్రీరామచంద్రుండు, భక్తి గొలుతు. ౬౫

సీ॥ నిత్యంబు నావాణి - నిష్ఠతో 'శ్రీరామ
రామా' యనుచుబల్కు - నేమముగను
నిత్యంబు నాచిత్త - మత్యంత భక్తితో
రాము పాదంబులఁబ్రేమఁదలచు
నిత్యంబు నాదేహ - మత్యంత ప్రీతితో
శ్రీరామ చంద్రుని - సేవ సలుపు
నిత్యంబు నాజిహ్వ - యత్యంత ప్రేమతో
జానకీ వల్లభు - సంస్మరించు

గీ॥ జపము సల్పుచున్న - జన్మజన్మాంతర
పాప సంచయములఁ బాఱఁద్రోలి

మోక్షమొసఁగుచుండు - నక్షర ద్వయము ; 'రా
మ' మహిమఁబొగడ, వశమా ? ధరిత్రి. ౬౬

గీ॥ శ్రీ ధనుర్బాణములు గల్గు - శ్రీ విలాస ।
మానుష శరీరధారి । రామా ! ముకుంద ।
లక్ష్మణాన్విత రఘురామ । రక్షణంబు
సలుపు మయ్య ! సీతాపతీ । తలఁతు భక్తి. ౬౭

గీ॥ మంద హాసంబు తొలుకాడు - మధురభాషి
ఫాల తలము విశాలమౌ - భద్రమూర్తి
కర్ణములఁ గుండలమ్ములు ప్రకాశముగను
మెఱయ,. గండభాగంబులు - మెఱయు మూర్తి!
చెవుల పర్యంతమును విచ్చి చెలఁగు గనుల
సొబగు మూర్తి; నేత్రోత్సవ స్ఫూర్తినొసఁగు
మోహనాకారు, శ్రీరాము - ముదముతోడ
సంస్మరణ నొనర్తు! ప్రభాతసమయమందు. ౬౮

గీ॥ శివ ధనుర్భంగ మొనరించి, సీతఁ బెండ్లి
యాడి, యడవులలో, నడయాడి, రక్క
సులను జెండాడి, కొండాడు సుజనభక్త
కోటి కాశీస్సులొసఁగెడి మేటి రాము
పాదముల, సేవఁజేతు - ప్రభాత మందు ౬౯

మం॥ పద్మాంకుశాది, శివంకర రేఖ
లానందముననొప్పు - నట్టి పాదాబ్జ
మకరందమును గ్రోల - మౌనుల మనసు
లను, భ్రమరంబులత్యంత మాసక్తి
సేవింపఁదొడఁగెను శ్రీరామచంద్ర ।
నీ పాద పద్మముల్ - నెమ్మి సేవింప,
నాయహల్యకుఁబోయె నౌర । శాపంబు

కాన, నా చిత్తంబు కమలాక్ష! నీచ
రణయుగ్మములఁ బట్టి రక్తిఁ బూజించు
భజియించు సతము; ప్రభాతంబునందు. ౨౦

గీ॥ వాక్య దోషముల్ హరియించు; పరమపావ
నాత్మకంబైన నీ నామ మస్థిరంబు
పాప సంఘంబు దూలు; నాభవునిఁ బొంద
గౌరి నినుఁ గూర్చి తపము జక్కఁగ నొనర్చి,
యతనిఁ బెండ్లాడె; శ్రీరామ! హర్షమలర
వేయి విష్ణునామములతో - విలువగల్గు
రామనామ మొక్కటిచాలు; రక్తి నేను
పలుకు చుండెద సతము, ప్రభాతమందు ౨౧

గీ॥ వేదములు, నిన్నుస్తుతియించు - విశ్వరూప!
నీలరత్నోత్పల ప్రభల్ - నీ శరీర
మందు వ్యాపించె; శ్రీ మౌనిబృందమెపుడు
నినుస్తుతింతురు; నీ భృత్యులనుదినంబు
ధ్యానమొనరింత్రు, నీ రూపు ధ్యానగమ్య!
ముత్యముల, భూషణములచే - ముద్దుగాగ
వెలయుచుందువు శ్రీరామ! వేడ్క నిన్ను
నాశ్రయింతు నుషఃకాలమందు సతము. ౨౨

మం॥ ఈ శ్లోకపంచకంబే నరుండేని
నిత్యంబుఁ బఠియించు నిష్ఠఁ బ్రభాత
కాలంబునందు, నిష్కలుష చిత్తమున
నాతండు పరులకు నందగరాని
విష్ణు లోకముఁ జొచ్చు - వేడ్కతో రాము
కింకరముఖ్యుఁడై - కీర్తిని బొందు. ౨౩

సీ॥ పెర మంత్రములు ధాత్రిఁ బెక్కులున్నవి కాని
రామమంత్రము సాటిరావవేవి?

పెరమంత్ర పఠనమందరుడుగానేమైన
లోపంబు గలిగిన లోటువచ్చు
ఆయాసమెక్కువై - కాయంబు కుష్కించు
సంసార దుఃఖాది శ్రమలు గల్గు
అష్టాక్షరాయుతంబై నట్టి శ్రీరామ
మంత్రంబు బఠియించు మానవులకు

గీ॥ ఇతర మంత్రంబులిచ్చు యభీష్ట కామి
తార్థముల నిచ్చి, నిఖిల సంతాపములను
బాపుగావున - శ్రీరామ పరమ మంత్ర
మఖిల జనముల పఠనయోగ్యంబుకాదె? ౭౪

కం॥ "శ్రీరామశ్శరణంమమ"
శ్రీరాముని స్మరణసేయు చిన్మయమంత్రం
బీరామమంత్రమే కద
సారంబీ రామ మంత్ర సారముగనుడీ ౭౫

గీ॥ భక్తుఁడెవ్వాఁడు శ్రీరామ భద్రమూర్తి
నాశ్రయించి, సేవించునో యతఁడెరామ
మూర్తియగు; దీనసంశయము పనిలేదు;
ఆ రఘుపతి - కోదండ తూణీరధారి ౭౬
తలఁప దండ, కమండలుధారి భక్తుఁ
డిది, నిజము; భేదమేమిగల్గదు ధరిత్రి.

గీ॥ పాపతిమిరంబుఁ బాపెడి భాస్కరుఁడవు
నీదు పాదపద్మముల, మన్నించి, యందు
దొఱకు - మధువానుచుండెడి తుమ్మెదను; క
లియుగ మఘములకు నెలవు; భయము గలిగె,
నీదు క్రేగంటిచూపుల నెమ్మి నను, న
నుగ్రహింపంగ శ్రీరామ! నో మొనర్తు. ౭౭

గీ॥ పామరులు గూడ, "శ్రీరామ-రామ" యంచు
జపము సల్పుమాత్రమున, సంసారజలధి

దాటుచుంద్రు ; నీ వ్రేలిముద్రిను దరించి,
హనుమ, సంద్రించుదాటుట - యచ్చెరంబె ?
రామ ! శ్రీరామ ! గుణధామ ! రమ్యనామ ! ౭౭

మం॥ శ్రీరామ నామంబు - చింతించువారి
కమృత బీజంబయి, యఖిలార్థసిద్ధి
నిమ్ము, సంజీవనంబిద్ది; ఈ రామ
నామామృతంబొందు నాలుకనున్న
కాలకూటముగాని - కాలాగ్ని గాని
మృత్యుదేవతగాని - సత్యంబుగాగ
భక్తు నిఁ జెనకక - వ్యర్థమైపోవు ;
శ్రీరామ ! నీనామనుతి సేయంగ వశమె ! ౭౮

సీ॥ "ఓః కృష్ణ! యోహరీ-యో! యచ్యుతానంద
యోకృపావారిధీ ! యోముకుంద !
పాండవ సన్మిత్ర ! పతిత పావనరూప !
యెక్కడనుంటివో యెఱుగనయ్య !
దుర్యోధనాదులు - దుర్మదాంధు లగుచు
నాకవమానంబు ప్రాకటముగ
చేయుచున్నారు; నా చీర లూడ్చినవారి
వారి పాపంబులు - పండె గాన

గీ॥ ఆర్త రక్షణ ! నను గావుమయ్య ! భక్త
వరద!'' యంచు, ద్రౌపది వేడ, వలువ లక్ష
యముగ, నొసఁగి రక్షించిన హరి ! రమేశ !
రాఘవేశ్వర ! జోహారు ! రామచంద్ర ! ౭౯

గీ॥ నల్ల గలువరేకులవలె - నల్లనైన
దివ్యమూర్తివి; బహుచంద్రదీప్తి మెరయు
మొగముగలిన శ్రీరామమూర్తి ! కోటి
మన్మథాకార ! నాదు నమస్సులవిగో ! ౮౦

గీ॥ యోగశాస్త్రంబులేల ! వియోగమేల ?
దాన యజ్ఞ గంగాది తీర్థంబు లేల ?
అఖిల విద్యలు, బ్రహ్మచర్యాశ్రమంబు
లేల ? ఓ రఘురామ ! నీ లీలలరసి
కీర్తనము, సేయుభక్తి, యొక్కింతలేక
యున్న, నిష్ప్రయోజనమవ్వి ; సన్నుతాంగ
వరద ! శ్రీ రమానాథ ! నీ భక్తి, నాకొ
సంగి రక్షింపు ప్రార్థనల్ - సలుపుచుందు ౮౧

గీ॥ రామభద్ర ! దయానిధీ - రామచంద్ర !
భక్తజనముల రక్షించు - పావనాత్మ !
జగములఁ బవిత్ర మొనరించు చరణపద్మ
యుగ్మములు గల్గు శ్రీరామ ! యోగిహృదయ
పుటనివాస ! సీతాపతీ ! భువనజాల
ములకు నాధారమైనట్టి పుణ్యమూర్తి !
శరణు వేడెద - నీపాద సరసిజముల
రక్షణము సేయుమయ్య ! శ్రీరామచంద్ర ! ౮౨

ఆ॥ శ్రీప్రసన్నమూర్తి శ్రితయోగి ! చంద్రుండు
రామభద్రమూర్తి రక్షకుండు
మూడు తాపములను బోకార్చి, యజ్ఞాన
తిమిరమడఁచు నట్టి - ధీరుఁగొలుతు ౮౩

మం॥ శ్రీరామ ! నిఖిలేశ ! చిన్మయాకార !
రమణీయ గుణతేజ ! రాజీవనేత్ర !
సీతామనోహరా ! శ్రితజనరక్ష !
రాక్షసనాశనా ! రఘురామచంద్ర !
సర్వలోకశరణ్య ! సచ్చిదానంద !
నీ పాదపద్మముల్ - నీలాభ్రదేహ !
చిత్తమందెంచెద - శ్రీరామ ! వరద !
తత్తరంబుల బాపి - దయఁబ్రోవుమయ్య ! ౮౪

మం॥ దశరథకులనాథ ! శశిధరవదన !
కువలయ దళనీల ! కోమలాకార !
అవనిజనాథ ! పీతాంబరధారి !
చిఱునవ్వుమోమునఁ జిందులాడంగ
పలువిధ భూషణావళులను దాల్చి
దివ్యరూపముతోడ - దేదీప్యమాన
ముగ వెలుంగొందెడి మునిమాన్యచరిత !
చెలువుగ వెలుగు నా - చిత్తమందెపుడు ౮౫

మం॥ సజల జలదనీల ! సన్మునిస్తుత్య !
సుగమనిగమమూల ! సుందరాకార !
రాక్షస సంహార ! రణరంగధీర !
పక్షివాహన శౌరి ! భక్తసంస్తుత్య !
దశరథ నృపబాల ! ధర్మానురక్త !
లోకవిహార ! సుశ్లోక సంస్తుత్య !
జానకీ వల్లభా ! సత్కృపాపూర్ణ !
సేవింతు నిన్ను - నాచిత్తమందెపుడు
భావించి రక్షింపు - పంకజనేత్ర ! ౮౬

ద్వి॥ దశరథ వరపుత్ర ! దానవశైత్ర !
దశకంఠ సంహార ! దక్ష ! శ్రీరామ !
కరధృతశరచాప ! కమనీయరూప !
ధరణిజనాథ ! పద్మదళాయతాక్ష !
మౌక్తికాలంకార ! ముక్తి కారణుఁడ !
భక్తరక్షణధుర్య ! పతిత పావనుఁడ !
రఘుకుల శ్రేష్ఠ ! శ్రీరామ ! నీఁగొల్తు
నఘము లడంచి, నెయ్యమున రక్షింపు ౮౭

సీ॥ వీరాసనమునందు - వెలసిన శ్రీరామ !
భాసమానస్వరూపా ! మహాత్మ !

రవినిభతేజ! నీరదనీలగాత్ర! శ్రీ
వత్సచిహ్నముగల్గు పద్మనేత్ర!
కుండల ప్రభచేత - గండస్థలంబులు
మెఱయగా వెలుగొందు మేటివీర!
శ్రీనివాస! ముకుంద! శ్రీహరీ! మందార
మూల, సింహాసనమునఁ బ్రశస్త

గీ॥ మగు, నలంకార భూషితమౌ, శరీర
శోభఁగల్గిన శ్రీరామ! సుగుణధామ!
అమరపతివంద్య! నిన్ను నే ధ్యానయజ్ఞ
మున, నుతింతు; రక్షింపుమా! ముక్తివరద! రారా

మం॥ శ్రీరామభద్రుని సేవించి భక్తి
నారాధనము సేయునట్టి సద్గురుల
పాదారవిందముల్ - భజియించు వారి
కాదరణంబు లష్టైశ్వర్యభోగ
భాగ్యంబు లారోగ్య భద్ర సౌఖ్యములు
యోగ్యతలబ్బు; నీయుర్వి నంత్యమున
నిత్య విష్ణుస్థాన నియతి ప్రాప్తించు
సత్యమీ పల్కు - విచారంబువలదు, రారా

సీ॥ రణరంగ మందున - రావణు మర్దించి
ముల్లోకములకును - ముద మొసంగి,
సజ్జన మానస సాగరంబునకును
బూర్ణచంద్రుండవై పొలిచినావు
లలితమనస్కుఁడౌ - లక్ష్మణానుజునకు
నానందము నొసంగి - యలరినావు
సీతామహాదేవి చిత్త పయోధికి
పున్నమ చంద్రుఁడై పొలిచినావు

గీ॥ రాజరాజాత్మ చంద్ర! శ్రీరామచంద్ర!
మదరిపు వినాశ! నీ నామస్మరణమెపుడు
నాదు జిహ్వాసల్పెడిగాక! మోదమలర
జయము లబ్బెడి సతతంబు - భయముదొలఁగి ౯౦

మం॥ కోదండహస్తుండు కోమలాంగుండు
ఆపదలను బాపు - హరి, ముకుందుండు
నిశిత బాణంబుల - నిఖిల దైత్యాళి
నశియింపఁజేసిన - నారాయణుండు
శ్రీరామమూర్తి - యాశ్రిత కల్పవల్లి
నారాధనమొనర్తు - నహరహంబేను. ౯౧

గీ॥ ధరణిజా విభుండే - పరతత్త్వమందు
నెఱుఁగఁజాల కుండిన - దోస మింత లేదు;
ఆతని తత్త్వంబు సేవించు - నవనిజనుల
నరయ, యమదూత లేమి సేయంగలేరు. ౯౨

సీ॥ ఎపుడు, నామది, వసియించు, శ్రీరాముండు
రాముని సేవింతు రక్తి నేను
రాముచేఁ బాతక రాసులు క్షీణించు
రామునికై - యహరహము వేతు
రాముని వలన, ఘోరాములు నశియించు,
రామునకును భక్తిఁ బ్రణుతి సేతు
రామునియందు, సుప్రేమ భక్తులు నాకు
కూడియుండెడి సదా వేడు కలర

గీ॥ రామదాసుఁడేను - ప్రేమతోఁ గౌసల్య
ముద్దు తనయుఁడైన - మోహనాంగుఁ
డెపుడు నన్నుఁబ్రోచు - నింపారు దయతోడ
భక్తినొసఁగి - వినయ భావమొసఁగి ౯౩

ద్వి॥ కార్ముకమున, దుఃఖ కరములొ శరము
లోర్మితో ధరియించి - యుద్ధరంగమున
భుజపరాక్రమముతో - భూరి శత్రువుల
గజిబిజి నొనరించు - కమల దళాక్ష!
చండాంశుఁబోలిన - సంగ్రామ భీమ!
పుండరీక వరద! ఫుల్లాబ్జ నేత్ర!
దశరథనందనా! ధర్మైక హృదయ!
కుశల మొసంగవే! కుజన సంహార! ౯౪

గీ॥ మునులు, సిద్ధులు నిన్ను సేవన మొనర్తు;
పద్మదళనేత్ర! నీపాద పద్మములను
మెట్టి దామరపూలఁ బూజింతు సతము
సీతతోఁగూడియున్నావు; శీతభానుఁ
డును, రవియు - నేత్రములుగాగ-నిన కులేశ!
వెలఁగినావు; సింహాసనాసీనుఁడగుచు
రాఘవా! రామచంద్ర! సుత్రామవంద్య!
నిన్ను సేవింతు సతతంబు - నీరజాక్ష! ౯౫

సీ॥ కరుణా స్వరూపుఁడై - ధరణి పాలకుఁడునై
స్తంభముల్ బోలు, భుజములు గల్గి
వీరుఁడై, ధీరుఁడై - విమల మనస్కుఁడై
దశరథ కొమరుఁడై - దనరునట్టి
రఘువంశరత్నమై - రాక్షసులను ద్రుంచి
విజయంబు జేకొని - వెలయు నట్టి
పొలుపారు గుణముల పూఁదోఁటయై - దశ
కంఠ, లుంఠనుఁడునై - కమల నేత్రు

గీ॥ డైన, రామచంద్రు నశ్రాంతమును భక్తి
భావమునఁ దలంచి ప్రార్థనంబు
సల్పుచుందు; దమము, శమము ప్రసాదించి
చిత్త శాంతి నొసఁగ శ్రీకరముగ ౯౬

గీ॥ జన్మము లనేకములు గల్గె - జడుఁడ నైతి;
వ్రతము లందైనఁ దీర్థయాత్రలనునైన
యోగములనైనఁ బుణ్యంబు లొందనైతి;
రాఘవా! నిన్ను స్మరియింప; రామనామ
మహిమఁదెలియగలేనైతి; మందుఁడైతి;
నిప్పుడైన, సీతాపతీ! యేస్మరించి
దాస దాసానుదాసుఁడై - తలచుకొందు
గరుణతోఁజూడఁగదవయ్య - కమలనయన! ౯౭

గీ॥ యోగ తేజస్సుచేనిండి - రాగసహిత
మైన, నేత్రంబు లొప్పారినట్టి మౌను
లే, మహాత్ముని సేవింతురెప్పుడట్టి
యోగిజనపాద కమలంబులోలిఁబట్టి
సతము సేవింతు, స్తుతియింతు, సంస్మరింతు;
రాఘవా! ఆలకింపవే! ప్రార్థనంబు ౯౮

సీ॥ రాహువు మ్రింగఁగారాదు; పగటిపూట
మలినుండుగాడు; యమపనఁజిక్క
రాడస్తమయ మొందరాదు; కళంకంబుఁ
బొందదెప్డు; ద్విపక్షమందుగూడ
శోభించు చుండును - శుభగుణంబులచేత,
చక్రవాళమును, భుజాబలంబు
గలిగి, దాటగలాడు-తెలుపుమోగమువాడు
తేజస్సుగలవాఁడు - దివ్యకీర్తి

ఆ॥ చందురుండు, దోషమందడు; గుణసము
ద్రుండు, రామచంద్రుడొందె; సుగుణ
ఖనిని, కీర్తి చంద్రుగనె; పుత్రకునిగాగ
యట్టి రామచంద్రు - నాశ్రయింతు. ౯౯

సీ॥ ఖండన రంగాన - మొండెంబు లాడెను
పేరండములు, బదివేలు నీల్గె
అక్షగుచ్ఛంబుల - భక్షించెను, యముండు
కాల్పంట్లు, యుద్ధ రంగంబునందు
నూరుకోట్లకుఁజచ్చినారు; రక్షశ్రేణి
కోట్లకు నశియించె - కువలయమున
నెత్తుటేఱులు పాఱె; తత్తరంబుల నొంది
దివిజులు జెందిరి - దిగ్భ్రమంబు

గీ॥ రామ! ఘోరాతి ఘోరమై - రణము మీఱె;
నీ ధనుర్జ్యావినాదంబు నింగి, నేల
నిండె జామున్నఱ యటన్న - ఖండనంబు
వర్ణనముసేయ, శ్రీరామ వశమె మాకు? ౧౦౦

సీ॥ ఇందీవరశ్యాముఁడినకులాభరణుండు
సంసార విపిన వృక్షములనెల్ల
కార్చిచ్చుకై పడిఁ గాల్చెడివాఁడు, పా
ర్వతికిఁ బ్రసన్నుఁడై - భావమందు
ఆనంద రూపుఁడై - యలరెడివాఁడు; సం
సార, కష్టంబుల - సమయఁజేసి
భక్తజనంబులఁబరిపాలన మొనర్చు
నార్తరక్షకుఁడు; మహా మహిముఁడు

గీ॥ రామభద్రమూర్తి - రక్షించు మము సదా
మంగళములనొసఁగి - మహిత మూర్తి
జానకీప్రియుండు - సచ్చిదానందుండు
నతనిసేవసతము - నాచరింతు. ౧౦౧

గీ॥ దేవతాళి దుఃఖంబు, దేదీప్యమాన
ముగను నాశనంబొనరించు, మూర్తివీవు
మనుజ దేహంబుఁదాల్చిన - మాన్యుఁడీవు!

గొప్ప యానంద రూపుఁడై కొమరు మిగిలి
హరిహరబ్రహ్మ మూర్తితో నలరుదీవు।
కరివరద! నిరాకార, సాకారుఁడీవు!
రామచంద్రప్రభూ। నిన్ను రాత్రింబవలు
స్తోత్రమొనరింతు రక్షింపు శుభ్రచరిత. ౧౦౨

గీ॥ శరణుజొచ్చిన వారికి సంతసంబు
నిండుగా నిచ్చినావు; కోదండరామ।
వారికిఁబ్రసన్నుఁడైనావు; వారి యాధి,
వ్యాధి, బాధలఁబోగొట్టి వఱలినావు;
వర, సుయోగీశ్వరులు, వారి భావమందు
నిన్ను సతతంబు ధ్యానింత్రు నిష్ఠతోడ
స్నేహితుండు - సుగ్రీవుండు నిన్ భజించె;
భక్తులెందఱో నీసేవ వఱలినారు
నా, యుడుతభక్తిగైకొని నన్ను నీవు
మన్ననముసేయుమా - రామ-మాప్రియుండ। ౧౦౩

సీ॥ సుపరికాశంబైన - సుందరరత్న, కే
యూర హారములచే - నొప్పువాఁడు
భూభారముగ నున్న - పొలదిండ్ల మూకను,
చిచ్చై - దహించిన - చెలువు కాఁడు
శరదృతు పూర్ణిమా-శశిబోలు ముద్దు, నె
మ్మోముతో శోభిల్లు మురువుకాడు
పొలుపైన, శ్రీ పద్మముల వంటి కన్నుల
తళుకుచే వెలయు, సౌందర్య మూర్తి

గీ॥ పాదసేవలు, సులభంబుగా దొఱకని
వాఁడు, రామచంద్రవల్లభుండు;
అట్టిరాముసేవ - ననవరతము సేయ
నిచ్చగలదు; కోర్కె పెచ్చుమీఱు. ౧౦౪

సీ॥ ఇంద్రనీలశ్యామ - ఇభ రాజవరద! వి
    రాధాది, రాక్షసవ్రజవినాశ
మకుటాది భూషణ ప్రకరంబు చేత, సిం
    గారంబుఁగొన్నట్టి కమలనాభ!
రఘువంశరాజుల - రతనమై వెలుఁగొందు
    రమ్యప్రభావ! శ్రీరామచంద్ర!
ముక్కంటి స్నేహంబు - మదమూరఁగావించి
    యుత్సాహమొందు శ్రీ వత్సవక్ష!

గీ॥ దశరథాత్మజ! వరద! సీతావినోద!
శ్రీనివాస! గోవింద! సన్మౌని వినుత!
లక్ష్మణానుజ! భక్త ప్రహ్లాదరక్ష;
నారసింహావతార; జోహారుసేతు.

మం॥ శశికోటిచంద్రికా స్వచ్ఛతమించు
ఆది పీఠంబున - యలరుచు నున్న
శ్రీరామ చంద్రుండు - సీతాప్రియుండు
బంగారు రంగుచే - భాసిల్లునట్టి
పాద పద్మములచే - పఱతెడివాడు
తగ, నివృత్త్యాది, తంత్రము గల్గువాడు
రామచంద్రుఁడతని - రాత్రింబవళ్లు
ప్రేమంబుతోసేవ - ప్రియమున జేతు. ౧౦౬

సీ॥ భోగభాగ్యంబులఁబొలుపారు చున్నట్టి
    వారలకును, కడుదూరుఁడగుచు
రాగ రహితులైన - యోగీశ్వరులకెల్ల
    గడు సమీపముగాగఁగానబడుచు
శ్రీచిదానందుఁడై - చిన్మయాకారుఁడై
    సుజ్ఞాన రూపుఁడై - సులభుఁడగుచు

భూపుత్రి, హృదయపరిమోద కారణుఁడయి
చెల్వొందు, శ్రీరాము - శ్రీశుభాంగు

గీ॥ నాది చేవు సతము-నంతఃకరణ మందు
నిలిపి ప్రార్థనంబు - నిష్ఠతోడ
సల్పుచుందు; మోక్ష సామ్రాజ్యమాకాంక్ష
జేసి, సంతసమున జింతసలిపి. ౧౦౪

గీ॥ గొప్ప యోగమాయఁ గూడినవాఁడవై
రాగ రసము జిలుకు రామచంద్ర!
లీల లెన్నఁదరమె? లీలామనుజరూప!
పంక్తి రథుని పుత్ర! పద్మనేత్ర! ౧౦౫

గీ॥ అతుల సమ్మదంబు - లానందకరములౌ
నీ విలాస కథలు - నిష్ఠతోడ
వినెడి వారియొక్క - వీనులు ధన్యముల్
పంక్తి రథుని పుత్ర - పద్మనేత్ర. ౧౦౬

సీ॥ గర్వితుండైన, కాకాసురు శిక్షించి
ప్రజ్ఞానమున బోధపఱచి యతని,
నావలనర్థింప నాతండు శ్రీరామ!
మించు, కరుణతో మన్నించినావు;
వామాంక మందున్న వనజాక్షి జానకి
చెలువారు కన్నుల బొలుపెటింగి
దుష్టరాక్షసులను - దునుమాడి, సామర్థ్య
వంతుఁడై - శ్రీరామః పరగినావు;

గీ॥ ఇంద్రనీలరుచుల - నెసగు, శ్యామశరీర!
సంతతంబు మాకు - సంతసంబు
నొసఁగి శుభ మొసంగి - దొసగులఁబోకార్చి
రక్ష సలుపుమయ్య - రామచంద్ర!

## ఫ ల శ్రు తి

సీ॥ దుర్నీతి నడిచెడు - దుర్మార్గుఁడైనను
పాపస్వభావుఁడౌ - పతితుఁడైన
కర్మ చెడ్డదికాగఁ జర్మరోగముతోడ
బాధఁజెందెడు మహాపాపియైన
తలిదండ్రులనుగొట్టి తఱుమువాఁడైనను
కొండెముల్ సెప్పెడు కుటిలుఁడైన
దారిద్ర్యఘోర బాధలఁ జెందువాఁడైన
మునుల నిందించెడు మూర్ఖుఁడైన

గీ॥ రామకర్ణామృతంబును, వ్రాసి, చదివి
విన్న, ఆధి వ్యాధు లుడిగి - ప్రీతికల్గు ;
నైహిక సుఖంబులొందవు ; భాగ్యములు గలుగు
నంత్యమందు, మోక్షప్రాప్తి నందఁగలుగు. ౧౧౧

గీ॥ పదియునారేండ్ల కే - కవిత్వమున, గాఢ
మైన మక్కువ యేర్పడె; నాంధ్రభాష
యన్న - పద్యంబులన్న - వేమన్న చెప్పి
నట్లు - కవితసాగెను బాల్య మందు కొంత ౧౧౨

గీ॥ సాధనమునఁ గవిత - సాగినదే కాని
గురులచెంతఁ గొంత గోష్ఠిలేదు;
లక్షణము, దెలియ; నలంకారశాస్త్రంబు
తఱచి చూడలేదు ; తత్త్వమెఱుఁగ. ౧౧౩

గీ॥ తెలుఁగు వారికెల్లఁదేట తెల్లముగాఁగఁ
దెలుఁగు బాస - తీపి తెలియునట్లు
రచన సల్పినాడ - రామకర్ణామృత
మాదరింపుడయ్య ! యాంధ్రులార ! ౧౧౪

గీ॥ రామ నామమెుండె - రక్తిని ధ్యానించి
వ్రాసినాఁడ; నాదు వ్రాతలందు
తప్పులెన్నొయుండు - దాసుఁడై ప్రార్థింతు
రామవిభుని, నన్ను - రక్షసేయ. ౧౧౫

గీ॥ శ్రీ రమాపతి నాకిచ్చి - చిత్తశుద్ధిఁ
గలుం బొమ్మగఁజేసి, లిఖింపఁజేసె
నాలుఁగవ ప్రకరణము; ధన్యాత్ముఁడైతి
దండమర్పింతు; కోదండధారునకును, ౧౧౬

మాలిని: మునిసముదయ హృద్యా! ముక్తికాంతా-వినోదా!
జనగణ మన వర్తీ! సాధుసంతాప-హర్తీ!
దినమణి కులదీప్తీ! దీనరక్షైక - మూర్తీ!
మనసిజ నిభమూర్తీ! మానసానంద కీర్తీ!

ఇది, శ్రీమదఖిల కవిమిత్ర, వాగీశ్వరీ దయావిధేయ, శ్రీరామ
చంద్ర, చరణారవింద సంసేవిత, శ్రీమత్కాశ్యపస గోత్ర
పవిత్ర, బడగనాటి, గూళూరు అశ్వత్థమాంబా
కృష్ణార్య, తనూభవ, కవిభూషణ, కవితిలక
బిరుదాన్వయ, కల్లూరు శ్రీ అహోబల
రాయ, ప్రణీతంబైన ఆంధ్ర
శ్రీరామ కర్ణామృతమను
పద్యకావ్యము, చతుర్థా
శ్వాసము-సర్వము
సంపూర్ణము
ఓం తత్సత్



శ్రీ సీతారామార్పణమస్తు

## శ్రీరామ భక్తులకు విన్నపము



శ్రీరామ కర్ణామృతము పఠించిన తర్వాత శ్రీ రామాష్టకము శ్రీ సీతారామస్తోత్రము, పఠించి, భక్తులు తరించెదరుగాత ।

## శ్రీ రా మా ష్ట క ప్రా ర ం భః



భజేవిశేష సుందరం - సమస్త పాప ఖండనమ్ ।
స్వభక్తి చిత్తరంజనం - సదైవరామ మద్వయమ్ ॥ ౧

జటా కలాప శోభితం - సమస్త పాప - నాశకమ్ ।
స్వభక్తిభీతి భంజనం - భజేహ రామ మద్వయమ్ ॥ ౨

నిజస్వరూప బోధకం - కృపాకరం భవాపహమ్ ।
సమంశివం నిరంజనం - భజేహ రామ మద్వయమ్ ॥ ౩

నప్రపంచ కల్పితం - హ్యనామ రూప వాస్తవమ్ ।
నిరాకృతిం నిరామయం - భజేహ రామ మద్వయమ్ ॥ ౪

నిష్ప్రపంచ నిర్వికల్ప - నిర్మలం నిరామయమ్ ।
చిదేకరూప సతతం - భజేహ రామ మద్వయమ్ ॥ ౫

భవాబ్ధిపోత రూపకం హ్యశేషదేహ కల్పితమ్ ।
గుణాకరం కృపాకరం - భజేహ రామ మద్వయమ్॥ ॥ ౬

మహావాక్య బోధకై ర్విరాజమాన వాక్పదైః ।
పరబ్రహ్మవ్యాపకం భజేహ రామ మద్వయమ్ ॥ ౭

శివప్రదం సుఖప్రదం భవచ్ఛిదం భ్రమాపహమ్ ॥
విరాజమాన దైశికం భజేహ రామ మద్వయమ్ ॥ ౮

రామాష్టకం పఠతియస్సుకరం, సుపుణ్యం । వ్యాసేన భాషి
తమిదం శృణుతే మనుష్యః ॥ విద్యాం శ్రియం విపులసౌఖ్య
మనంతకీర్తిం । సంప్రాప్య దేహవిలయే లభతేత మోక్షమ్ ౯

(ఇతిశ్రీ వ్యాస మునీంద్రరచితం శ్రీరామాష్టకం సంపూర్ణం)

## అథ శ్రీసీతారామస్తోత్ర ప్రారంభః

*హనుమానువాచ* అయోధ్యాపుర నేతారం । మిథిలాపుర
నాయికీమ్ । రాఘవాణా మలంకారం । వైదేహీ నామలం క్రియామ్ ॥౧

రఘూణాం కులదీపంచ నిమీనాం కులదీపికామ్ ।
సూర్యవంశ సముద్భూతం సోమవంశ సముద్భవామ్ ॥ ౨

పుత్రం దశరథస్యాపి పుత్రీంజనక భూపతేః ।
వసిష్ఠానుమతాచారం శతానంద మతానుగామ్ ॥ ౩

కౌసల్యా గర్భసంభూతం వేదిగర్భోదితాంస్వయమ్ ।
పుండరీక విశాలాక్షం స్ఫుర దిందీవరేక్షణామ్ ॥ ౪

మత్త మాతంగ గమనం మత్త సారస గామినీమ్ ।
చందనార్ద్ర భుజామధ్యం కుంకుమాంకిత భుజాంతరామ్ ౫

చాపాలంకృత హస్తాబ్జం పద్మాలంకృత పాణికామ్ ।
సర్వలోక విధాతారం సర్వలోక విధాయినీమ్ ॥ ౬

లోకాభిరామం శ్రీరామం అభిరామాంచ మైథిలీమ్ ।
దివ్య సింహాసనారూఢం దివ్యస్రగ్వస్త్ర భూషణామ్ । ౭

అనుక్షణం కటాక్షాభ్యాం అన్యోన్యేక్షణ కాంక్షిణౌ ।
అన్యోన్య సదృశాకారౌ త్రైలోక్య గృహదంపతీ ॥ ౮

ఇమౌయువాం ప్రణమ్యాహం భజామ్యద్య కృతార్థ తాం ।
అనయస్తౌతి యస్తుత్యా రామం సీతాంచ భక్తితః ౯

తస్యతౌ తనుతాం ప్రీతౌ సంపదస్సకలా అపి ।
ఇతీదం రామచంద్రస్య జానక్యాశ్చవిశేషతః ॥ ౧౦

కృతం హనూమతా పుణ్యం స్తోత్రం సద్యో విముక్తిదమ్ ।
యఃపఠేత్ప్రాతరుత్థాయ సర్వాన్ కామానవాప్నుయాత్ ॥ ౧౧

యఇదం పఠతిస్తోత్రం మైథిలీ రామచంద్రయోః ।
శ్రీవైకుంఠ మవాప్నోతి సనరో హతకిల్బిషః ॥ ౧౨

ఇతి శ్రీమద్ హనుమద్విరచితం శ్రీ సీతారామస్తోత్రం

సంపూర్ణమ్

# శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల,
# హిందూపురము.
# స్వర్ణోత్సవ విశేష కార్యక్రమములు
## (1931-1981)

రాయలసీమ సాహిత్యాభివృద్ధి పుస్తక ప్రచురణద్వారా సాగించవలయునను సత్సంకల్పముతో 1931 వ సం॥లో బళ్లారి పట్టణమున స్థాపింపబడిన ఏకైక గ్రంథమాల శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల.

రాయలసీమలోని దాతల రచయితల, పాఠకుల, దాతృత్వ, ప్రేమాదరణ, ఆశీస్సులతో 50 ఏండ్ల నిండుదనముతో, శోభాయమానముగా బంగారుబాట మీద పరుగులిడి వచ్చినదీ గ్రంథమాల. ఇప్పటికి అనుబంధములతోబాటు 30 గ్రంథములను ప్రచురించినది.

ఈ

స్వర్ణోత్సవము

రాయలసీమ సాహిత్య చరిత్రలో

ఒక సువర్ణఘట్టము.

మన సాహితీ చైతన్యానికి నిదర్శనము. ఈ స్వర్ణోత్సవ సందర్భముగా ఈ క్రింది కార్యక్రమాలు నిర్వహింపబడును.

♦ రాయలసీమ సాహిత్యాన్ని ప్రతిబింబింపజేసే ఒక ప్రత్యేక సంచిక ప్రచురించుట.

♦♦ 1981వ సం॥లో 3 రోజులు 'స్వర్ణోత్సవ సాహిత్యసభలు' జరుపుట.

♦♦♦ రాయలసీమ కవుల ముద్రిత - అముద్రిత ప్రచురణల ప్రదర్శన ఏర్పాటు చేయుట.

♦♦♦♦ మఱుగుపడిన రాయలసీమకవుల చిత్రపటములు, సన్మాన చిత్రములు ప్రదర్శించుట; తదితర ముఖ్య కార్యక్రమములు— కాన,

♦ రచయితలు అన్ని సాహిత్య ప్రక్రియలలోను రత్నాలవంటి రచనలను ప్రత్యేకముగా వ్రాసి 1981 మే నెల లోపల పంపగోరినాము.

రచనలు 6 అరఠావు పేజీలకు మించరాదు. కవరుమీద 'స్వర్ణోత్సవ సంచికకు' అని వ్రాసి కార్యదర్శి శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల అను పేర పంప మనవి.

** స్వర్ణోత్సవ సాహిత్య సభలు జరుపుటకు ప్రభుత్వము, తదితర అధికారులు, దాతలు, సాహిత్య సంస్థలు విరివిగా విరాళాలు పంప ప్రార్థన. అట్లే వ్యాపారస్థులు తమ వ్యాపార ప్రకటనలను 'సావనీరు'లో ప్రచురించుకొని మాకు సహాయపడ ప్రార్థన- వివరములకు మేనేజింగ్ ఎడిటర్‌గారికి వ్రాయ విజ్ఞప్తి.

*** రాయలసీమలోని సాటి సాహితీ సంస్థలు, ఈ స్వర్ణోత్సవ కార్యక్రమాలలో పాల్గొని, తాము సేకరించిన ముద్రిత-అముద్రిత పుస్తకములు ప్రదర్శించుటలోను, అజ్ఞాత కవుల ఫోటోలు ప్రదర్శించుటలోను ముందుకురా ప్రార్థన. వివరాలకు వ్రాయండి.

**** పాఠకులు, సాహిత్యాభిలాషగలవారు ముందుగా రూ॥ 15/- పంపి ప్రత్యేక సంచికను రిజర్వుచేసుకొన వచ్చును. ఇది ఉభయతారకము కాగలదు. ప్రతులు మితముగా వేయబడును.

***** సాహిత్య పోషకులు స్వర్ణోత్సవ కార్యక్రమాలకు ద్రవ్యసహాయము చేసి చేయించ ప్రార్థన. వారి కృషి ఆచంద్రతారార్కముగ నిలువ గలదు. కళాశాలలు - పాఠశాలలు, గ్రంథాలయాధికారులు, గ్రంథ మాల ప్రచురణలు విరివిగాకొని సహకరింప మనవి. 1) శ్రీరామ కర్ణామృతము 2) రాయలసీమ రచయితల చరిత్ర 3వ భాగము, స్వర్ణోత్సవ విశేష ప్రచురణలు.

ఈ కృషి పూర్తిగా రాయలసీమ వాసుల భుజస్కంధాలపై ఆధారపడి ఉంది. ఈ బృహత్తర కార్యక్రమమునకు ఎల్లరి సహాయ సహకారాలను అర్థించుచున్నాము.

ఇట్లు విన్నవించు

హిందూపురము
516 201
1-11-80




శ్రీ కల్లూరు అహోబలరావు
మేనేజింగ్ ఎడిటర్
శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల